# దారాషకో

(హిందూ మహమ్మదీయ సంఘీభావరూపకము)

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ:

# దారాషకో

## హిందూమహమ్మదీయ సమ్మేళనాశాపకమగు

## నాటకము.


రచయిత:

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ

(రామారావుపేట, కాకినాడ)



మొదటికూర్పు 1,000 ప్రతులు.

కాకినాడ:

పట్టమట్ట శేషగిరిరావుగారి జార్జిప్రెస్‌యందు ముద్రింపఁబడి

గ్రంథకర్తచేఁ బ్రకటింపఁబడియె.

1949.




[వెల ఒకరూపాయి.

## FOREWORD.

I have been asked by the young author of a Telugu Drama on the famous scholar, Mahakavi-rai Panditaraj Jagannath. This is a delicate task for a historian. This drama of Mr. Sharma covers almost the same field as that of Shahjahan, a highly popular Bengali drama by our D. L. Roy. Nevertheless Mr. Sharma's drama is written from an independent Azad-Hind stand point, and he has shown considerable originality in handling the matter. We have the best model for a political drama in *Mudra Rakshasam*, so full of action and so free from the common vice of modern Indian dramas; namely tiresome dialogues and discourses put into the mouths of chief actors. A dramatist cannot, however, dispense with this method, though faulty, of making an appeal to the imagination of the audience and voicing the sentiments of his time.

I hope, this drama of Mr. Sharma will be given a fair trial on the stage for the sake of re-establishing in fame the great scholar and politician, Pandit-raj Jagannath in the country of his birth.

Sd. K. R QANUNGO,
(Professor and Head of the Department
of History, Decca University.)

# విజ్ఞప్తి

నేనీనాటకమును రచింప 1945 సంవత్సరమున అక్టోబరునెలలో బ్రారంభించి మార్చి 1946 నాఁటికెట్టులో పూర్తి చేయఁగలిగితిని. ఆనాఁటికి దేశమునకు బ్రిటీషుపరిపాలకులే యధికారమునందుండిరి. దేశమింకను విభాగముకాలేదు. ఈకావ్యమునందు,హిందూమహమ్మదీయసఖ్యతకై షాజహాన్ జ్యేష్ఠపుత్రుఁడగు దారాషకో సలిపిన యసమానకృషిని దృశ్యప్రబంధరూపమున నిరూపించినచో, దేశమునందుఁ బెచ్చు పెరుగుచున్న మతవిద్వేషసంఘద్వేషములనరికట్టుటకై, శ్రీరాముని సేతువ కుడుతపిల్లసాయమువలె, గాంధిమహాత్ముని యనన్యసామాన్యప్రచారమున కీషత్తమణుమాత్రమైన తోడ్పడునేమోయనునాసతో నిదిరచింప మొదలిడితిని. దీనినిరచింప నారంభించునాటికె నేను మలేరియాజ్వరపీడితుఁడనై నానాఁటనారోగ్యముపూర్తిగ జెడుటయు, దానికిఁదోడు కాగితము చాలకఱవగుటయు తటస్థించెను. ఆకారణములచే నీరూపకమును పాఠకలోకమునకు సకాలమున కర్పింపఁజాలకపోవుట నాదురదృష్టము. నాకు శరీరారోగ్యము గత మూఁడువత్సరములనుండియుఁ బూర్తిగచేకూరకుండుటయు ముప్పదిసంవత్సరములకుఁబైగ సేవకావృత్తియందె యుదరపోషణార్థమై జీవితమును గడుపుటచేత నాయాభాషాసాంప్రదాయములును, కవితాపరిపాటియు మఱుగువడినవని

చెప్పకతప్పదు. ఇందు దొరలిన దోషములు పాఠకమహాశయుల యాదరణమునకు వదలుచు నట్టివానినీశ్వరకటాక్షముచే నిది పునర్ముద్రణముగను సంతతిభాగ్యము నాకబ్బినచో నాముద్రణమునందు సవరించుకొందునని మనవిచేయుచున్నాను. నేనీ నాటకమునందలి ప్రతిరంగమునకును సారాంశములనువ్రాసి, "దారాషకో" చరిత్రమును రచించిన శ్రీయుత కలికరంజన్ కనుంగో M. A. Ph. D. గారికిఁ బంప వారు నాకృతికి తొలిపలుకు వ్రాసి దయతోఁ బంపినందులకు శ్రీ కనుంగోగారికి వందనశతంబు లర్పించుచున్నాను.

ఇట్లు
బుధవిధేయుడు
**భమిడి సత్యనారాయణశర్మ.**

## —• ఈనాటకమునందు వచ్చు పాత్రలు •—

### పురుషులు.

(1) షాజహాన్:—మొగలాయిచక్రవర్తి.
(2) రాణాజగత్సింహుఁడు:—మీవారు సంస్థానాధిపతి.
(3) అసఫ్ఖాన్:—షాజహాన్ మామగారు.
(4) దారాషకో:—కథానాయకుఁడు షాజహాన్ పెద్దకుమారుఁడు
(5) షుజా:— షాజహాన్ రెండవకుమారుఁడు.
(6) ఔరంగజీబు:—డిటో మూఁడవకుమారుఁడు.
(7) మురాదు:— డిటో నాల్గవకుమారుఁడు.
(8) సాదుల్లాఖాన్:—షాజహాన్ ప్రధానమంత్రి.
(9) పండితరాయలు:—(జగన్నాథపండితుఁడు.) దారాకు సంస్కృతవిద్యాగురువు—షాజహాన్ రాజ్యమునందు హిందూధర్మములను గాపాడు పండితరాజపదవియందుండిన మంత్రి.
(10) జైసింహుఁడు:—షాజహాన్ సేనలో రాజపుత్రనాయకుఁడు.
(11) సులేమాన్షకో:—దారా పెద్దకుమారుఁడు.
(12) సిఫీర్షకో:—దారా రెండవకుమారుఁడు.
(13) సైప్షిఖాన్:—మహమ్మదీయ సేనానాయకులలోనొకఁడు.
(14) దావుద్హాకీం:—చక్రవర్తి వైద్యుఁడు—మహమ్మదీయ పండితుఁడు.
(15) మాలికజీవన్:—సింధురాష్ట్రమున నొకఖిల్లాదారు.
(16) మీర్జుమ్లా:—మహమ్మదీయ సేనానాయకుఁడు. సాదుల్లా తరువాత ప్రధానియయ్యెను.

(17) ఖుస్రూ:—జైలధికారి.
(18) రహీం:—ఉరిదీయువాడు.
(19) హైబత్ ఖాన్:—దారా సేవకుడు.
(20) ఫిరోజు:—దారా సేవకుడు.
(21) మహాదేవుడు:—పండితరాయుని యన్నకుమారుడు.
(22) మాధవుడు:—పండితరాయుని శిష్యుడు. మహారాష్ట్రుడు.
(23) నజీర్ బేగ్:—రోషనారా వంటవాడు.

—: స్త్రీలు :—

(1) జహానారా:—షాజహాన్ పెద్దకుమార్తె.
(2) రోషనారా:— డిటో రెండవకుమార్తె..
(3) నదీరాబీగం:—దారాభార్య.
(4) విద్యావతి:—పండితరాయుని భార్య.
(5) ఉన్నీసా }
(6) నైనా } నదీరా చెలికత్తెలు.

సేవకులు, అశ్వికులు, సర్దారులు.

శ్రీరస్తు.

శ్రీవేంకటబ్రహ్మణేనమః

కృతిసమర్పణము.

క. శ్రీశేషాద్రి నివాసిగ,
దేశంబున నాల్గుదిశలు ♦ దీపింపఁగలిన్।
కేశవ! శాసింపఁగ నా।
వేశించితి! భక్తకోటి ♦ వేడ్కభజింపన్॥.

గీ. ఋషులమతమందు నీప్రేమ ♦ రీతియెల్లఁ।
దెల్లమాయెను మంగాంబ ♦ నొల్లఁజేసి।
ముసలమానులమతమందు ♦ రసముఁగదుర।
బూబునాంచారి కౌఁగిటఁ ♦ బొసగితౌర!॥

చ. బిసరుహసుందరాక్షి! కడుఁ ♦ బ్రేమఁదలిర్చెడి భామ
లెందఱో।
వసుమతినీకుఁగల్గినను ♦ వాడనిప్రౌఢిమఁజూప ధాత్రిలో।
రసికుఁడవీవెయంచు నిదె ♦ రమ్యతరంబగుఁగావ్యకన్యకన్।
బొసఁగెడుప్రీతినీయ నిటు ♦ పూనికమైనినుఁగంటి భక్తితో।
నెసఁగెడు రక్తినొప్పు నిది ♦ యెంతయు వింతలయింతి
గాన, నో!
లసదమలాంగ! నీవుతగు ♦ లాలనసేసిభరింపు మెన్నఁడున్॥
గసరక నెమ్మిమీఱఁగని ♦ కంటికిఱెప్పయొనాఁగఁగాచి నీ।

పసగలదక్షిణత్వమునఁ-బాలనసేయుము చిన్నికన్నియఁ|
గొసగలము త్రియంబనుచుఁ ♦ గూరిమిమీఱఁగఁ బెంచి
నాఁడ బు|
త్రిసమముగాఁగ. లోకమున ♦ ధర్మము నర్థముఁగామ
మందు, సి|
కు, సరిగవర్తనంబు సమ ♦ కూర్పఁగ సాక్షివినీవెగాన నే|
వెసఁజను బెంచి నీపదము ♦ బిట్టుగ,బట్టితి, నెట్టులైన నే|
మసఁగొనుమింకఁదప్పది దె-మంగళవాక్యములొప్పనిత్తునా|
దెసనొకకీడు, దోఁపక యొ-తియ్యనిపల్కు-లనాదరించి పా|
దసరసిజాతముల్గడుగ-దారియొసంగుచు నన్నుఁబ్రోవ సే|
యసదృశవీక్షణంబులఁ గ-టాక్షముసేయుము వేంకటేశ్వరా||

## —: నాంది :—

శా॥ శ్రీమీాఅర్ రవిచంద్రదీప్తి భువన-క్షేమంకరప్రక్రియన్ ।
కామాదిప్రతికూలదైత్యబలసం-ఘాతంబులన్ జెంపుచున్ ।
నేమంబొప్పఁజరించు తేజము సదా-నిశ్రేయసంబిచ్చు శ్రీ।
హేమాద్రిప్రతిమానధీరులకు, నీ-హింమూముసల్మాన్లకున్ ॥

శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# దా రా ష కో



## ప్రథమాంకము :- 1 వ రంగము.

(1) షాజహాన్. (2) దారాషకో. (3) రాణాజగత్సింహుఁడు.
(4) అసఫ్ఖాన్. (5) జగన్నాథ పండితరాయలు.

అందఱు నుచితాసనములపైఁ గూర్చుందురు.

షాజహాన్ :—జగత్సింహప్రభూ ! మీ యాదేశానుసారముగ మీరాజ్యమునకు వచ్చితిమి. మాకు ఢిల్లీ, సింహాసన ప్రాప్తికై మా మామయు మీరును సర్వసన్నాహము జేయుచుండ మాకేమికొదవ ? పెద్దలగు మీయిరువు రును మాక్షేమము గోరినవారుకదా.

జగత్సింహుఁడు :—అసఫ్ఖాన్ సోదరులు హస్తినాపుర సింహాస నమును మీహస్తమునందుంచుటకు సర్వసిద్ధము జేసిరి. అందులకు ముందిచ్చట మంగళాచరణము చేయుటకై దక్షిణమునుండి యిచ్చటకు మిమ్మాహ్వానించితిమి.

షాజ :—మా మాతృసోదరులైన, మీరును, మాతండ్రినాటి నుండియు మొగలాయిరాజ్యమునకు సర్వసైన్యాధి పత్యమువహించి కడుసమర్థతతో నిర్వహించుచున్న

మా మామయు నాకు రెంపుభుజములైయుండ నిక
మొగలాయిరాజ్యము నాకుఁగరతలామలకము.
(జగత్సింహుఁడులేచి షాజాహానును సుగంధద్రవ్యములతోను
చక్కనిహారములతోడ నలంకరించి యొకకిరీటమునాతని
తలపై నుంచును.)
జగన్నాథపండితుఁడు :—(పుష్పమాల నొకదానిఁదీసికొని)

ఉ॥ స్వస్తి దిగంతకీర్తివిభ ♦ వాంచితవర్తికి బాహుపీఠవి।
న్యస్త విశాలరాజ్యభర ♦ నైకసమర్థునకున్ పరాక్రమ।
ధ్వస్త సమస్తవైరి నృప ♦ వాహినిజేతకు నార్తరక్షణా।
శస్త్రకరాంబుజాత ఘన ♦ సాహసకున్ మొగలాయి
వీరుకున్ ॥

సీ. మొగలసామ్రాజ్యంబు ♦ మొదటనాటిన నాఁటి
బాబరువలె దైవ ♦ భక్తి నెగడి।
మానరక్షణకు హు ♦ మాయూన్ ప్రభువుతో స
రిగ తూఁగెననెడి కీ ♦ ర్తినిగడించి।
హిందూముసల్మానుల ♦ ల్లసంతోషింపఁ
గరుణగాంచుటను న ♦ క్బరునిమించి।
జోదుబాయీమాతఁ ♦ జూచినరీతిని,
హైందవస్త్రీల నీ ♦ వాదరించి।
గీ॥ జాతి మత భేదములులేక ♦ జల్లనైన।
నీతిమార్గంబె నియతితో ♦ నెగడుచుండ।

భరతవర్షంబు పాలింపు • భవ్యకీర్తి ।
షాజహాన్ ప్రభువర్యు డో • స్సారధుర్య॥.

జగత్సిం:—చక్రవర్తీ! ఈపండితపుంగవుని మీయాస్థానమున హైందవ పండితునిగ నంగీకరింపఁ గోరుచున్నాను. ఈతఁడు మంచిరాజకార్య నిపుణుఁడు.

అసఫ్:—ఈవిద్వాంసుని చక్రవర్తి యాస్థానమునందు నెల కొలుపుట నాకును జాలసంతోషమె. ఈపండితుని రాజ్యతంత్రజ్ఞతచే మనకును రాజస్థానమునకును పూర్తి యైన సహకారముకలుగునని జగత్సింహప్రభువు వచించుటచే మనమువీరిని ముఖ్యముగ నాదరింపవలెను.

షాజ:—ఇంతకన్ననా। ఈవిప్రునియందసమాన తేజముమెరి యున్నట్లు మాకును దోఁచుచున్నది. మీయిర్వుర నన్న లకును పాత్రుఁడైన నీపండితపుంగవుని మేము ముఖ్య ముగ నాదరించుచున్నాము.

దారాషకో:—(లేచి) తండ్రీ! మీతోఁగూడ నేను త్రిలింగ దేశమునందున్నప్పుడు, నాకు హిందూమత సాంప్రదా యములందును, సంస్కృతవాఙ్మయమునందును బరిచ యము కలిగియున్నది. దానినీపండితవర్యుని సహాయ మున నభివృద్ధి నొందించుకొనుట కనుజ్ఞనొసంగఁ గోరు చున్నాను.

షాజ :—బిడ్డా ! నీకట్టి కుతూహలమున్నచో నీపండితుని నీకు హైందవగురువుగ నియమించుచున్నాము. పండితవరా! మీరుమా వెంట హస్తినాపురికి రావలెను.

జగన్నా :—సార్వభౌమా ! మీరు నన్నింతగౌరవముతో నంగీకరించినందులకు నేనుకృతజ్ఞుఁడను.

[షాజహాన్ తనజేబునుండి యొకముత్యమునుదీసి తాంబూలము నందుంచి జగన్నాథపండితున కొసఁగును. పండితుఁడు తాంబూలమును గ్రహించును.]

జగత్సిం:—పండితవర్యా ! షాజహాన్ప్రభువు చాలసరసుఁడు. బహుకళావేది. చక్కనివిద్వాంసుఁడు. ఆప్రభుని మెప్పువడయుటకై మీసర్వశక్తి యుక్తులను వినియోగించి మొగలాయి రాజ్యక్షేమముకొఱకును హిందూదేశ సౌభాగ్యమునకును మీయపార రాజ్యతంత్రనిర్వాహణ కళాకౌశలముచే దేశహితమాచరించుటయె మాకభిమతము.

జగన్నా :—దయామయుఁడగు భగవంతుఁడట్టి మహత్తరావకాశము నాకొసఁగుగాక. దారాప్రభువు యువకుఁడైనను హిందూమతసాంప్రదాయములందును, సంస్కృతవాఙ్మయమునందును గుతూహలతఁజూపుటఁజూడ వారి ప్రపితామహుఁడైన యక్బరుచక్రవర్తి తమకార్యశేష

ముచు నిర్వర్తింప మరల యవతరించినట్లు నాకుఁబొడ
గట్టుచున్నది.

జగత్సిం:—అట్లయినఁగాక. చక్రవర్తి! అసఫ్‌ఖాన్‌వరా!
భోజనమునకు వేళయైనది. నేఁజేయునల్పాతిథ్యము నం
గీకరింపఁ గోరుచున్నాను.

అసఫ్:—అవశ్యము.

[తెరదింపవలెను].

---

## 2వ రంగము.

### ఢిల్లీకోటలో

దివాన్–ఐ–ఖాస్–మహాలునందు.

(1) షాజహాన్ (మయూరసింహాసనము నధిష్ఠించియుండును)
(2) దారాషకో (తండ్రి ప్రక్క నొక యుచితాసనమున
కూర్చుండును.)
(3) షుజా:—(దారా తరువాత కూర్చుండును).
(4) ఔరంగజేబు:—(షుజా తరువాత కూర్చుండును).
(5) మురాదు:—(ఔరంగజేబు తరువాత కూర్చుండును.)

వారి కెదురుగ :—

(6) అసఫ్‌ఖాన్. (7) సాదుల్లాఖాన్. (8) జగత్సింహుఁడు
(9) జైసింహుఁడు. (10) దావూద్‌హకీం. (11) జగన్నాథ
పండితుఁడు. (12) మాధవుఁడు (జగన్నాథ పండితుని
శిష్యుఁడు.) కూర్చుండియుందురు.

(ఇరువురుసేవకులు ఖడ్గపాణులై చక్రవర్తికిరువంకల
నిలువబడుదురు)

సాదుల్లాఖాన్ —(లేచి) సభాసదులారా! షాజహాన్ చక్రవర్తి నేడొక ప్రకటన గావించుటకై మిమ్ములనందఱ నిటః కాహ్వానించిరి. ఈశుభదినమున జక్రవర్తి జ్యేష్ఠపుత్రుః లైన దారాషకో ప్రభువు జన్మదినోత్సవముకూడ నగుః టచే మొగలాయి రాజ్యమునందలి యాయాభాగములకు జక్రవర్తి తమనలువురు కుమారులను ప్రతినిధులుగా నియమించుచున్నారు. దారా ప్రభువును పంజాబునకును షుజా ప్రభువును బంగాళమునకును, ఔరంగజేబు ప్రభువును గుజరాతునకును మురాదుప్రభువును దక్షిణదేశమునకును నియమించుచున్నారు. వారికి నీప్రమాణముమును గైకొందురుగాక.

[అని సాదుల్లా దారాకొక ప్రమాణపత్రమునందిచ్చి తన
యాసనమునఁ గూర్చుండును]

దారా:—(ప్రమాణపత్రమును ప్రధానమంత్రినుండి గైకొని, లేచి, నిలువఁబడి ఇట్లు బ్రమాణముఁ జేయును):— నేను పంజాబురాష్ట్ర ప్రతినిధిగనుండి మొగలాయిరాజ్యక్షేమముకొఱకును యందునివసించునట్టి మహమ్మదీయ హిందూ మతస్థుల సంరక్షణముకొఱకును నా సర్వశక్తులను వినియోగించి, ప్రజాసేవయు మతసేవయుః

ప్రభుసేవయు నిరంతరము సలుపుచు, చక్రవర్తియెడ భక్తి కలిగి యుందుననని. మనఃపూర్వకముగ నల్లాపైఁ బ్రమాణము సేయుచున్నాను. (అని జదివి పత్రమును షుజాకిచ్చి చక్రవర్తికెదురుగ మోకరించి సలాముచేసి మరల తనయాసనమునఁ గూర్చుండును.)

షుజా:—(లేచి దారావలెనె ప్రమాణమునుగైకొని పంజాబునకుమారుగ బంగాళము అనిమార్చిచదివి దారావలెనె తండ్రికిసలాము జేసి తనస్థానమునఁ గూర్చుండును.)

ఔరంగజేబు:—(లేచి షుజావద్దనుండి పత్రమునుగైకొని అందున్నప్రమాణమునందలి 'హిందూ' అనుపదమునువదలి తనపరగణా గుజరాతు యనిజదివి, పైవారివలెఁదండ్రికి సలాముచేసి తనయాసనమునఁ గూర్చుండును.)

మురాదు:—(ఔరంగజేబువద్దనుండి ప్రమాణపత్రమునుగైకొని దారా,షుజాలవలెనె జదువుచు, తనపరగణామాత్రము దక్షిణము అనిమార్చి పైవారివలెనె తండ్రికిసలాముచేసి తనస్థానమునఁ గూర్చుండును.)

షాజ:—పండితవర్యా! మీరింక గానమును ప్రారంభింపవచ్చును

జగన్నాథపండితుఁడు:—(సేవకుఁడులోననుండి యొకతంబుర మాథవునకందిచ్చును. అంతట జగన్నాథమాధవులొక ముఖమల్ మెత్తపైఁ గూర్చుందురు.)

ఔరం:—(లేచి)నాయనగారూ! మీరుదయాపూర్వకముగ నేఁడునాకొసంగిన రాజప్రతినిధిపదవికిని, నాకుమీరుగావించిన యీయపూర్వాదరమునకును గృతజ్ఞతాసూచకముగ, నేనొకసారి మోతీమసీదునకుఁబోయి, యాయల్లాకు వందనములర్పించి వచ్చెదను. సెలవొసంగవేఁడుకొనుచున్నాను.

షాజ:—అవశ్యముగ నట్లుచేయవచ్చును కుమారా! (ఔరంగజేబునిర్గమించును.)

మాధవుఁడు:—(తంబురశ్రుతిని బ్రారంభించును.)

జగన్నా:—ద్వి॥ గురుకృపభీష్మాది – గురువులతోడఁ।
గురువంశమంతయుఁ – గురుభూమిలోన।
శూరులౌరసపుత్ర – వీరులతోడ।
ఘోరయుద్ధంబునఁ – గూలి దేశమున।
బేరువాసియులేని – పిఱికిపందలును।
గౌరవహీనులౌ – కాపురుషులును।
పరులనువంచించి – బ్రతుకువణిజులు॥
పరసేవకైజను – బ్రాకులాడఁగను।
జారచోరులబాధ – చాలహెచ్చంగ।
భారతవర్షంబు – పరితాపమొంద॥
శూరుఁడౌప్రభులెందు – జూడరాకున్న॥
ఘోరిమామూదుతోఁ – గొంకకబోరి॥

మరమునపృథ్వీశుఁ — డొరగంగఁదాను
పరికించికావంగ — ప్రభువులులేక।
పరరాజకులముచే — భరతఖండంబు।
పరిపాలనముసేయ — బడుచుండగాను।
పరిపరివిధముల — పాఁడిపంటలను।
పరులుదోచుకొనంగ — ప్రజలల్లలాడ।
భారతస్త్రీల గా — డ్పడఁగొంచుఁబోవ॥
బీరంబువోనాడి — బిరుదులువిడిచి।
పౌరుషహీనులై — ప్రజపడియుండ।
భారతభూమికి — బాబరేతెంచి।
ధీరుఁడైరాజ్యప్ర — తిష్ఠయొనర్చె॥
కారుణ్యమునగావ — గాసంతసమొంది।
పరరాజ్యమనియెడి — భావమ్ములేక।
వఱలెడుభక్తితోఁ — బ్రజలుగొల్వంగ।
ధీరుఁడౌమీతాత — స్థిరకీర్తితోడ।
భారతావనినెల్లఁ — బాలించెఁదొల్లి।
చిరకీర్తిమీతండ్రి — చెలఁగిపాలించి।
స్థిరమైనయీరాజ్య — భరమునీయందు।
కరము ప్రేముడినిల్పి — గాంచెస్వర్గంబు।
కరుణాహిందువులను — దురకలనెల్ల
సరిసమానులుగాఁగ — సంతోషదృష్టి।
యిరుసంఘములప్రజ — కింపుదళ్కొత్త।

నీ రెంటసంఘాల - నెసఁగువిజ్ఞాన।
సారమేకముచేసి - సౌరుచేకూర్చి।
భరతఖండమ్ముసౌ - భాగ్యమొందంగ।
వఱలెడుసం ప్రీతి - బాలించుచుండ।
దారక్షితీశుండు - దాక్షిణ్యమూర్తి
మీారాజ్యభారంబు - మీాజాడలరసి।
తురకలహిందువులఁ - దులగాననీతి।
పరిపాలనముసేయ - బిరుదుతాఁబూన।
భారతవర్షమ్ము - భయమింకవీడి।
పౌరుషజ్ఞానము - ల్వరగ మిన్నంది।
మరలవాఁడలమెత్తి - మసలఁగన్నార।
చిరకాలమునగాంచ - చేకూఱెనయ్య।
పరమేశ్వరుఁడుమిమ్ము - గరుణతోఁగాంచి।
యురుకీర్తియొసఁగిమి - మ్మరసిరక్షించు ॥

"శ్లో॥ భూమీానాథ 'శహాబదీన' భవతస్తుల్యోగుణానాంగణై
రేతద్భూతభవ ప్రపంచవిషయేనాస్తీతికింబ్రూమహే?
ధాతా నూతనకారణైర్యదిపునస్సృష్టింనవాంభావయే
న్నస్యాదేవ తథాపి తావకతులాలేశందధానోనరః॥"

పాజః—(గడ్డమునివురుకొనుచు) పండితవర్యా! మీాగానామృతము చాలనద్భుతము! భావగర్భితమగు మీాగీతికావైఖరి మృదుమధురమైన మీావాఙ్మయమునకె తగియున్నది.

జగన్నా:—చిరకాలము దక్షిణహిందూదేశమునకు రాజప్రతినిధి గనుండి తెలుఁగుదేశమున ప్రభువులు కొంతకాలమునివ సించుటచేఁగాఁబోలు, మాకర్ణాటగానంబునను మావా ఙ్మయమునందును చక్కనియభిరుచి చక్రవర్తికమాఁ యుండెను.

దావుద్‌హాకీం:—పండితవర్యా! మీగానమార్దవము మీవాఙ్మ యపరిచయమక్కఱలేకయె శ్రోతలహృదయము నాక ర్షింపఁగలదు. (తనలో) ఈపండితుండు బలేచిత్రమైన మానిసివలె గనుపట్టుచున్నాఁడు!

జగన్నా:—షాజహాన్‌చక్రవర్తియు, రాజకుమారులును, హిందూమహమ్మదీయ విజ్ఞానములు రెండును రెండునేత్రము లవలెఁ జూచుకొనుచు నీమొగలాయిరాజ్యము నఖండ వైభవముతో వెలయింపఁబూనుట చాలముదావహము నేఁడు వారట్టిప్రమాణములఁ గైకొనుటచే ప్రజలుచాల సంతుష్టిజెందెదరు.

దారా:—తండ్రీ! ఈపండితపుంగవునియొద్ద నేను హైందవవి జ్ఞానవిషయములు గ్రహించుచుంటిని. వీరిరాజకీయపరి జ్ఞాన మపూర్వభావవిలసితము. ఇట్టిపండితునియనుభవ ములు భావిభరతఖండ పరిపాలనావిధానమున కత్యంతా వశ్యకములు.

జగన్నా:—ప్రభూ! సర్వమానవ సౌభ్రాతృత్వమును జూపు నట్టిమీసాంఘికజీవనమునకు నిఖిలజీవకారుణ్యమునుస్సు

టించు మా విజ్ఞానవిలసనమునవలన బంగారమునకుఁ బరి మళమబ్బినట్లీ విశాలభరతఖండమునందొక నూతనశక్తి పొడకొని మనరెండువిజ్ఞానముల యేకీభావమువలన దేశౌన్నత్యము పెంపొందుననుట నిస్సంశయము. మీ తాతయగు నక్బరుచక్రవర్తి నాటినబీజములను మహా వృక్షముగ మీరు పెంచిరి. ఇఁకదానినుండి యమృత ఫలములను దీయుభాగ్యము దారాప్రభువు హస్తము లందున్నది.

షాజ:—మీరుచెప్పినదెంతయు సమంజసము. మొగలాయి రాజ్యము వృద్ధినొందవలెనను సదుద్దేశ్యముతో మా తాతయగు నక్బరుచక్రవర్తి హిందూ మహమ్మదీయ సంఘ సఖ్యతచేకూర్చి వీరులగు రసపుత్రులనుండి మా తల్లిగారిని మాతండ్రిగారికిఁ బరిణయమొనరించెను.

దారా:—నాయనగారూ! మనసామ్రాజ్యము చిరస్థాయిగ నుండవలెను. మనకుఁగూడ జన్మభూమియగు నీహిందూ దేశమభ్యున్నతికి రావలెను. ఈరెండాశయములను నెఱ వేరుటకు హిందూమహమ్మదీయ సంఘములు రెం డును పరస్పరసమాన స్నేహములతో వర్ధిల్లవలెను. లేని యెడల నీరాజ్యము కేవల మతపరమార్థజ్ఞాన శూన్యు లగు నావేశపరుల చేతిలోఁబడి వినాశముచెందును.

అసఫ్ఖాన్—శహభాష్! గానవిద్యాప్రదర్శనమును, మహా రాజకీయ సమస్యగాఁగూర్చిన జగన్నాథపండితుని గీతి

కాశక్తి మిగుల స్తవనీయము. మేము పెద్దవారమైతిమి. హిందూమహమ్మదీయ మైత్రికై మేముచేసినకృషి దారాప్రాప్తిగ సఫలతనొందింపఁగలఁడని యూహించుచున్నాము.

షాజ:—పండితవర్యా! మీగానవైభవమునకును మీరాజ్యసేవాదీక్షకును మిమ్ము వెండినాణెములతోఁ దులతూఁచి మీకుపారితోషికముగ నిచ్చుచున్నాము. మన రెండు సంఘముల మైత్రికిని మీరు మాదారా కుమారునకుఁ దోడ్పడి మొగలాయిరాజ్య వైభవమును సర్వతోముఖముగ వెంపొందించుటకు నిరంతరము కృషిచేయుదురుగాక.

దావుద్:—(తలపంకించుచు గడ్డమూఁటిక నివురుకొనుచు దనలో) ఈహిందూపిశాచము మామొగలాయి దర్బారునందు పాదుకొనునట్లున్నది!

జగన్నా:—సార్వభౌమా! తమయాజ్ఞానువర్తికింతగా తమరు సెలవీయవలెనా? అవశ్యకర్తవ్యమును చేయుటకు నే నెన్నఁడును వెనుదీయను. రాజకుమారులవంటి విశాలహృదయు లీదేశమున నాచంద్రతారముగఁ బాలించునటుల నాసర్వశక్తియుక్తులను ధారపోసెదను.

జగత్సింహుఁడు:—నేఁడు చాల సుదినము.

జయసింహుఁడు:—సార్వభౌములు తలంచిన కార్యము బహుజన స్తవనీయము. కాని రాజకుమారులందఱును గలసి

యట్టి మహత్తరసమన్వయమునకుఁ జేయూఁత నొసంగ వలెనుకదా!

సాదుల్లా:—(తనలో) ఔరా ! ఈహిందూపండితుఁ డెంతటి యుక్తిపరుఁడు! మొగలాయిరాజ్య క్షేమమను పేరుతో మామహమ్మదీయరాజ్యమునందు హిందువులకుఁగూడ సమానహక్కులను బ్రతిపాదింపవలెనని ప్రయత్నించుచున్నాఁడు. దారా హిందూపక్షపాతము నండగాఁగొని మొగలాయిరాజ్యమున హిందువుల పలుకుబడిని సాగింపఁజూచుఁచున్నాఁడు. నిజముగ దారాయె చక్రవర్తియైనచో మహమ్మదీయులనిన హిందువులకున్నభయము పూర్తిగనడుగంటును. కానిమ్ము నేనింక నౌరంగజేబును చక్రవర్తిగాఁ జేయుట కన్నివిధములఁ బ్రయత్నింతునుగాక. (ప్రకాశముగ) చక్రవర్తీ ! జయసింహుఁడు చెప్పినట్లు, తమకుమారులందఱును దారా ప్రభువుతోఁ గలసి పనిసేయసమకట్టినచో మీరుతలంచిన హిందూ మహమ్మదీయ సఖ్యత కుదురుట కావంతయు సందియములేదు.

షాజ:—దారాసౌభ్రాతృత్వమును ధైర్యసాహసములును, జనవశీకరణశక్తియు లోకవిదితముకదా! ఖాన్ వర్యా! ఆతని సోదరులుమాత్రమాతనితో నేల సహకరింపకుందురు ?

జయసిం—ఔను. చక్రవర్తికుమారులకందఱకును మొగలాయిరాజ్యక్షేమము వాంఛనీయముకాదా! మంత్రివరా !

సాదు:—కాకేమి! మొగలాయి రాజ్యాభివృద్ధికోరుట రాజకుమారులకేకాక ప్రతిమహమ్మదీయునికిని ప్రథమకర్తవ్యము. కాని యెవ్వరెంతయత్నించినను, హిందూమహమ్మదీయ విభేదములునశించుట, ప్రాక్పశ్చిమములకలయికవలె నసంభవమనినాయూహ.

దారా:—(చిఱునగవుమోమునదోఁప) అమాత్యశేఖరా! ఏనాఁడు మానవహృదయమున మాత్సర్యమునశించునో, యానాఁడె దిక్కులన్నియుఁబిక్కటిల్ల నేదిక్కునఁజూచినను 'అల్లా' యొక్కఁడె మహత్తరవికాసముతోఁ జూపట్టుచుండును. మనహృదయకుహరమునందలి యసూయాంధకారములచే వివిధదిశలేర్పడి మనకు దిగ్భ్రమమాపాదించుచుండును.

జగత్సిం:—సాదుల్లాఖాన్ మంత్రివరుఁడుజెప్పిన విభేదములు చక్రవర్తికుమారులందు కలుగకపోవు. ఔరంగజేబు రాకుమారుఁడు నేఁడు తీసికొనిన ప్రమాణమును జక్రవర్తిపూర్తిగ గమనించిరోలేదో.

అసఫ్:—సోదరా! కాలమెయన్నిటినిఁ జక్కపఱుపఁగలదు. న్యాయమైన యంతఃకరణముతో మానవుఁడొనరించు కృషిమాత్రమెనిలిచియుండును. ఈర్ష్యాసూయలు తాత్కాలికములు. అవి కొంతయుద్రేకమును జనింపఁజేసినను గంభీరహృదయులనవి బాధింపఁజాలవు.

జగన్నా:—ఖాన్ పుంగవా! ఎన్నిభిన్నమతములనైన నీభారతవర్ష మునందలి యార్షవిజ్ఞానము, వివిధనదీనదములను మహాసముద్రమువలె గ్రహింపఁగలదు. మాహైందవమునకుఁ బూర్వమునుదయించుసూర్యుఁడును, పశ్చిమమునంబుట్టు చంద్రుఁడునుగూడ రెండునేత్రములు.

షాజ:—మొగలాయిరాజ్య భావిసంపదకుఁబునాదులు హిందూమహమ్మదీయపరస్పర సమానస్నేహములైనచో రాజ్యము చిరస్థాయికాఁగలదని మాదృఢవిశ్వాసము. పండితవర్యా! దారాకుమారు నప్రతిహతరాజనీతిజ్ఞునిఁగఁజేయు భారము మీయందును సాదుల్లాఖాన్ నందునుంచితిమి. నేఁటినుండియు మొగలాయిరాజ్యమునందు హైందవధర్మపరిపాలన క్రమముగజరుపుటకై మిమ్ము మాసామ్రాజ్యమంత్రివర్గమునందలి పండితరాజపదవికి నియమించుచున్నారము. ముద్రికలివిగో. కైకొనుఁడు. (అనిజగన్నాథునకుఁ జక్రవర్తి ముద్రికలనిచ్చును.)

పండితరాయలు:—(లేచి చక్రవర్తి కడకుఁబోయి ముద్రికలనుగైకొని) దేవరయాజ్ఞానుసారము నాశక్తి కొలఁది దేశాభ్యున్నతికై తప్పక పాటుపడెదను.

(అంతట చక్రవర్తి యాజ్ఞపై సేవకులు పండితరాయలను పలువదిమైదువందల వెండినాణెములతో తూఁచుదురు. వానినిఁ జక్రవర్తి పండితరాయలకు బహుమతిగా నొసంగును.) ——— (తెరదింపవలెను.)

3వ రంగము.

దారాభవనమునందలి గ్రంథాలయము — దారా పరిశీలితముగ భగవద్గీతను జదువుచుండును — పండితరాయలును.

అసఫ్‌ఖానును ప్రవేశింతురు.

దారా:——(లేచి యెదురుగా వెడలి సగౌరవము — నుచితాసనములపైఁ గూర్చుండఁబెట్టును) పండితవర్యా! మీరును మామగారును సమయమున కరుదెంచితిరి. నేనీగ్రంథమును జదువుచు మీరువచ్చిన బాగుండునని యనుకొనుచుంటిని.

పండిత:—ప్రభూ! మీసత్సంకల్ప మన్యథా యెట్లగును?

దారా:—తాతగారూ! హిందూ మహమ్మదీయ మతసమీకరణము చేయఁగల యొకమతగ్రంథమును రచించి మన రెండు మతముల సామరస్యతకు లోకము నొప్పింపవలెనను కుతూహలముతో నిన్నరాత్రి యోగవాశిష్ఠమును జదువుచు నటులనే నిద్రఁజెందితిని. అంత నొకమహత్తర స్వప్నముకలిగెను.

అసఫ్:—బిడ్డా! ఆ స్వప్నమేమి?

దారా:——వసిష్ఠమహర్షి రాముని వెంటఁబెట్టుకొని నాశయనాగారము ప్రవేశించెను. నేను దిగ్గునలేచి వారికెదురు కొనఁబోవ వసిష్ఠుఁడు రామచంద్రా! యీతఁడు నీసోదర

నుఁడు నీవలెనీతఁడుగూడ సత్యాన్వేషణకై కృషిచేయు చున్నాఁడు. వీనిని కౌఁగలింపుము. అనిరామునితోఁ జెప్ప నాతఁడు నన్ను కౌఁగలించుకొనెను. అంతనాయిరువురు నాయందు విలీనమైరి. ఆస్వప్నముఁనుస్మరించిన నాకు హర్షోత్కర్షముచే నొడలుపులకించుచున్నది! తాత గారూ!

పండిత:—ప్రభూ! మీరు చక్రవర్తియైనచో నారామచం ద్రుని రాజ్యమును మరల నీభారతవర్షమున నెలకొల్పఁ గలరు.

అసఫ్:—నీవిప్పుడు చదువుచున్న దాయోగవాసిష్ఠమా?

దారా:—కాదు భగవద్గీత. మనమత గ్రంథమగు ఖురానునకును నీహిందూమత గ్రంథమగు భగవద్గీతకు ననేకవిషయ ముల సామరస్యము కాన్పించుచున్నది.

అసఫ్:—ఔను. మనమహమ్మదు ప్రవక్త కత్తినిచేఁబూనిమన మహమ్మదీయ మతమును బ్రచారము జేయుమనినట్లె కృష్ణుఁడుగూడ తనశిష్యుఁడగు నర్జునునియుద్ధమునకై ప్రబోధించి దుర్మార్గులగు కౌరవు లనుకాఫరులనుసంహ రింపఁబ్రోత్సహించెను.

దారా:—నేను నా రెండుగ్రంథములను సమగ్రముగఁజదివితిని. కాని మనమతకర్తయగు మహమ్మదుగాని హిందువు లకుదైవమగు శ్రీకృష్ణుఁడుగాని తోడిమానవులను హిం

సించి మతములను బ్రచారము సేయుట కెన్నఁడునుద్యోగించి యుండలేదు. తాతగారూ! కౌరవులలో గొందఱు కాఫరులైనఁగానచ్చును. వారియందుగూడ భీష్మద్రోణాది మహాభక్తులెందఱో కలరు.

ఆశఫ్:—బిడ్డా! నీవు చెప్పునది చాలనపూర్వముగనున్నది. మతప్రచారమునకు మర్మస్థలగణించుట ముఖ్యముకదా! హిందూమత గ్రంథములందు భగవద్గీతయొక ప్రధాన గ్రంథమే.

వారా:—మతము, ధర్మము, నీతి యనునీమూడువిషయములు మానవజాతికి ముఖ్యములు. అందుమతము వ్యక్తిగతము. ధర్మము సంఘముచే నాచరింపఁబడునట్టి యాచారవిశేషము. అనేకవ్యక్తులొకేరీతిని ధర్మమునాచరించుచో నదియొకసంఘముగా నెన్నఁబడును. అందుచేతనే హిందూసంఘమనియు, మహమ్మదీయ సంఘమనియు క్రైస్తవసంఘమనియు బిలువఁబడుచుండుటవారు వారి వారిసంఘధర్మముల నాచరించుటం బట్టియె. ఇఁక నీతి సార్వకాలీనము, సార్వజనీనము. అయ్యది మానవజాతి యందలి వివిధసంఘములకొక్కటే. మతము పేరిటఁగాని యాచారము పేరిటఁగాని యొకరికొకరు హింసావమానములకుఁబాల్పడుట యవినీతి. అట్టిమానవలనఁ గాని హింసవలనఁగాని, సంఘవ్యక్తులందు నీతినశించి తుదకు వారిమతమె శూన్యమగును.

అసఫ్:—అట్లయిన మతమునకును సంఘమునకును సంబంధము లేదందువా ?

దారా:—లేకేమి ? మానవసృష్టియను మహావృక్షమునకు మతము బీజము ధర్మము స్కంధము నీతి మూలము. మతప్రచారము దుర్మార్గులను సంహరించుటకన్న దుర్మార్గతఁ బోఁగొట్టఁగనుట సమంజసము అన్ని సంఘములందును దుర్మార్గులు దుర్నీతిపరులుందురు వారిని శిక్షించుటకును నీతిమార్గమున నెలకొలుపుటకును ప్రభుత్వము లేర్పడినవి. కాని మతమెవ్వరిని హింసించుట కొప్పుకొనదు. అట్టిహింస గీతలయందు కృష్ణుఁడెన్నఁడును బోధించియుండలేదు అహింసయను నమృతరసముండినఁగాని మతమను బీజము మొలకనెత్త నేరదు.

అసఫ్:—గీతలయందు యుద్ధప్రసంగము పలుతావులఁ గానవచ్చుటయె కాక కృష్ణుఁడర్జునుని యుద్ధమున కుత్సాహపరచుటకూడ చూపట్టుచున్నదే ! దాని నెట్లు సమర్థింపఁగలవు కుమారా !

దారా:—తాతా ! లోకమునం దుపదేశికులు తమ శిష్యుల మానసిక వ్యవస్థితినిఁబట్టియు నుపదేశకాలమున నే ప్రసంగవశమున నా యుపదేశము చేయఁబడుచున్నదో దానిని గమనించియుఁ దమ యుపదేశములకు లక్ష్యములను జూపుదురు. అర్జునుఁడు క్షత్రియుఁడు అనేక

యుద్ధములందు దాక్షిణ్యత్యక్తవీరుఁడు అందుచే నాతని మానసికస్థితి యుద్ధతంత్రనిష్ఠితము. కాకతాళీయన్యాయముగ నా యుపదేశకాలమునకు యుద్ధమే ప్రవృత్తము కానైయుండెను. కావున గృహస్థుఁడవని కా యుద్ధప్రసంగముచే పరమార్థము నుపదేశించెను. ఆకృష్ణుఁడే యంతకుఁబూర్వము తన్నుఁ బ్రేమించిన స్త్రీలగు గోపికలకు రసికప్రసంగవశమున నిశ్శ్రేయసపదప్రాప్తి సాధనమును దెలియఁజేసెను ఫలకాంక్షలేక కర్మల నాచరించుచు నియతముగ తన ధర్మమునఁ బ్రవర్తించుటయె మానవజీవిత పరమావధి యని మాత్రమె గీత చెప్పుచున్నది. కాని యుద్ధము పరమార్థమని యెందు సూచింపలేదు.

ఆసఫ్:—ఫలాపేక్షలేక నెల్లప్పుడు మనము కర్మల నాచరింపఁ గలమా ?

బారా:—అచ్చట నాకును గొంత సందేహము కలుగుచున్నది. ప్రభుత్వముకొఱకో ధనముకొఱకో యశముకొఱకో మన మేకార్యమునైన జేయఁజూతుము కాని నిస్సంగముగ గర్మల నాచరించుట దుర్ఘటమేమొ యని నేనును సందేహించుచున్నాను.

పండిత:—ప్రభూ! మీ రేల యచ్చట సందేహింపవలసివచ్చెనో నాకు గోచరించుటలేదు. తొలుత మనము ధర్మవ్యతిరి

క్త ముగాని కోరికలుమాత్రము కలిగియుండి కర్మలను జేయుచున్నచో గ్రమక్రమముగ ధర్మ విహితసత్కార్యా నుష్ఠానముచే చిత్తమహంకార రహితమై యొప్పును. నియమబద్ధమగు కామ మీశ్వర పేరితమగుటచే నది చిత్తశాంతికి భంగముకలుగఁజేయదు అట్టి కర్మలవలన సంఘమున కుపద్రవ మొకప్పుడును గలుగదు.

అసఫ్:—మీరు ధర్మవ్యతిరిక్తముగాని కోరికలు మానవుఁడు కలిగియుండవచ్చునంటిరి మీ ధర్మశాస్త్రములందు క్షత్రియునికి యుద్ధము ధర్మమందురుకదా అయ్యది మానవుల కుపద్రవము కలిగించుటలేదా ? పండితరాయా !

పండిత:—క్షత్రియునకు యుద్ధము దేశరక్షణమునకును మాన రక్షణకును దుష్టశిక్షణకుమాత్రమెగాని యొరుల ధన మును రాజ్యమును స్త్రీలను హరించుటకావిధి ప్రభూ !

అసఫ్:—అట్లయిన నిఁక యుద్ధములులేనిచో రాజ్య మభివృద్ధి గాంచు టెట్లు ? రాజులు తమకున్నదానితో సంతుష్టిఁ జెందక రాజ్యముల నభివృద్ధిజేయవలెనని మీశాస్త్ర ములుగూడ వక్కాణించుచున్న వే.

పండిత:—

మ॥ అకటా ! భూవర ! శాస్త్రముల్ పృథివిలో ♦ నారూఢ విజ్ఞానులుఁ !

అకలంకాత్మలు నిత్యముక్తులునులో ♦ కానీక భద్రార్థులై !

ప్రకటింపంగవిచారహీనులగుచు ♦ శాస్త్రప్రచారాశయుల్
వికటానర్థకవాక్యశిల్పకలతో ♦ విద్రోహముల్ సేసెడిన్॥

ప్రభూ! ప్రతిమానవునకును సంతుష్టి తృప్తి యను నీ రెండు మాటపేక్షకర్మములును పరిధానములు రాజ్యాభివృద్ధి యూ దేశ ప్రజాపోషణకా లేక నా యూ పరిపాలకుల దురాశాదవానలాహుతికొఱకా? తమరాజ్యములందలి ప్రజాపోషణమె యుద్ధాశయమైనచో పెఱరాజ్యములలోనివారుమాత్రము మానవులుకారా? వారెవరిపై మరలదండెత్తవలెనో!

దారా:— తాతగారూ! మీరడిగిన ప్రశ్నకు భగవద్గీతయందె చక్కని యుపపత్తిని కృష్ణుఁడు చెప్పియున్నాఁడు అది చదివి వినిపించెదను.

శ్లో॥ "సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేషవోస్త్విష్టకామధుక్॥"

అని నిర్వచించెను.

పండిత:—అసఫ్‌ఖాన్ ప్రభూ! దారాప్రభు వాశ్లోకమునందలి పరమార్థమును జక్కఁగ సమన్వయించిరి. దానినె మా భాగవతమునఁగూడ స్పష్టతరముగ విశదీకరింపఁబడెను. పృథుచక్రవర్తి భూమిని గోరూపముచేసి మానవసంఘమునకుఁ గావలసిన సమస్త వస్తుసముదాయమును బితికెనను నితిహాసము మనకుఁగావలసిన ద్రవ్యముల నీ

భూత ప్రకృతినుండి పడయవలెనని సూచించుచున్నది. అట్లు సంపాదించుటకు సమర్థులగు శాస్త్రజ్ఞులను బోషించి రాజ్యమునందలి ప్రజలకుఁ గావలసిన పదార్థజాలము నీప్రకృతినుండి పడయుట ప్రభువుల కర్తవ్యము. వారి యందు ప్రజారక్షణభారము నిక్షిప్తమైయుండుటచే నట్టి దివ్యకృషికి వారే బాధ్యులు. అందుచే ప్రభువులుసంతుష్టిజెంది వారికి దిన దిన మును గట్టిగుడ్డయుఁ బుష్కలముగనున్నవని యూరకున్నచో రాజ్యమునందలి ప్రజాభివృద్ధికిఁదగిన ద్రవ్యసమీకరణము జరుగదని శాస్త్రము లట్లువారిని హెచ్చరించెనేగాని పక్షపాతమున కెన్నఁడును బురికొలుపలేదు.

అసఫ్:—కుమారా! మనమతకర్తయగు మహమ్మదు కత్తినిచ్చెఁ బూని మనమతమునువ్యాపింపఁ జేయుటకైవిధించియుండలేదంటివి. నీవట్లనుటకు హేతువేమి ?

దారా:—తాతగారూ! మనమహమ్మదు ప్రవక్తజన్మించిన దేశమునందలి ప్రజలాకాలమున దురాచారపిశాచగ్రస్తులై పరదార పరధనాదుల నపహరించుచు నాస్తికులై నీతిబాహ్యతతోఁ బ్రవర్తించుచుండిరి. వారిని నీతిపథమునకుఁద్రిప్పవలెను. లేకున్నవారియందు మతప్రచారమునకు తావేలేదు. అందుచేవారిని భయపెట్టి యాస్తికులుగఁజేయుటకును నైతికధర్మములనుబోధించుటకునట్లు చెప్పియుండునేగాని, పెఱమతములను బాడుచేయుటకు

నామతస్థులను హింసించుటకు మహమ్మదీయమత మేర్పడి యుండలేదు. దయాసత్యశౌచములు నార్జవము లేనివానిని మనము కాఫరులందుము. హిందువులు రాక్షసులందురు. అట్టివానిని విషసర్పవృశ్చికములవలెఁ జూచుటకే రెండుమతములు నుద్బోధించినవి. "జహిశత్రుం మహాబాహో కామరూపం దురాసదం" అనుగీతావాక్యము సర్వమత సారము.

అసఫ్:—భిక్షు! నీవు చెప్పునది కడుసమంజసముగఁ దోఁచుచున్నది.

దారా:—పండితరాయా! మన రెండుమతములుగూడ రెండుసముద్రములవలె సామాన్యజన సముదాయమునకు వాని పరమార్థములను గ్రహింపనసాధ్యములుగ నున్నవి. రెండుమతములలోనే నీతినిబోధించునను ప్రధానాశయమును లోకులుచక్కఁగ సమన్వయించుకొనఁగలిగిన నొకగ్రంథమును రచింపసమకట్టితిని. అందులకై మీయుత్కృష్ట గ్రంథానుభవ లోకానుభవము లావశ్యకములు. మీరునాకృషియందు తోడ్పడవలెను.

ఉ॥ అరయఁగ పండితాళిహృద ♦ యంబున నీసుజనించె రాజులీ
ధర నతిభోగలాలసమ ♦ దంబునఁగాంచరు క్రింది మీదు దా।
మెఱుఁగఁగ లేరు లోకులు క ♦ వీంద్రసుభాషిత భాషితంబుల।
నక్కఱగుదుఁ డాగి కాలమహి ♦ మంబున డిందె సమస్త
శాస్త్రముల్॥

పండిత:—ఔను దారా ప్రభూ! మీరే యట్టియుద్గ్రంథరచనాదక్షులు. మీయందు మనయుభయమత సమ్మేళనారూపమగుమహావృక్షము బీజరూపముగ నిబిడీకృతమైయున్నది. మీ ప్రపితామహుని దివ్యకళాజీవిక మీపితామహీ రక్తకణములందులీనమై మీహృదయమున నాటుకొని యందలి ప్రేమ రసార్ద్రతచే నవనవోన్మేషముఁగాంచుచున్నది. మీరట్టిగ్రంథరాజముల నిర్మించుటయెకాక మీ యపూర్వ మేధాసంపత్తిచే నీభరతఖండము నజాత శత్రునివలె పాలించుభాగ్యము కలుగుటకైయీవిప్రుఁడు మీతోనెల్లప్పుడు సహకారముసలుపుటకు సంసిద్ధుఁడు.

దారా:—(లేచి పండితరాయునిహస్తమునొకచేతనుఅసఫ్ఖాన్ హస్తమునొకచేతను బట్టుకొని) ఈనాఁడెశుభముహూర్తము, పెద్దలగు మాతాతగారుకూడ నుండుట నాభాగ్యము. నేఁడే నేనా గ్రంథరచనకు సంకల్పించెదను.

అసఫ్:—బిడ్డా! నీవును పండితరాయలును నీభరతఖండమున మనరెండుసంఘములు పరస్పరద్వేషముచే నశింపకుండ సంపూర్ణశాంతితో మెలంగుటకు సర్వతోముఖకృషిచేయుట కాయల్లాతోడ్పడుగాక. నేను రేపుతెల్లవారకమునుపే మక్కాయాత్రకుఁ బయనమై పోవుచున్నాను.

పండిత:—ఖాన్వర్యా! మీరుయాత్రాసంరంభమును ముగించుకొని మరల త్వరలోమమ్ముకలసికొనుటకు భగవంతుని

ప్రకాశించుచుందుము. మీరు లేనిచో చంద్రుడు లేని నిశ
వలె నీ మొగలాయి రాజ్యము ప్రకాశింపఁజాలదు.

అసఫ్:—మీవంటి తారలుండి రాజ్యమునందు క్రమక్రమాభి
వృద్ధి నెలకొలుపవలెను (చిఱునగవుతో పండితరాయుని
భుజముపై తట్టును).

పండిత:—మాయుద్యమములింకను నక్షత్రదీధితులవలె మినుకు
చుండును ఖాన్ వహ్వా!

గీ॥ కోటినక్షత్రకాంతులు ♦ గూడియైన ।
తమమునడఁపంగ జాలునె? ♦ విమలమూర్తి ।
చంద్రుఁడొక్కఁడు వొడమిన ♦ సాంద్రమైన ।
చీకటులనెల్ల క్షణములోఁ ♦ జెఱచుఁగాదె॥

అసఫ్:—పండితరాయా! మేమెల్లకాలము జీవించియుందుమా?
మా దారావంటి వర్ధమానచంద్రులింక నీసామ్రాజ్య
భారమువహింప సమకట్టవలెను.

దారా:—(తన పెటికనుండి నాలుగురత్నములనుదీసి) తాతగారూ!
మీరీ నాలుగురత్నములను మకుటాలంకరించుచున్న ఋ
షూమునకు నావందనశతపూర్వకముగా నర్పింపుఁడు.

అసఫ్:—బిడ్డా! తప్పక నీవు కోరినట్లు చేయుదును.

(తెరదింపవలెను.)

ప్రథమాంకము సమాప్తము.

---

# దారాషకో



## ద్వితీయాంకము.



### 1వ రంగము.

ఢిల్లీకోట — రోషనారా భవనమునందు సుమారు పదిగడియల రాత్రివేళ — రోషనారా యొకగదియందుగూర్చుండి — ఔరంగజేబు కొఱకై నిరీక్షించుచుండును.

(1) ఔరంగజేబు (2) సాదుల్లా — యిరువురు ప్రవేశింతురు.

(రోషనారాలేచి యిరువుర నుచితాసనములపైఁ గూర్చుండజేయును)

రోష.—సోదరా! రాత్రిచాలద్దైనది! ఇంతవఱకును చక్రవర్తి కడనేయుంటివా?

ఔరంగ:—అక్కా! నాపై చక్రవర్తికి ప్రబలతరమగువిద్వేషమును మనప్రతిపక్షులు పెంచిరి. అందుచే వారితో గుజరాతుపరిపాలనావిషయములుముచ్చటించుచుంటిని

రోష:—నీవు గుజరాతుప్రతినిధిగఁబోయిననాఁటనుండియు నాకీఢిల్లీకోటయందుండుటకు నేంతమాత్రముమనసొప్పుటలేదు. చక్రవర్తి దారాచేతిలోఁబడికీలుబొమ్మయై రాజ్యమునంతయు వానియిష్టమువచ్చినట్లునడుపుచున్నాఁడు.

ఘోరం:—అక్కా! నేను విన్నయు నెఱుంగుదును. మీరు వ్రాయు చున్నయుత్తరములు నుండియు, మనమిత్రులైనపెద్దలగు నీవాదుల్లాఖాన్ ఇస్మాలులు నాకు బంపుచున్న రహస్యసందేశములనుండియు గ్రహించుచుంటిని. కాని ప్రస్తుతము నేనేమిచేయుటకును సమర్థుడను గాను.

సామల్లా:—ప్రభూ! దారాహింద్వాపక్షపాతము నానాటికి మిక్కిలి మీఱుచున్నది. దారాయొద్ద హిందూపండితుఁడుగనుండినహింద్వువునకు, చక్రవర్తి పండితరాజపదవియొసంగుటచే నాతఁడు రాజ్యతంత్రము సందు చక్రవర్తికిఁగూడ నాంతరంగికుఁడై దారాసహాయమున హిందూరాజులపై నీఁగ వ్రాలనిచ్చుట లేదు. కాశ్మీరముపైదండయాత్రను నేనునడుపుచుండ నాకు దెలియకుండగనె యారాజుతో సంధిచేసికొని నన్నారాజ్యమునుండితిరిగిరమ్మని ఫర్మానా చక్రవర్తిచే వ్రాయించెను. జైసింహుని విషయమునమాత్రము దారాపండితరాయ లెంతప్రయత్నించినను మీరనిన నాతనికున్నయభిమానమును జెఱగొట్టఁజాలకున్నారు. తుదకు జైసింహుని మేనకోడలను దారాకుమారుఁడగు సులేమానునకిచ్చి వివాహము జేయించెను.

ఘోరం:—జయసింహుఁడు మనపక్షమునబనిచేయుటకుఁ గారణ మాతనికిని దారాపక్షపాతియగు జగత్సింహునకినిగల వైరము. జయచంద్రునకు పృథ్వీరాజునందువలె రాజ

పుత్రులకు బంధుగౌరవముకన్న వైరగర్వము ప్రబల
తరము.

రోష:___అంతియెకాదు. సోదరా! జైసింహునకు మనపక్షము
నందొకవిధమైనయభిమానముకలదని నాయనుభవము.
ఇదివరలో దారాయాతనికి పలుమాఱుచేసిన యవమా
నములు నేటిబాంధవ్యము మఱపునకుఁదెచ్చునా?

సాదు:___ఔను. రాజపుత్రులవమానమును మఱువఁజాలరు.
ప్రభూ! ఏదియెట్లున్నను మీరును షుజాప్రభువును మీ
బాంధవ్యమును మఱింతదిట్టముచేసికొనుట యుక్తము.

ఔరం:___అదెట్లుసాధ్యపడును ?

సాదు:___షుజాకుమార్తెయగు గుల్‌రుక్‌బనూను మీ పెద్దకు
మారుఁడగు సుల్తానుమహమ్మదునకు వివాహముచేసి
కొనుచో మీయిరువురకును పరస్పరసంబంధమేర్పడి
యొకరికొకరుసహాయముచేసికొనవచ్చును.

ఔరం:___ఖాన్‌వరా! షుజాకుమార్తము హస్తినాపురసింహా
సనముపై నాసలేకపోవునా? నాదృష్టియందు షుజా
కన్న మురాదె యెక్కుడమాయికుఁడు.

సాదు:___మురాదునుగూడ మీరు వదలవలదు. షుజాను మన
ముచేపట్టినచో మనకుఁగొంత యుపయోగము లేకపో
లేదు. మీరిరువురును హస్తినాపురమునకుసమీపమున
నున్నారు. బంగాళమున ముందుగా షుజాతిరుగుపాటొ
నర్చునట్లు మనముసాధించితిమేని చక్రవర్తిసైన్యములో

గొంతభాగమాత్రమైన నావకతప్పదు. అదిమనకుఁగొం
త సదుపాయముకాదా ?

ఔరం:—అట్లయిన షుజాకునునాకును బాంధవ్యముసమకూర్చు
వారెవ్వరు? మాయకు—మామఖాదుకు బాగుగనాలో
చించి యట్టివానిని నియోగింపవలెను. నేనట్లయిన
మురాదునకు మయూరసింహాసనముపై మనసునొలిపి
వానిని నాకు వశవర్తిగఁజేసికొనుటకై ప్రయత్నింతును

రోష:—సోదరా ! నీకును, షుజాకును సంబంధముకలుపుటకు
జయసింహుఁడే తగినవయశాలి.

ఔరం:—అతనినొప్పించుటకు మనకు సాధ్యపడునా ! అక్కా !

రోష:—దానినంతయు నేనుచక్కఁబఱచెదను. షుజాకు హాస్తి
నాపురరాజ్యముపై నున్నకాంక్ష మనమెఱుఁగుదుము.
ఆతఁడందులకై మున్ముందె గొంత దండయాత్రాసం
రంభమొనర్చునట్లొనరించినచో వానినణచుటకుఁ జక్ర
వర్తియుదారాయును జైసింహుని తప్పకపంపుదురు.
అదియే మనకుమంచితరుణము.

ఔరం:—అట్లయిన మనముమొదట చక్రవర్తికి చాలజబ్బుగ
నున్నదని బంగాళమున బ్రచారముచేసినచో షుజా
దండెత్తుటకుఁ బ్రయత్నింపకమానఁడు.

సాదు:—అట్టి ప్రచారకులను రేపటినుండియె నేనునియమించె
దను. షుజాకుఁగూడ నొకలేఖ రోషనారాబీగం వ్రా
యుట మంచిది.

గోప:—తప్పక ఔరంగజేబు షుజాకు సహాయముచేయునని యు వెంటనేదండెత్తినచో హస్తినాపురకోటస్వాధీనము కాఁగలదనియు నేనువ్రాసిపంపెదను.

ఔరం:—ఈఢిల్లీకోటవిషయములును, షుజావిషయమును మీ యిరువురకునువదలుచున్నాను. నేను రేపు మరల గుజ రాతునకు పయనమైపోవలెను. సింధురాష్ట్రమునందు హిందువులులేకుండ పూర్తిగ తఱిమివేయుటకును నొక వేళనున్నచో వారుమహమ్మదీయమతమవలంబించుట కును తగుప్రయత్నములుజరుపుచున్నాను. నేనుసింహా సనమునధిష్ఠింపవలెనన్న హిందూదేశమునకావలనున్న మనమతస్థులరాజ్యముతోఁగలసినరాష్ట్రములగు సింధు, పంజాబు సౌరాష్ట్రములందును హస్తినాపురమందును కేవలమహమ్మదీయులేగాని యితరులుండకుండునటులఁ జేయుట నాయాశయము.

సాదుల్లా:—ఔను. అట్లుచేసినచో మనము నిష్కంటకముగ నేల వచ్చును. హిందువులెప్పటికైన మనపైఁదిరుగఁబడక మానరు. అట్టితరుణమున మనమతస్థులసహాయ మవ సరము.

గోప:—కాని హిందువులలోప్రజాబాహుళ్యమునకు ప్రభుత్వ మెవ్వరుచేసినను వారిమతమునందుజోక్యముకలుగఁజేసి కొననిచోఁజాలునని నాయూహ. మనలోనున్నంత సం

ఘీభావము హిందువులందుఁగానరాదు. నాకీకపరిభూత్వ తృష్ణ యంతగానున్నటులదోఁపదు సోదరా!

ఔరం:—అదినిజమే కాని వారుమాత్రమెల్లకాలము కేకీక్రి నుందురా? మనముమహమ్మదీయులముమాత్రమే మన మొగలాయీరాజ్యమునందు నివసించునట్టులఁజేసినచో మనకుఁబ్రమాదము లేదు.ఇఁక రాజపుత్రస్థానమునందు సంఘీభావము కుదురకుండజేయుటకై మన మెట్టులైన జయసింహునిమాత్రము ముపయోగింపవలెను. జగత్సిం హునితరువాత జైసింహుఁడు రాజస్థానమునందుపలుకు బడికలవాఁడు.

రోష:—సోదరా ! నీవుతప్ప నితరులెవ్వరు నీహస్తినాపురసిం హాసనము నాక్రమించినను నేనాత్మహత్యనైనఁజేసికొం దును. నీవు నీప్రయత్నములం దప్రమత్తుఁడవైమెలం గుము; నేనును, సాదుల్లాఖాన్ వర్యులును జైసింహు నెట్లైనలోఁబఱచుకొని సర్వప్రయత్నములు జేయుచుం దుము. భోజనమునకుఁ జాలపొద్దుపోయినది లెమ్ము.

సాదు:—అమ్మా ! సెలవొసంగుఁడు. ఔరంగజీబుప్రభూ మీరు భద్రముగనన్నియుఁ జక్కఁబఱచుచుండుఁడు. నేను మీకుక్షేల్లీసంగతులన్నియుఁ దెలియఁజేయుచుం దును. సెలవొసంగుఁడు. (అని సలాముచేసి వెడలిపో వును) (అందఱు నిష్క్రమింతురు.)

2 వ రంగము.

[పండితరాయుని యంతఃపురము — పండితరాయలు సాయంకాలానుష్ఠేయములు తీర్చికొని తనకార్యాలోచనా మందిరమునఁగూర్చుండి యెద్దియోదీర్ఘముగ నాలోచించుచుండ విద్యావతి వెనుకవైపునుండివచ్చి పండితరాయలుగూర్చున్న సోఫానానుకొని యాతని వెనుక నిలుచుండును. కొంతవడికి పండితరాయలు తలయెత్తి నిట్టూర్పుతోఁ జూచుసరికాతనియెదుట నున్న నిలువుటద్దమునందు తనవెనుకనున్న విద్యావతికాన్పింపతటాలున వెనుకకుఁదిరిగి]

పండిత:—(చిఱునగవుతో) ప్రేయసీ! నీవెంతతడవైవచ్చితివి ?

విద్యా:—(చిఱునగవుతో)చాలసేపైనది. మీరు తలవాలుచుకొని యెద్దియోనిశితముగ నాలోచించుచున్నారు. మీముఖ లక్షణముఁజూడ విషమపరిస్థితులేవియో మీమానసము నుబీడించుచున్నట్లున్నది. భోజనమునుగూడ మఱచితిరి కాఁబోలు !

పండిత:—ప్రేయసీ! ఆలోచనయా ...... నిశితమా ...... ఔను పురుషులయాంతర్యమును గ్రహించుటయందు స్త్రీలసమానలు. తీవ్రమైనరాజకీయవిషయములు, నామానసముడోలాయమానము సేయుచున్నవి. నీవన్నట్లన్నముతినుటకుఁగూడ నిష్టమగుటలేదు.

విద్యా:—పురుషులకట్టి మనోభారము విశేషముగతట్టినప్పుడుతమ యర్థాంగులకుఁ గొంతపంచియిచ్చుట భావ్యముకదా.

పండిత:—వెఱ్ఱిదానా! మీరెంతచదువుకొన్నను, రాజకీయ రణ రంగములందు మాత్రము మీరుమాఁకుట యప్రశస్త ము. గృహకృత్యభారము పురుషులకు లేకుండ పూర్తి యైన సహాకారమువారికి మీరుచేయఁగల్గినచో నది చాలదా?

విద్యా:—మేముమాత్రము రాజకీయ రణరంగములందేలపాల్గొ నరాదు ?

పండిత:—సఖీ! మానవ సంఘమునందేకాక ప్రతిజీవకోటియం దును పురుషునికన్న స్త్రీయెక్కుడు పవిత్రమైనదిగా నెన్నఁబడుచున్నది. స్త్రీపురుషులిరువురొకే రంగమందుఁ బనిసేయుచో గాలక్రమమున వారిమానసిక పరిణామ ములుమాఱి, పురుషులకు స్త్రీస్వభావమును స్త్రీలకుఁ బురుషస్వభావములు నంకురించును. అట్టి విపరిణామ ముచే మనోనిగ్రహము నశించును. మనోవికృతియె యాత్మవైకల్యతకును శరీరవికృతికిని మూలము.

మ॥ జగతిన్మానవులందు దానజపవి ♦ జ్ఞానక్షమాహింసలా|
దిగ సద్వృత్తులు చాలగల్గినను స్వా ♦ ధీనేంద్రియుల్గానిచో|
విగతంబైచెఁజనుఁగాకనిల్చునె? మది ♦స్వీకుంభభాండంబునం|
బగులున్నంజలమెట్టునిల్చుఁజెపుమా♦ పంకేజపత్రేక్షణా?॥

విద్యా:—నాథా! స్త్రీలలోఁగూడ ననేకులు రాజకార్యధురీణలు నుద్గ్రంథరచయితలు ´లరే. వారుగూడ నాయాకా

లములందు రాజకీయరణరంగములందుఁ దమభర్తలకు సాయముసేయలేదా ?

సీ॥ భర్తృసత్యవ్రతా ♦ పాలనదీక్షకు
చంద్రమతీసాధ్వి ♦ సాయపడదె !
ప్రాణేశుయమపాశ ♦ బంధమోక్షప్రాప్తికి
సావిత్రిసుభగాత్రి ♦ సాయపడదె !
నరకాసుఁ జెగహార్చ ♦ నరసఖుండలయంగ
సత్యభామామణి ♦ సాయపడదె !
ఘోరమాయావితో ♦ ఘోరముగాఁబోర
సంయుక్తభర్తకు ♦ సాయపడదె !
గీ॥ యుగయుగంబుల భర్తలు ♦ పగఱఁగెలువ !
భార్యలెంతయు సాయమై ♦ పఱగలేదె !
యోషవారని మీరిట్లు ♦ లాడఁదగునె!
శక్తిలేకున్న శివుఁడైన ♦ జౌముగాఁడె॥

ఉ॥ కార్యములందుదాసియగుఁ ♦ గష్టములొందినవేళమంత్రియై
ధైర్యముఁజెప్పునేమఁజక ♦ ధర్మమునందును గామమందుద !
నాశ్చర్యులుమెచ్చురీతిఁబ్రియ ♦ మారమెలంగియశంబు
గూర్చునా !
భార్యయెగాదెపూరుషుని♦భాగ్యపుదేవతయెంచిచూడగన్॥

పండిత:—(మందహాసముతో) విద్యా! విద్యావివేకాదులు స్త్రీలకుండఁగూడదను నిషేధములేదు. వారునుమహాత్ము

కార్యనిర్వాహకత్వమునఁ బురుషులకండగనుండి మానవకళ్యాణమునకుఁ దోడుపడకపోయినచో నీ ప్రపంచము గొడ్డుపోయినదె యగును. వారు చక్కఁగ విద్యలనభ్యసించి తమబాలబాలికల కుపదేశింపవలెను. భావిభారత ఖండసౌభాగ్యమునకు బాధ్యతవహింపవలసిన ప్రస్తుత శిశువులను తేజోవంతులుగను వీరులుగను జేయుభారమువహింప స్త్రీలే నడుముగట్టవలెను. గృహనిర్వాహణము స్త్రీలును రాజ్యనిర్వాహణము పురుషులును జేయునప్పుడే లోకోద్ధరణము సక్రమముగజరుగును. అనాఁడే దేశమునకును సంఘమునకును జక్కనివికాస మేర్పడి మానవాభ్యుదయము పొసఁగును. శిశుపోషణాత్మకమగు దివ్యకృషి, దేశసేవ, మతసేవ, సంఘసేవయుఁ గావా? స్త్రీపురుషులిర్వురొకే రంగమునఁబనిసేయుచో నిఁక సృష్టియందలిభేదమునకు గతియేమి ?

విద్యా:—అన్నట్టు... ...శిశుపోషణమనిన జ్ఞాపకమువచ్చినది! మనమహాదేవుఁడును మాతండ్రియు ద్వారకకుఁబోయి చాలకాలమైనది వారింతవఱకుఁ దిరిగిరాలేదు!

పండిత:—అదియే నేనును దీర్ఘముగ నాలోచించుచుంటిని గుజరాతు రాజప్రతినిధిగనున్న యౌరంగజేబు ద్వారకలోని శ్రీకృష్ణుని యాలయము బ్రద్దలుగొట్టించెనను వార్తలు వచ్చినవి. ఆపుణ్యక్షేత్రమునకుఁబోయిన కవీం

ద్రులును మాధవుఁడును నేఁటివఱకు రాకుండుటకుఁగార
ణమచ్చట నేవియో విషమపరిస్థితులు సంభవించియుం
డవలెను.

**విద్యా:**—మహమ్మదీయులిట్టిదుండగములను జేయకుండ బుద్ధి
చెప్పి చక్రవర్తి వారినరికట్టఁజాలఁడా? తనకుమారుఁడే
యిట్టిఘోరకృత్యములను జేయించుచుండ నూరకుండు
ప్రభువుకందింక ప్రజలకుగౌరవమెట్లుండును?

**పండిత:**—విద్యావతీ! షాజహాన్ మానసికప్రకృతి చాలవిచి
త్రమైనది. రాజపుత్రస్త్రీయందు మహమ్మదీయుని
కాతఁడు జన్మించుటచేనాతని మానసమునందుఁ బ్రసరించు
మాతృహృదయతత్త్వజనితప్రేమరస ప్రవాహమునందు
మహమ్మదీయపితృచిత్తవికారరూపమగు మతౌద్ధత్య
ఝంఝామారుతముచే నుద్భవించు పరస్పరసంఘర్షణా
తరంగపరంపరలం దటునిటుఁగొట్టుకొనుచుండు నాతని
బుద్ధి.

**విద్యా:**—అసఫ్‌ఖాన్ లేకపోవుటచే నిఁకరాజ్యమునందు దుర్న
యముల నరికట్టుప్రభువులుకూడ లేరు.

**పండిత:**—అందుచేతనే కేవలమహమ్మదీయమతాభినివేశపరుఁ
డగు ప్రధానమంత్రి సాదుల్లా మొదలు జైలునందురిదీయు
నుద్యోగముననున్న రహీంవఱకు మహమ్మదీయౌద్ధ
త్యము పెచ్చుపెరుగుచున్నది. ఎట్లయిన నౌరంగజేబు.

నులేవఁదీసి హిందువులనణఁగఁద్రొక్కవలెనని వారనేక కుతంత్రములనుబన్నుచున్నారు. దారాప్రభువువలన నవి యన్నియునింతవఱకుభగ్నములగుచుండుటచే సాదుల్లా దారాలకు నానాఁట మనస్పర్థలుపెరుగుచున్నవి. బుద్ధిహీనుఁడగు జైసింహుఁడు రోషనారామాయోపాయములలోఁబడి యామెచేతియందు కీలుబొమ్మవలె నాడుచున్నాఁడు.

విద్యా:— జైసింగంతయవివేకియానాథా ! దారాకుమారున కాతనిమేనకోడలనుగూడనిచ్చెరే !

పండిత:—స్త్రీల వలపులకుఁదగిలినపురుషులు యుక్తాయుక్తములు గుర్తింతురా?

శా॥ కాంతా ! యెంతయొవింతయేల? ఘనులా – గాధేయ
శక్త్యాత్మజుల్ ।
దంతీకుంభనిభంబులౌ గురుకుచ–ద్వంద్వంబులంజూచియే ।
భ్రాంతింజెందఁగ ! మూఢమానవులికన్ – భామా
కటాక్షేక్షణా ।
తంతుగ్రస్తవిశీర్ణకీటకములై – దర్పంబుగోల్పోవరే ॥

రాజ్యతంత్రమునఁ బరవ్యూహభేదనమున స్త్రీలు తమజాణతనము నుపయోగింతురని లోకవిదితము. ప్రభువులుకూడ ముఖ్యముగా తమబంధువివాహములను రాజ్యరక్షణాసాధనముగాఁ బరిగణించెదరు.

విద్యా:—దారాకుమారునికి జైసింహునిమేనకోడల నిచ్చుట గూడ నిట్టిదేమొ.

పండిత:—ఆవివాహమునకు దారాయెంతమాత్ర మొప్పుకొన లేదు. చక్రవర్తియె జైసింహదారాలకు మైత్రిచేకూర్చుట కొఱకుచేయించెను. ఇంతవఱకు మొగలాయి సామ్రాజ్యమునందలి ప్రముఖప్రభుకోటి యందు, ప్రేమరసము నందలి యాధ్యాత్మికానందమును గ్రహించినది దారా ప్రభువొక్కఁడె. దారానదీరాల యనుబంధమతిలోకము విద్యా!

విద్యా:—రోషనారాకూడ చాల చదివిన స్త్రీ యందురే?

పండిత:—ఏమిలాభము ? హృదయవికాసములేని విద్యాధికులను జూచి, లోకప్రతారణముకొఱకు తమ్ము వినియోగింతు రని విద్యలుగూడ దిగులొందుచుండును విద్యావతీ !

విద్యా:—దైవవశంబున సౌందర్యమునకు సౌశీల్యముగూడ నబ్బ నఁగాని కేవలరూప సంపదయే ప్రధానముగఁగల స్త్రీలు లోకమున కాశీవిషోపమలు కాఁగలరు. అట్టివారు విద్య లనుగూడ నేర్చినచో నిఁకమానవసంఘమును తబ్బిబ్బుల పాలుసేయుటలో నాశ్చర్యమేమి ?

పండిత:—రోషనారా యెట్లయిన నౌరంగజీబును మొగలాయి సామ్రాజ్యపట్టభద్రునిఁగ జేయవలెనని తనసర్వస్వము ను వినియోగించుచున్నది. చక్రవర్తి పూర్తిగ్వైన మనో

నిగ్రహము కలవాఁడైతనరాజ్యము నొకేతీరున పరిపాలింపఁగల ప్రౌఢుఁడైనచో దారాప్రభువు తండ్రినిరాజ్యము నుఁగూడ నిరపాయముగ నడిపింపఁగల ధీరుఁడు. తండ్రినె ట్లయినఁ ద్రోసి రాజనుట కాతనిపితృభక్తియు ధర్మచింత యు హృదయమున సహజమగు మార్దవమును వెనుకకు లాగుచున్నవి. తక్కినసోదరులవలె పితృహత్యనైనఁజేసి రాజ్యమునాక్రమింప వలెనని యాతఁడుజూచుట లేదు. దారాప్రభువు శాంతముఁజూచి కొందఱు బుద్ధిహీనులా తఁడు దుర్బలుఁడని యూహించుచున్నారు.

విద్యా:—పాపము! దారాయొక్కఁడిందఱు చేయుచున్న దురాలోచనలనుడుపఁజూచుట దుర్భరమగుచున్నదికాఁబోలు చక్రవర్తియాదుర్ణయములను గుర్తించుట లేదా ?

పండిత:——చక్రవర్తి తనవిధ్యుక్తధర్మమును జాగరూకతతో విమర్శించి నిర్వర్తింపఁగలిగినచో నింతయేల ? ఆతని పుత్రపుత్రికాప్రేమయు పరిపాలనావిధానములును కేవల యుద్రేకపూరితములు. ఆతఁడొకొ్కకసారి సాదుల్లా యొక్క మతాభినివేశపూరిత క్లిష్ట సమస్యలందును వేఱొక్కమారౌరంగజేబు రాజకీయభేదోపాయములను నురులందును, ఇంకొకమారు రోషనారావంటి పయోముఖవిషకుంభముల తేటమాటలందును జిక్కుకొని నానాఁట రాజ్యము నల్లకల్లోలములందు ముంచుచున్నాఁడు.

(ఇంతలోఁ బండితరాయుని యన్నకుమారుఁడగు మహా
దేవుఁడు ప్రవేశించును)

విద్యా:—బిడ్డా! ద్వారకనుండి క్షేమముగఁ దిరిగివచ్చితివా ? మీతాతగారు రాలేదా ?

మహాదే:—అమ్మా! తాతగారు ద్వారకయందె యున్నారు. అచ్చట శ్రీకృష్ణాలయ మౌరంగజేబు ధ్వంసముచేయించి యాతావున నొక గోవధశాలను నిర్మింపఁజేసెను. దాని కైవారు చాలవగచి యాయాలయమును బునరుద్ధరించుటకై గుజరాతునందును మహారాష్ట్రమునందును తీవ్రముగనాందోళనము సలుపుచున్నారు. నాయనగారు ! తాతగారిచ్చిన యుత్తరమిదిగో (అనియొక యుత్తరమును పండితరాయుల కిచ్చును.)

పండిత:—(ఆయుత్తరమునందుకొని లోనఁజదువుకొని నిట్టూర్పుతో) నాకువచ్చినవార్త నిజమైనది! (ఉత్తరమును మరలఁజదువుకొనుచు తలపంకించుచు) కానిమ్ము మరల నాయాలయ పునర్నిర్మాణమునకు చక్రవర్తినే ప్రోత్సహింపవలెను.

విద్యా:—నాథా! మీరు చక్రవర్తియాస్థానమున హిందూధర్మ సంరక్షణసేయు పదవియందుండియు తగిన ప్రతిక్రియ నాలోచింపనిచో మాతండ్రిగారికి విశ్రాంతియే యుండదు. మహాదేవా! నీ వెప్పుడుభోజనముచేసితివో! లెమ్మా

వెంటనేరమ్ము. (అని విద్యావతి మహాదేవులు నిష్క్ర-మింతురు.)

పండిత:—ఔరంగజీబు మతాహంకారమువలన మొగలాయి సామ్రాజ్యమునందు మరల మతసంఘర్షణలు తప్పవని తోఁచుచున్నది. వ్యక్తిగాని సంఘముగాని తామొనరించు క్రూరకర్మల దారుణాభారముక్రింద తామేక్రుంగుదురుగాని యొకరినొకరు నిర్మూలింపఁజాలరను సృష్టిధర్మమును మానవుఁడు గుర్తెఱుంగు కాలమెప్పుడు వచ్చునో కదా! (నిష్క్ర-మించును)

[తెరదింపవలెను.]

---

## 3 వ రంగము

### ఢిల్లీకోట :

దారాయంతఃపురము పండితరాయలు దారాకార్యాలోచనము సేయుగదియందు దారాప్రభువుకొఱకు నిరీక్షించుచుండును అంతట రోషనారాబీగం ప్రవేశించును.

పండిత:—(లేచి) అమ్మా! దారాప్రభువింకనురాలేదు.

రోషనారా:—పండితరాయా! ఆవిషయము నేనెఱుంగుదును. మీరుదయచేయుఁడు. (అనియిరువురు చెఱియొకసోఫాపైఁగూర్చుందురు.) దారా మాతండ్రిగారి నగరిలోనికిఁబోయెను. మీరిచ్చట నున్నారనియెఱిఁగియె వచ్చితిని.

మీ కేదియో నాలోచనా నిమగ్నులైయున్నారు. మీ
కంతరాయమును గల్పించితిని కాఁబోలు.

పండిత:—బేగంసాహెబా! ఆలోచన కేమున్నది. ప్రభుపోషణ మున్నచో మాకాకాశమున సౌధములు నిర్మించుట యేపని

రోష:—నాకొక సందేహము చిరకాలమునుండియు బాధించుచున్నది. మీవలన దానినిబోఁగొట్టుకొనఁ దలంచివచ్చితిని. మీరుచాల మేధాసంపన్నులని మాతండ్రి యెప్పడును జెప్పుచుండును.

పండిత:—అమ్మా! పిన్ననాఁటనుండియు మీసోదరసోదరీలకు నాయందున్నయభిమానముచే, మీరు నన్నేపరీక్ష చేయుటకైన నెట్టియభ్యంతరమును లేదు. నేనుమాత్రము సర్వజ్ఞుఁడనా? మీరు నౌరంగజేబు ప్రభువును చాలచదివినవారలు.

రోష:—పండితరాయా! ప్రేమవిచ్ఛిన్నమైనచో దానికిగతి యేమి?

పండిత:—అమ్మా! విషయాదులచే నిరూపింపఁబడిన ప్రేమ, విభిన్నమైనచో నది హృదయవేదనరగులఁజేసి క్రోధాగ్ని యెగయుటకుఁ గారణమగును. ఆప్రేమయే, యతీంద్రియమైనచో, నట్టివిపరీతపరిణామమునొందక మధురభావసమన్వితమగు చక్కనివిప్రలంభమై తుదకు భక్తిగా మాఱును. తల్లీ! యట్టిభక్తియే నిరతిశయానందకందము కదా.

గోప:—పండితరాయా! మీరుచెప్పినట్టి యతీంద్రియప్రేమమాన‌వులకుసాధ్యపడునా?

పండిత:—కాకేమి? పూనికయున్నచో. మనుజునకసాధ్యమెద్ది? మీరుప్రేమించు వస్తువునందు భౌతికదృష్టిని క్రమముగ తగ్గించి, దాని నాధ్యాత్మిక విమర్శనకుఁ బాత్రముసేయుచో నానాఁడావస్తువునందలి ప్రేమయతీంద్రియమగును.

గోప:—మీరుచెప్పినది నాకర్థముకాలేదు.

పండిత:—అమ్మా! ఇందేమున్నది! మీరొకపుష్పమునందలి రమ్యతగమనించునప్పుడు దాని యవయవస్ఫూర్తిని మాత్రమేజూచి యానందించుటకు మాఱాకుసుమమునందలి రూపసంపదకుఁగారణమై తీక్ష్ణస్పర్శగల యగ్నికిని పుష్పమును స్పృశించినంతనె యాహ్లాదమునిచ్చుచు దాని యందలి చల్లదనమునకుఁ గారణమైన వాయుతత్వమునకును,అందుమృదువైనమధురరసమునిచ్చు జలమునకును దివ్యసౌరభమునొసంగు పృథ్వీతత్వమునకును గలసంబంధమును చక్కఁగసమన్వయించి యట్టి పుష్పాకృతినిజనింపఁజేసిన ప్రధానశక్తిని మనము గుర్తించినచో, నాప్రసవమునందతీంద్రియమైన మహత్వము మనకుగోచరించును. అప్పుడు దానిననుభవించుటలో మనకాధ్యాత్మికానందము మాత్రమె శేషించి, కేవలావయవానందము

దానియందు నిలీనమగును. అట్టియానందసంజనిత ప్రేమలు వికల్పరహితములు. అనిర్వికల్ప ప్రేమచే మనకొకపుష్పమునకును వేరొకపుష్పమునకును గలభేదదృష్టియు వ్యక్తిగతానురాగ విరాగములును నశించును.

రోష:—అట్టి నిరవయవమును నతీంద్రియమునగు గుణవైభవమును మాత్రమె యుపాశించుటెట్లు ?

పండిత:—(చిఱునగవుతో) అమ్మా! యట్టిసాత్త్వికారాధనము విగ్రహముల నిన ద్వేషించి హిందువులనుహూషించు మహమ్మదీయులకుఁ దెలియనిచో నీఁకమీరారాధించుయల్లా యెట్టివాఁడని యూహింతురు? నిరాలంబనమక్కఱలేకయే మానసికారాధనము సలుపుటకలవాటుపడిన వారుకదా !

రోష:—పండితరాయా! నేనెప్పుడును హిందువులను ద్వేషించుటలేదు. అదిమీరెఱుంగుదురుకదా! ఇఁకమీమతమును దూషింపనేల ?

పండిత:—ఔను బీగంసాహెబా! అందులకే మీరు హిందూదేశమునకుఁ జక్రవర్తినులు కాఁదగుదురని పలుమాఱు నేననుకొందును. మీరక్తమునందుకూడ హిందూరసపుత్ర రక్తబీజములు లేకపోలేదు.

రోష:—(చిఱునగవుతోఁ గొంచెముతలవంచి) ఔను, మాయవ్వ రాజపుత్రస్త్రీ, కాని పండితరాయా! దారా చక్రవ

ర్తియగుటకు మీరుయత్నించుచుండ, ఇఁక నేనెట్లుచక్ర
వర్తినిని కాఁగలనని యనుకొనుచుంటిరి ?

పండిత:—అమ్మా! దారాప్రభువే తానుచక్రవర్తియగుటకు ప్ర
యత్నించుటలేదు. నేనుయత్నించుట కెట్లుపొసగును ?

రోష:——మాతండ్రి దారానెట్లయిన తనయనంతర మీమొగ
లాయిరాజ్య పట్టభద్రునిఁగా జేయవలెనని తలంచుచు
న్నాఁడు.

పండిత:—అమ్మా! తల్లిదండ్రులకు బిడ్డలందఱియందును సమాన
ప్రేమయుండును. అందుచు మీతల్లిగారు మీచిన్నతన
మునందే గతించుటచే మీతండ్రిగారి పుత్రపుత్రికావా
త్సల్యము జగద్విదితము.

గీ॥ కొడుకుకొఱగామిన్లైనను – గూఁతురెంత।
విసముబెట్టిన తలిదండ్రు – లెసఁగుప్రీతి।
బాయఁజాలుదురే । కడు – పారగన్న ।
మోహబంధంబులట్టివో – నూహ జేయ॥

రోష:——మాదారానువీడి మాతండ్రిగా రితరులకు రాజ్యము
నిత్తురా ? పండితరాయా ?

పండిత:——అమ్మా ! మీతండ్రిగారు మీరుగీచినగీటు దాటరని
దారాప్రభువు నాతో పలుమాఱు చెప్పెరి. రాజ్యమునం
తయు రోషనారాబీగము నడుపుచున్నారనియు నామె
చక్రవర్తిని కాఁగలదనియు ననేకులూహించుచున్నారు

అందుచేతనె నేనుగూడ మీరుచక్రివర్తినిగా నుండ-
దగుదురని యంటిని.

కోష:—దారాకు రాజ్యమక్కఱలేకపోయినను మిగిలినముగ్గురు
సోదరులూరకుందురా ?

పండిత:—వారుమాత్రము మీతండ్రిగారిమాట నేలజవదాటవలెను ? దారాప్రభువునకున్న పితృభక్తినె వారుకూడ ననుసరించి చక్రవర్తి మీకు మొగలుసామ్రాజ్యము నిచ్చినచో వారును మీతండ్రిగారియాజ్ఞను తప్పక శిరసావహింపకమానరు. మీధర్మశాస్త్రమున స్త్రీపురుషులకందఱకును సమానదాయభాగమేర్పడియున్నదికదా.

కోష:—మాయౌరంగజేబు తానెహస్తినాపుర సింహాసనము నధిష్ఠింపవలెనని కోరునేమొ. అతఁడు చాలసమర్థుఁడు. ఈమొగలాయిరాజ్యము నాతఁడేలినచో, నేనేలినట్లె సంతసింతును.

పండిత:—(చిఱునగవు మోమునఁదోఁప) బీగంసాహిబా ! మొగలాయి రాజ్యమునకు దైవవశమున నౌరంగజేబు చక్రవర్తియైనచో నెన్నఁడో సమసిపోయిన హిందూ మహమ్మదీయ సంఘవిద్వేషములు మరలరేకెత్తి రాజ్యమునందల్లకల్లోలములు ప్రబలునేమొయని చక్రవర్తి భయము కాఁబోలు. అందుచేతనె వారు దారాప్రభువును జక్రవర్తిగాజేయఁ గుతూహలపడుచుందురు.

రోష:—ఏమి ! పండితరాయా ! ఔరంగజేబు చక్రవర్తియై నచో మొగలాయిరాజ్యమునకు ముప్పువాటిల్లునా ?

పండిత:—అమ్మా ! యేచక్రవర్తి మీతండ్రిగారివలెనె సర్వమతసహనముకలిగి తనసంఘమువలెనె పెఱసంఘములంనుగూడ గౌరవముతోఁబోషించునో, యాతని సామ్రాజ్యమె చిరస్థాయికాఁగలదు. మతమనున దాయాదేశములందాయాసంఘముల కనువగురీతిని దైవాంశసంభూతులగు మహాత్ములచేఁ బ్రచారముగావింపఁబడిన యొక మహోత్తరాత్మవికాసహేతువగు జ్ఞానవిశేషముగాని కేవల యభినివేశముతోఁగూడిన మైహికావేశముకాదని మీమహమ్మదీయులు గుర్తింపకపోవుట శోచనీయము; ఔరంగజేబుప్రభువునకుఁ బరమతసహిష్ణుత బొత్తుగ లేదని మీకుఁదెలియకపోవచ్చును కాని లోకవిదితము.

రోష.—మాయౌరంగజేబంత యవివేకముతోఁ బ్రవర్తింపఁడని నాయూహ. ఆతనిరాజ్య క్షేమమాతఁడెఱుంగఁడా పండితరాయా ?

పండిత:—ఔరంగజేబు చాలయుక్తిపరుఁడు. చక్రవర్తిరాజ్యకార్యధురీణుఁడు. కాని వివేకియనిన నేనుసందేహింతును. స్వపరభేదములను పాటింపక, సమర్థతతోఁ బ్రజలను రంజింపఁజేయునాతఁడె వివేకముగల ప్రభువు. ఔరంగజేబు చక్రవర్తియైనచో మహమ్మదీయాద్ధత్యముకొఱకు మా

త్రిమె యూతఁడు రాజ్యమునుపాలించును. పైఁగ నతనికి పెఱమతముల నణఁగఁద్రొక్కుటవలన తనరాజ్యము చిర స్థాయికాఁగలదను నహంకారము పూర్తిగకలదు. తుద కాతని మతాహంకారమె మొగలాయి రాజ్యమునకు ముప్పుదెచ్చును.

రోష:—పండితరాయా! మీరు దారానువీడి యౌరంగజేబు నేల చేరరాదు? మీరుపూనుకొన్నచో నాతని హిందూ మతద్వేషము నిర్మూలింపఁగల రేమొ.

పండిత:—అమ్మా! నిశ్చయమునువదలి సంశయము నెట్లాశ్రయింపఁగలను?

రోష:—మాచిన్ననాఁటనుండియు మీరుమాయెడఁ జూపుచున్న భక్తివిశ్వాసము లద్వితీయములగుటచే మాతండ్రిగారు మిమ్మెక్కుడుగ ప్రేమించును, మాకుటుంబములోనివారుగ నెంచుచుందురు. అందుచే మిమ్మందఱు గౌరవింతురు.

పండిత:—అమ్మా! మీతండ్రిగారు నాయెడనట్టిప్రేమఁజూపకుండినచో నాకీమొగలాయిరాజ్యమునందింత యున్నతపదవి మాటయటుండ, నిలువనీడగూడ నొసంగెడివారెవ్వరు?

రోష:—నేను మామొగలాయిదర్బారునందు, మీకున్న గౌరవ మేహిందువునకును లేదని నేనునొక్కి వక్కాణింపఁగలను.

పండిత:—సాహిబా! మానవహృదయమద్దమువంటిది. మన మానసమునందెట్టి రసముప్రసరించుచుండునో యెదుటి

హృదయమునందుఁగూడ నట్టి ప్రతిబింబమే కన్పట్టక మానదు.

ఘోష:—మీరు హిందువులయ్యును, మామహమ్మదీయ ప్రభుత్వమునందభిమానము నింతగాఁజూపుట నాకుఁజాలవింతగ గనుపట్టుచుండును.

పండిత:—వింత యేల ? మీకుఁగూడ నీభారతవర్షమె జన్మభూమి. మీరును మేమును కలసిమెలసి దేశహితవునాచరించుచు పరిపాలనావిధానమును జక్కఁగసాగింపఁ గలిగినచో, మనదేశమును, మనమతమును, నితరులెవ్వరేని కన్నెత్తియైనఁ జూడఁజాలరు.

ఘోష:—మన రెండుసంఘములకును బరస్పరసంఘర్ష మేలకలుగవలెను ? మతమనునది దైవజనితమగు జ్ఞానవిశేషమని మీరిప్పుడేకదా చెప్పిరి. హిందువులు చాలపరమతసహిష్ణుత కలిగినవారుకదా !

పండిత:—ఔను. మామతము సర్వజనీనము. కాని మాసంఘము సంకుచితము. మీమతముసంకుచితము. సంఘము సర్వజనీనము. మేముప్రతియణువునందును దైవశక్తినిగుర్తింతుము. అదియె మామతసారము మీమతము మీమసీదులు వదలినవెంటనె మఱచుదురు. కావుననే మాకు మీతో సంఘర్షములేకున్నను మీకుమామతముచు ద్వేషించుట కలుగుచున్నది. మానవహృదయము దర్పణ

మనికూడ నేనుచెప్పితిని. అదిమీరుగ్రహింపలేదు కాఁబో
లు అద్దమునందు ప్రతిబింబమేర్పడుట సహజముకదా.

షోష:—మాయారంగజేబంత మూర్ఖతతో వ్యవహరింపఁడని
నావిశ్వాసము.

పండిత:—అమ్మా! మామతమునందలి విశ్వవ్యాపకతా ప్రమా
ణముగాని, మీసంఘమునందలి సర్వమానవసౌభ్రాత్ర
త్వముగాని యారంగజేబునందు మృగ్యములు. అతఁడు
గ్రంథపఠనాసంరంభము మారణకళాకౌశలమును మ
తావేశము నుద్రేకించు ప్రచారమునకు మాత్రమెయు
పయోగించుచున్నవి కాని యాతనికి హృదయవికాస
మొసంగుటలేదు.

ఉ॥ దానములేనిహస్తము ని – దానములేనిమతంబుఁ జూడనా।
త్మానుభవంబులేనికళ – ధర్మవిచారణలేని బుద్ధియుఁ।
దీనులఁగావలేనిప్రభు – ధీరత, నీభువిలోపరేంగిత।
జ్ఞానములేని మానవుఁడు – జాలవిషాదము గొల్పు నెంచగన్॥

షోష:—మీరుదారానుపీడి, మాయారంగజేబునకు సాయ
మొనరించినచో ఘనమగు పారితోషికమునిప్పించెదను
మీరె మాయారంగజేబు హృదయమున మార్పుకలు
గఁజేయగల ధీరులు. మీస్వామి భక్తి, రాజభక్తులచంచల
ములు. మాయారంగజేబు చక్రవర్తియైనను మిమ్మా
మొగలాయిరాజ్యము పోఁగొట్టుకొనఁజాలదు.

పండిత:—బీగంసాహెబా! మీసోదరప్రేమ యపారము. మీయనురాగము. మీయగ్రజునివీడి యౌరంగజీబునందుపాదుకొనుట మొగలాయిరాజ్య దురదృష్టము.

రోష:—నాకుమతముతో నిమిత్తములేదు. మాయౌరంగజీబునందు నాప్రేమనిర్హేతుకము. అవ్యాజము. నాయంతఃకరణము శూరుఁడైన మానవునారాధించును. దారా వట్టివిరాగి. మానలువురుసోదరులలో నాకౌరంగజీబె నచ్చినప్రతిభాశాలి.

పండిత:—మీరుచాల పొరబడుచున్నారు. రోషనారాబీగం! దారాప్రభువు ధర్మబద్ధహృదయుఁడు. అతఁడు మొగలాయిరాజ్యమునందుగల హిందూమహమ్మదీయ మతస్థులనందఱ చక్కఁగసమన్వయింపగల ప్రౌఢుఁడు. దారావైరాగ్య మాప్రభువు రాజ్యభారమును వహించువఱకె. ఔరంగజీబు ప్రభువునకున్న మతాభినివేశము దారాయందు లేకపోవుటచే మీరాతఁడు విరాగియని యూహించుట న్యాయముకాదు. దారాయౌరంగజీబులలో దారాయెశూరుఁడు.

రోష:—మీరెన్నిజెప్పినను, మాయౌరంగజీబువలె దారా మొగలాయిరాజ్యమును సమర్థింపఁజాలఁడు. మాతండ్రియాతని నెంతవెనుక వేసుకొనివచ్చినను మహమ్మదీయ ప్రపంచమాతనికి పూర్తిగవ్యతిరేకమగుట నిశ్చయము

పండిత:—అల్లయిన నీకే హిందువుఁడనగు నేనౌరంగజేబును జేరి చేయుసాయమేమున్నది? చక్రవర్తియే దారాప్రభువు నకు సహాయము చేయఁజాలకున్న నాతనికి నేను తోడ్ప డుట యసంభవముకదా!

దాష:—రాజప్రతిష్ఠానమును నిర్వైరముగ మీరుచేయుచోఁ యశ్వంతసింహాదుల వలన మాయౌరంగజేబున కొత్తిడి కలుగదని నావిశ్వాసము. అందులకై మీసహాయముఁ గోరితిని.

పండిత:—నాబోధలవలన ఔరంగజేబునకు హిందువులయందు గల యసూయబోవునంటిరే. అందులకై మాత్రమె నాసాయమనుకొంటిని.

దాష:—ఔను, మీరు రెండువిధముల నుపకరింపఁగలరు.

పండిత:—హిందూమహమ్మదీయ సఖ్యతసాధించుటయె నాజీవి తపరమార్థము. దానినెవ్వరు సమీకరణము గావింతు రో వారితోడ సహకారము సలుపుటకు సిద్ధముగ నున్నాను.

దాష:—పండితరాయా! మా మొగలాయి సామ్రాజ్యమునందు ను మాకుటుంబమునందును మీకున్న భక్తివిశ్వాసము లకు సంతోషపూర్వకముగా నీవజ్రపుటుంగరమును మీకొసంగుచున్నాను. నావలన మీకెప్పుడేసహాయ ము గావలసివచ్చినను మీరునిస్సందేహముగ నొందవ

చ్చును. (అని యొకవజ్రపుటుంగరమును పండితరాయలకొసంగును.)

పండిత:—బీగంసాహిబా! చిరకాలమునుండియు మీతండ్రిగారి నాశ్రయించి యెట్లయిన దేశమునందలి మతద్వేష సంఘద్వేషములనరికట్టవలెనని ప్రయత్నించుచుంటిని మీరు గూడ నాయత్నమునకుఁ జేయూతనొసంగు నట్లల్లా మిమ్ముఁ బ్రేరేపించుగాక.

రోష:—మీరును, నేనునుగూడ, మాయౌరంగజీబునకుఁ దోడ్పడినచోఁ మనయిరువుర యాశయములను పూర్తిగ నెరవేరఁగలవు. అదిగో మాదారాజహనారాలు వచ్చుచున్నారు. షాజహనారాకంఠధ్వని వినిపించుచున్నది. (అనిరోషనారా వెడలిపోవును.)

(అంతట పండితరాయలు కూర్చుండినగదియందు దారా జహనారాలు ప్రవేశింతురు,

జహనారా తెరలోనుండియె యీక్రిందిపాటను పాడుకొనుచు బ్రవేశించును.)

జహనారా:—"హిందూకహే సోన్ హంబడే—ముసల్మాన్‌కహే హామ్ !

ఏక్ మంగ్కా— దోఫంద్ హై — కుంజియాదా కున్ కామ్ !

కుణజియాదా కుణకామ్ — కర్ణానహీ కజీయా !

ఏక్ రామ్కా—భగత్ హై — దూజే రహ్మాన్కా సేర
జియా!

ఏక్ క్రిష్ణ ఏక్ కరీమ్ — దోయిసరితాన్ మిల్ ఏక్
సింధూ!

సాహిబ్ సబ్కా ఏక్ హై — ఏక్ ముసల్మాన్ హిందూ॥

(పండితరాయలు లేచి వారికెదురుగ జనును. దారా పండిత రాయుని భుజముపైఁ జేయివైచి, జహానారా వెనుకరా మువ్వురుచితాసనములపైఁ గూర్చుందురు.)

దారా:—పండితరాయా! మారోషనారా మిమ్మెద్దియో వేధించుచున్నట్లున్నది.

పండిత:—ప్రభూ! ఆమె లౌకికహృదయమునకు విశ్రాంతిస్థానము లేకపోవుటచే నామెమానసమెప్పుడు నలుకుచునే యుండును. విషయప్రవృత్తులందుమాత్రమె పరువులిడు మానవహృదయములు దైవోపహతములగు నప్పుడవి కళావిహీనములగు వజ్రములవలె జీవమునశించి కాఠిన్యత శేషించినవై యుండును.

దారా:—మాజహానారా కట్టియా వేదనయుండదే.

పండిత:—జహానారాబీగం మానసము తేనెటీఁగవంటిది. ప్రేమమరందాస్వాదనమె యామెకు స్పృహణీయాశయము.

దారా:—మారోషనారాకు నాయందసూయకుఁ గారణము లెవ్వియు లేవు పండితరాయా!

పండిత :—ప్రభూ ! ప్రేమయనునది చాలనపూర్వమైన మానసికసంస్కారవిశేషము. నిర్దుష్టమైన యంతరంగవేదికలందె యది చక్కగ బ్రసరించుచు, నిరతిశయానందరసాస్వాదనకు తావొసంగును. ప్రశాంతచిత్తులగు మీవంటి యుదాత్తులకా రసస్వరూపము తెలియునుగాని, పామరులకది మరుమరీచికలవలెదోంచి వారిమానసములను భ్రాంతులవెంట దఱుముచుండును. తుదకట్టి వెఱ్ఱులు విషయవాంఛాసంజనితనిదాఘమునంబడి మృగప్రాయులై యిహపరములకుఁజెడి నశింతురు.

జహనారా :—పండితరాయా ! మాహోషనారానుగూడ ప్రేమతత్వముచేతనవైపునకుఁ ద్రిప్పుకొనవచ్చునని మాదాశ యాసించుచుండును.

పండిత :—అమ్మా !

సీ॥ మానవులందుఁ బ్రేమసుకు ♦ మారతరంబగుసాధనంబగుం
గాని, దయార్ద్రతాగుణ వి ♦ కాసములేని తమోవిమోహి
తుల్ ।
దాని గ్రహింపఁజాలక మ ♦ దాంధులుగాన, మహాత్ములైన
సం ।
ధాన పరాయణాత్మకుల ♦ ధారుణి భీరువులందురాప్పైయిక్॥

(తెరలో)

దారా ప్రభూ ! రక్షించుము ! రక్షించుము ! నన్నీభటు

నేనుగుకాలిక్రిందఁ బడవైచి త్రొక్కించుటకీడ్చుకొని పోవు చున్నారు.

దారా :—(తొట్రుపాటుతో చెవియొగ్గి) పండితరాయా! యే దియో యార్తనాదము వీథినుండి వినవచ్చుచున్నది! (అని పండితరాయుని చేయిపట్టుకొని ముందుకువచ్చును. జహానారా లేచి వెనుకకుఁబోవ జహనారాకును, దారా పండితరాయలకును మధ్య తెరపడును). ఓయీ! రహీమ్ ఖాన్! ఆగుమాగుము! ఏలనతనినట్లీడ్చుకొని పోవుచు న్నారు? అక్కటా! యాతనిశరీరమంతయురక్తసిక్తముగ నున్నదే! వానినిటుతీసికొనిరమ్ము. (శిక్షితులనురిదీయు రహీంఖాన్, బంధింపఁబడిన యొకవ్యక్తి నీడ్చుకొనుచు జైలాధికారి ఖుసూౄతోఁ బ్రవేశించును).

ఖుసూ:—ప్రభూ! ఈదురాత్ముని నేనుగుకాలిక్రిందఁబడవైచి త్రొ క్కించుమని చక్రవర్తి యాజ్ఞనిచ్చియున్నారు. అందుకై వీనినిఁగొనిపోవుచున్నాము.

దారా :—ఈతఁడు సింధురాష్ట్రమునందలి సరిహద్దుఖిల్లాదారు మాలికజీవనుకాఁడా? ఇతఁడుచేసిన నేరమేమి?

మాలికజీవన్—(రోదనముచేయుచు) మహాప్రభూ! నేనురాజద్రో హముఁజేసితినని నాపైయౌరంగజేబు ప్రభువన్యాయ ముగ నేరమువోపి శిక్షింపఁబడుటకై నన్నుబంధించి చక్రవర్తికడకు పంపియున్నారు. అందుపైఁ జక్రవర్తి

నన్నేనుగుకాలిక్రింద పడవైచి త్రొక్కించుటకై యాజ్ఞా పించిరి. అల్లాతోడు. నేనేపాపమెఱుంగను. నేను మీయా మతస్థుఁడనగుటచే నన్ను ఖిల్లాదారుపదవినుండి తొలఁ గించి జంపింపనెంచెను. నన్నురక్షించుము ప్రభూ (అని దీనముగ వేడికొనుచు దారా పాదములపైఁబడెను.)

దారా:—(పండితరాయునివైపుతిరిగి) పండితరాయా! పాపమీ మాలిక జీవనెట్టియపరాధమును జేయలేదని యల్లాపైఁ బ్రమాణము చేయుచున్నాఁడు. మాయౌరంగజేబున కెవ్వని మానప్రాణములనైనఁ దీయుటయన్నఁ జెలఁగా టము. పాపము! వీనిదుర్మరణమువలన వీనియాలుబిడ్డ లెంత పరితపింతురోయని మాసోదరుఁడు గుర్తింపఁడు.

పండిత:—ప్రభూ! ఔరంగజీ బీతఁడు శిక్షార్హుఁడని వ్రాసిన ప్పుడు చక్రవర్తితని నేరమును బూర్తిగవిమర్శించియె మరణదండన విధించియుందురు.

దారా:—మాతండ్రిగారుకూడ నొక్కొక్కప్పుడు చాలనావే శముతో నేకార్యమునైనఁ జేతురు. వారిపుడు వయో వృద్ధులుకూడనగుటచే నాయు దేక్రము మితిమీరు- చున్నది.

పండిత:—చక్రవర్తియే నీతనిపై నేరమునుస్థిరపఱచి శిక్షింప మనమీతనిఁ దప్పించుటెట్లు ?

దారా:—మనమిరువురమిప్పుడే చక్రవర్తికడకేగి యీదీనుని ప్రాణదానముం జేయుడని వేడుదము. తోటిమానవుల

ప్రాణములకైనముట కేనా మనమీరాజ్యమును పాలిం చునది పండితరాయా ?

పండిత:—ప్రభూ! శిక్షాస్మృతులను మనము నడిపింపనిచో రాజ్యమునందలి దుర్మార్గులనణంచుటెట్లు? పరిపాలకు లొకప్పుడు వజ్రమువలె కాఠిన్యమునువహింపవలెను. మఱొకప్పుడు శిరీషకుసుమమువలె మార్దవమును జూపవలెను. లేనియెడల ప్రభుత్వమునందవస్యముగా నాచరింపవలసిన దుష్టశిక్షణా శిష్టరక్షణాధర్మములు నెఱ వేఱుటదుర్లభము అందరియందును మృదుత్వమును జూపుప్రభువును పరిచారకులు నుద్యోగులు లోకువ గొని రాజ్యమునందు లంచగొండితనము హత్యలు, దోపిడిలు మున్నగు దుర్మార్గములనుప్రబలఁజేయుదురు.

వా రా:—నాదృష్టియందు యోగ్యతలేని మానవుఁడొకఁడు నుగానరాఁడు ఏవిధమానసిక పరిణామమునందున్నమను జునెట్టిపనియందు నియోగింపవలెనో విమర్శించుచు వానినట్టికార్యములందుఁ బురికొలుపుట పాలకుల ప్రథమ కర్తవ్యము.

పండిత:—ప్రభూ! అట్టియుదారబుద్ధితో రాజ్యమొనరింపవలె నన్న దేశమునందలి ప్రజలయందెంత సౌజన్యత సహాన శక్తి, క్రమశిక్షణ జ్ఞానము ప్రబలియుండవలెను? రాజ్యము

లందలి హంతకుల యుద్రేకముల నణంచుటకుఁ గాక.
శిక్షాస్మృతులు వ్యర్థముగ కల్పింపఁబడినవా ?

ఉ. రాక్షసులందు సామమను • రాగముమీరజనింపఁజేయునే
నీక్షితిక్షేత్రప్రజాక్షయము • లేగతిసంభవమొందు నేలకో! ।
రూక్షప్రచండపత్రి నతి • రుచ్యవిభేదమునందమర్చ మీ
రీక్షణమందె దీక్షకును • మీక్షణనే యుఁడు పేష లేకయే.

దా॥:—హంతకులెప్పుడును. వారినెన్నికయందు నాయకులచేఁ-
బరికొల్పఁబడుదురే కాని తమంతతామే యట్టి దురం-
తములకుఁ దొరకొనరు. వారియందలి క్రౌర్యమును
తమోగుణమును గనిపెట్టి తమదురాశయములను నెఱ-
వేర్చుకొనుటకు, విద్యాసాంప్రదాయములందుఁ బరిచ
యముగల తామసులు పరద్రవ్యములను పరస్త్రీలను
హరింపను ద్దేశించుచు, పరదేశముల నక్రమముగనాక్ర
మింపవలెనను దురాశాపిశాచమునకులోనై పరిపాలకు
లమని విజ్ఞప్తిఁగుచు హంతకులను జేరఁదీసి వారిసహజ
ఘాతుకత్వమును తమమారణ కళాకౌశలముచేబోషిం
చి, తమరాక్షసకృత్యములకు వారినుపయోగింతురేకాని
కేవల హంతకులనుజాతి సృష్టియందున్నటుల దోఁపదు.
ఎన్నఁడైన నట్టియుద్రేక మొకవేళ నొక్కనియందుఁ
బొడసూపెనేని యట్టివానిని సత్సంగపరిపాకమున
సులభముగఁ ద్రిప్పవచ్చును. మీరామాయణకర్త

యగు వాల్మీకికి దారిద్రోపుడు వృత్తినుండి మహర్షిగ మారలేదా? విద్యాధికులలోనె రాక్షసులుగలరు. వారే లోకమునందు విద్రోహముల కనేకయుక్తులను బన్ను చుందురు. అట్టి పండితమానినులను ద్రిప్పుటకై మనము కడంగవలెను.

ఘ. సి:— ప్రభూ! నీనిని వెంటనే జంపుటకై చక్రవర్తియాజ్ఞ యిచ్చినది. మాకు నీనిని నీకొలి పోవుటకు సెలవీయుడు.

దా. రా:— ఓయీ! మూర్ఖుడా వానిని జంపుటకు మీకు వినోద ముగనున్నది. మీరు క్రూరమృగములా లేక మానవు లా? వానిని జంపిన జంపుదురుగాక! అర్ధ్లలవాని నిడ్చె దరు? వానియొడలంతయు రక్తమయముగ నున్నదే! ఘాతుకజంతువులుగూడ మృగములనుజంపినగాని చీల్ప వు. మీరుమానవులైయుండియు నింతక్రూరముగ సం చరించుచున్నారు. నేను మరలజెప్పువరకు మీరు వానినిజంపినచో మీభుజములపై మీశిరములుండవని నమ్ముడు.

పండితరాయా! మనమిట్టివిషాద వితర్కములందు బడి యున్నచో మాతండ్రిగారు వినోదార్థము బయలుదేఱు వేళయగుచున్నది. మనముతడవుచేసిన నీమందభాగ్యుం డనివార్యముగ జచ్చును! అరే! ఖుహూ! నేను మా తండ్రిగారివద్దకుబోయి మరల నిప్పుడేవచ్చెదను. అంత వరకు మీరు వేచియుండుడు.

(అని దారా పండితరాయలినప్పుడు మోక్షి నచేను వైపునకుఁ
జోవుచున్న షాజహానకడకు జోవును).

ఖుస్రూ:—అరే! భాయీ! రహీం! మనమీరోజున పేని ప్రాణ
ములు దీయనిచో మనభత్యము పదిరూపాయిలు
పోవును. ఇటువంటి సమయమువచ్చినప్పుడె మనకు
బురకు పదిరూపాయిలు దొరికేది. దారావట్టి జాలి
గుండె కలవాడురాభాయీ! అతఁడు మనమహమ్మదీ
యులలో తప్ప బుట్టినాడు. మన దురదృష్టవశమున
నీనాఁడువీని నిట్లుగొనివచ్చితిమి.

రహీం:—దారాచక్రవర్తియైనచో మనముద్యోగమున మట్టివే
సుకొనవలసినదే. అతఁడు మొగలాయిరాజ్యమున నెవ్వరి
నురిదీయనివ్వఁడు.

మాలిక:—భాయీ! ఖుస్రూఖాన్! భాయీ! రహీంఖాన్! బాబా
మీకుసలాములు నన్నుదారాప్రభువు రక్షించినచో,
నాఖిల్లాకుఁబోయిన వెంటనే మీయిరువురకు చెఱియొక
నూఱురూపాయలను బహుమతిగా నంపుదును.

రహీం:—అరే! బేవుకూఫ్! నోరుమూయి. (అనిమోకాలితో
పొడుచును) మీఖిల్లానాయులా బహుమతులిచ్చేది ?
మీరుబళ్ళారితే లేడిపిల్లలు. ఖిల్లాకు నీవుపోయినతరు
వాత మేము నీకుజ్ఞాపకమా ? డబ్బులేకుండ నేమొగ
ముతో నిచ్చట పనిజరుగునని వచ్చితివి? (అని తన్నును)

మాలిక:—అల్లాతోడు. బాబా! నన్నుపోడవకండి నేనుతప్పక పంపెదను. నా దేహమంతయు పుండువలెనున్నది. బాబా! రెండురోజులనుండి తిండిలేదు. నిద్రలేదు. త్రాగుటకు కొంచెము మంచినీరైన యివ్వండిబాబా! ప్రాణములు పోవుచున్నవి. (అని క్రిందపడిపోవును)

రహీమ్:—అరే! భాయీ! వీడుబలేటక్కరిరా! (అని మాలిక జీవనును సైకిలాగును). అరే! ఖుస్రూ! వీనికొరంగజీబు వంటి ప్రభువుండాలి కాని దారావంటి మెత్తనిమానిసి ప్రభువైతే యీఖిల్లాదార్లుచేసే ద్రోహములకు మితి యుండదురా భాయి!

మాలిక:—నేను ద్రోహము చేయనుబాబా! మీకుతప్పక బహు మతిపంపెదను. నాకు కొంచెము దాహము! దాహము! ప్రాణములుపోవుచున్నవి. (అనిమరల క్రిందపడును)

ఖుస్రూ:—అరే! బద్మాష్! (అని తన్నును) నీకుదాహము దారావచ్చి యిస్తాడు. అంతవఱకు పడియుండు. నీవు మాకు పంపించే బహుమతులు చూస్తాములే! నీవు బలేదొంగవు.

(తెర పడును)

---

4 వ రం గ ము

(మోతీ మసీదుకుంబోవుచున్న షాజహాన్ చక్రవర్తికడకు దారా పండితరాయలతోఁగూడఁ బోయి కలసికొనును దారా పండితరాయలిరువురుచక్రవర్తికి సలాముచేసి నిలువఁబడుదురు.)

షాజ:—కుమారా! ఏలయింత తొట్రుపాటుతో పండితరాయల నుగూడఁదీసికొనివచ్చితివి? ఏమైనవిశేషవార్తలున్నవా?

దారా:—నాయనగారూ! విశేషములేవియులేవు. నేనొకశిక్షితుని ప్రాణములు కాపాడుటకై ప్రార్థింపవచ్చితిని.

షాజ:—ఓహో! మాలికజీవన్ జీవనములను రక్షింపఁగోరివచ్చితివా? అతఁడు గొప్పరాజద్రోహమునకుసమకట్టుచుండ నౌరంగజీబువానినిఁ బట్టుకొని,బంధించి వానినేరమును విచారించి శిక్షింపుఁడని నావద్దకుఁబంపెను. అట్టిదురాత్ములను మనముపేక్షించినచో మనకుఁ దప్పక ముప్పువాటిల్లగలదు.

దారా:—ఒక్కచిన్ని ఖిల్లాదారువలన మనవిశాల సామ్రాజ్యమునకు భంగముకలుగునాతండ్రీ!

షాజ:—బిడ్డా! మనవిశాలశరీరము నందెంతసూక్ష్మమైన ముల్లు గ్రుచ్చుకొన్నను, దానినూడఁబెఱుకక కూరకుందుమా?

దారా:—అట్టిప్రమాదకరమగు కంటకములను మనబాహ్యావయములందున్నప్పుడు మాత్రమె మనము వానినూడఁ

బెఱుకుదుము. కాని యవిమనహృదయము నంటుచున్న చో వానిని ఛేదించు టెట్లు? అట్టిశల్యములు మనకొకప్పు డురమ్యముగ గూడ గాన్పించునేమొ!

షాజ:—అదెట్లు! ముల్లు మనకొకప్పు డుల్లాసము గొలుపునా కుమారా!

దారా:—అది మనమేవగించుకొను బర్బూరవృక్షము నందున్న ప్పుడు ప్రమాదముగ గనిపించును. కాని మనమతిశ్రద్ధ తోఁబెంచిన రోజావృక్షమునందవి యందమునీయవా నాయనగారూ! ప్రమాదాప్రమాదము లాత్మవ్యాప్తి ప ర్యవశితములు. ఈనిర్భాగ్యుఁడగు మాలికజీవను మన యౌరంగజీబునకన్న మొగలాయిరాజ్యమున కుపద్రవ ము కలిగింపఁజాలఁడు.

షాజ:—ఏమీ! నీ ... సోదరుఁడుగూడ నంతమూర్ఖతతో వ్యవ హరించుచుండెనా? అతఁడుబాగుగఁజదువుకొనినవిద్యా ధికుఁడు కాఁడా?

దారా:—నాసోదరుఁడైననేమిఁ యగ్బరుచక్రవర్తివంటి మహాపు రుషునికి ప్రపౌత్రుఁడైననేమి?

మ॥ ఘనసత్కీ—ర్తులుపోయినన్ సకలలో—కంబెంత నిందించినన్।
తనమానంబెటుపల్లిపోయినను స—త్సంఘంబు ఛీ! యన్ననేఁ
మని యెవ్వారికవద్దువద్దనిన దు—ష్టావేశభూయిష్ఠులై।
జనవిద్వేషముఁబెంచు పాతకులకే—సంకోచముల్లేవుగా!॥

తండ్రీ! అతఁడు విద్యాధికుఁడంటిరి.

ఉ॥ విద్యలనేర్చినంతన వి-వేకముమానవుఁడొందదేవిద్యా!
హృద్యములైనవిద్యలు మ-హీస్థలినిట్టుల క్షోభపెట్టగాఁ!
జోద్యమెకాదె. రాక్షసులు-సొంపగువిద్యల నభ్యసించినన్!
మద్యముఁద్రావుస్త్రూరులకు-మారణయంత్రములబ్బినట్లుగుఁ!॥

షాజ:—బిడ్డా! ఔరంగజేబట్టి ద్రోహములనేమిచేయుచున్నాఁడు

జహా:—అతఁడు మీప్రతినిధిగఁ బనిసేయుచు గుజరాతునం
దున్న హిందువుల పుణ్యక్షేత్రమగు ద్వారకయందలి
చింతామణి దేవాలయమును నాశనమొనర్చెను. సర్వ
మతసామరస్యతయు, హిందూమహమ్మదీయసఖ్యతయు
మొగలాయిరాజ్యమునకుఁ బునాదులుగ నెంచుచున్న
మీపరిపాలనమునందె యట్టిదురాగతముల నతఁడుచే
యుంచుచు, సింధురాష్ట్రమునందలి పెక్కు-హిందువుల
ను బలాత్కారముగ మహమ్మదీయ మతమునఁ గలు
పుచున్నట్లుకూడ, వార్తలువచ్చినవి. హిందువులందఱు
సింధురాష్ట్రమునువీడి యటునిటుఁబోవుచున్నారు. ఇట్టి
దారుణకృత్యములను జేయుంచుచున్న యౌరంగజేబు
మొగలాయిరాజ్య కంటకుఁడుకాఁడాప్రభూ!

షాజ:—ఏమీ! ఔరంగజేబు ద్వారకయందలి చింతామణి
దేవాలయమును బద్ధలుకొట్టించెనా? మేమువినలేదే?
అతఁడెంతయవివేకి! అట్టి సుందరమందిరమునెట్లు వక్క-
లుచేయుంచెను!

దారా:—వారి దేవాలయమును పడఁగొట్టుటతో నాతఁడు తృప్తి నందలేదుప్రభూ! హిందువులుపూజించు గోవులనువధించు శాలనుగూడ నచ్చోటనిర్మింపఁజేయుట చాలనీచతరము. న్యాయదృష్టితో పరిపాలనావిధానమును నడుప నెంచిన చక్రవర్తి కది జుగుప్సాకరమని యాతఁడూహింపలేదు. ఆతని విద్యాధిక్యతయు రాజభక్తియు నిట్లు వెలుఁగుచున్నవి!

షాజ:—మనకావార్త నాతఁడింతవఱకు దెలుపనేలేదే!

దారా:—అట్టివార్తల నాతఁడెట్టుమీకంపును? తానెచక్రవర్తి యనుకొనుచున్నాఁడు. మీయాశ్రితుఁడగు కవీంద్రాచార్యసరస్వతియును, మనపండితరాయునిపుత్రుఁడు నీమధ్యద్వారకకుఁబోవ, నచ్చటహిందువులెల్ల వారికాభీభత్సదర్శనమును జూపిరి. ఆదేవాలయవిధ్వంసముచే, మహారాష్ట్రులును రాజపుత్రులును చాలనుద్రేకము నొంది మనరాజ్యమునందల్ల కల్లోలములఁ బురికొలుపుటకుఁ బ్రయత్నించుచుండఁ పండితరాయలాయా నాయకులకు లేఖలనంపి, తానీచిన్ని కార్యమును జక్కబఱతుననియు, ననవసరరక్తపాతము వలదనియు నివారించెను. కవీంద్రుఁడు పండితరాయలకు వ్రాసినలేఖను దిలకింపుఁడు. (అని తనజేబునుండి యొకయుత్తరమునుదీసి చక్రవర్తి కిచ్చును.)

షాజ:—(దారాయిచ్చిన యుత్తరముఁ గ్రహించి లోనఁజదువుకొని) పండితదారా! వెంటనే యీ దేవాలయపునర్నిర్మాణమునకుఁ గావలసినధనము మనబొక్కసమునుండి పంపుము. తొలుతటియాలయముకన్న నెక్కుడువైభవముతో నలరారునట్లు గట్టించుటకుఁ గవర్నరులచ్చట నేయుండి యాపనినిబూర్తిచేయించునట్లు నామాటగాఁ దెలుపుము. కుమారా! ఔరంగజేబును, తక్షణమె దక్షిణమునకుమార్చి నట్లొకఫర్మానాపంపుము. యిట్టియవకతవకలిఁకనెన్నఁడును జేయవలదని కఠినముఁగ నాఫర్మానాలో మందలింపుము.

దారా:—తండ్రీ! తమయాజ్ఞను శిరసావహించి యట్లేసేయుదును. ఏ యల్లాప్రీతికొఱకీ దివ్యభవనమును నిర్మించితిరో, యట్టిపవిత్రమగు దేవునిస్మరించి, యీపావనప్రదేశమునందు మాలికజీవనునికిఁ బ్రాణదానముఁగూడసేయుఁడు. ఔరంగజేబు వ్రాఁతలయందంత సత్యమున్నట్లు తోఁపదు. ఒకమానవుని ప్రాణములను దీయుటకన్న నాతనిరక్షించినచో నల్లాసంతసించును.

షాజ:—కుమారా! నీవుమిత్రులను శత్రులనుగూడ వివేకింపఁజాలనిబేలవు. ఈదుర్మార్గుఁడగు మాలికజీవన్ నీ కెప్పుడెట్టి యపకారముఁజేయునో కానిమ్ము. నీయందలి వాత్సల్యమునంజేసి వానికిఁ బ్రాణదానము సేయుచున్నాము. ఇదిగోముద్రిక. పోయివానిని విడిపింపుము.

(దారా తండ్రియొద్ద ముద్రికను గైకొని, తలవంచి, మోతీ మసీదు వైపుదిరిగి మోకరించి, సలాముచేసి, తండ్రియొద్దవినయ పూర్వకముగ తలవంచి నిలచుండును.)

పండిత:—చక్రవర్తీ! దారాప్రభుని హృదయమొక యమృతఘటము. అదిస్వపరప్రశక్తి లేకయె యందఱకు తృషార్ద్రిత గావించుచుండును.

షాజ:—(చిఱునగవుతో) మీరింతకాలమునుండి బోధించుచున్నను, మాదారాకువివేచనాశక్తి కుదురలేదా? పండితరాయా!

పండిత:—ప్రభూ! త్యాగముగూడ, నొకవిధమగు మానసికోద్రేకము. అదిపాత్రాపాత్రములను గుర్తింపనీయదు. తనకుఁబ్రాణాపాయము వాటిల్లునని, తండ్రియెంత చెప్పినను, భారతవీరుఁడగు కర్ణుఁడు, తనసహజౌదార్యమును వీడఁజాలక, కవచకుండలముల నింద్రునకిచ్చెను. తుద కాత్యాగమువలననే యాతఁడు మృతినొందెను. మంచిగుణములుకూడ మితిమీఱ యాచరించు వారొకప్పుడాపదలందుఁ జిక్కుకొనుటలో నాశ్చర్యములేదు.

దారా:—(చక్రవర్తికి సలాముచేసి) తండ్రీ! సెలవొసంగుఁడు. తమయాజ్ఞాప్రకార మామందభాగ్యుని నేనిప్పుడె విడిపించెదను. (అని పండితరాయునితో నిష్క్రమించును. షాజహాన్, మోతీమసీదునకుఁ బోవును. దారా పం

డితరాయలు మరల మాలికజీవను కడకువత్తురు) ఖుస్రూ ఖాన్ ! చక్రవర్తిముద్రికయిదిగో. ఈమాలికజీవను ప్రాణములను చక్రవర్తి రక్షించెను. వానికి మీరుగావించిన యగౌరవమున కాతని మీ రేమేనుగుకాలిక్రింద ద్రొక్కించుటకు గొనిపోవుచుంటిరో, యామేనుగుమీద నెక్కించి వానిఖిల్లాకుఁ బంపివేయుఁడు.

మాలిక:—(తనశృంఖలములతో దారాపాదములపైఁబడి) ప్రభూ మీయపారకృపావిశేషముచే నేఁడునాప్రాణములు దక్కినవి. నాజీవితాంతమువఱకు మీకుగృతజ్ఞుఁడను.

దారా:—పిచ్చివాఁడా! అల్లా మనలనురక్షించును. ఆ దయామయుని కరుణారసములేనిచో మన మొకక్షణముకూడ జీవింపఁజాలము. తనధర్మమును నిర్వర్తించు యుద్యోగుల నెల్లప్పుడల్లాకాపాడుచుండును. నీఖిల్లాను, జాగరూకతతోఁ జల్లగ పాలింపుము. పేదసాదలందాదరముకలిగి హిందూమహమ్మదీయ మతస్థుల నిరువుర నీ రెండుభుజములుగఁ జూచుకొనుము.

(అంత ఖుసూ్రరహీములు మాలికజీవనుని బంధములను విప్పివేయుదురు.)

మాలిక:—(పండితరాయునిజూచి) పండితరాయా! మీకనేక సలాములు. మీయిరువుర నల్లారక్షించుగాఁత.

పండిత:—మాలికజీవనా! మానవజీవితమునకుఁ గృతజ్ఞతయె, యుత్కృష్టధర్మము. సమయమువచ్చినపుడు, నీవుదారా ప్రభువుయెడ నీవిశ్వాసమును జూపవలెను.

మాలిక:—నాసర్వస్వము దారాప్రభుని యధీనము. నా కెట్టి విషమస్థితి తటస్థించినను నాశరీరము దారాప్రభునికొఱ కర్పింతునని యల్లాపైఁ బ్రమాణము సేయుచున్నాను.

(అని మక్కావైపుదిరిగి ప్రమాణముసేయును.)

(దారా, పండితరాయలు నిష్క్రమింతురు.)

ఖుస్రూ! రహీములు:—భాయీ మాలిక్‌జీవన్ మిమ్మేనుగు మీద నిప్పుడెయెక్కించి పంపివేయుదుము. దయచే యుఁడు మమ్ముమాత్రము మరువకూడదు భాయీ! మేము చాలాపిల్లలుగలవారము.

మాలిక:—మీరిరువురు తప్పక నాఖిల్లాకురావలెను. మీకు తగినబహుమతులనిచ్చి వెంటనేపంపెదను.

రహీం:—(వికటముగనవ్వుచు) అరే! ఖుస్రూభాయీ! ఇప్పుడే కాదురా! వీఁడు మనకు చెఱినూఱురూపాయిలు బహు మతి పంపుతానన్నాడు. మళ్లారఖం పిరాయించాడురా భాయీ! మనకు తనఖిల్లాకొస్తే బహుమతిచేస్తాడట! మనకు బలేబహుమతి యిస్తాడురాభాయీ వీడి ఖిల్లాకు పోతే!

మాలిక:—అరే! వాడు, వీడు, అనకుననన్ను, పదండి నన్నేను గుమీాద నెక్కించండి. లేకపోతే దారాప్రభువుతో చెప్పి మీాకు తగినశిక్షచేయిస్తాను.

రహీం:—నీవు వొళ్లారితే లేశిపిల్లవని, మొదపే యెఋగుదుము. పద. పద.

ఖుస్రూ:—అరే! రహీం! నీవుచాలా మోసమనిషివిరాభాయి. జీవన్ భాయి చాలామంచివాడు. అతఁడు ఖిల్లాదారు. ఆయననల్లా అనకూడదు. ఇదిగో! మనఖాదర్ బేగ్ దు ఖాణందగ్గరకు మనము పోదాంభాయిూ. అచ్చట మన మాలిక్ జీవన్ భాయికి కొంచెముషర్బత్ మనము యిప్పిద్దాము. అతఁడు పాపమిందాకనే దాహమన్నాఁడు.

రహీం:—అరే ఖుస్రూభాయి! ఇంకావీడునీకు బహుమతిపంపుతాడనే అనుకుంటూన్నావా?

ఖుస్రూ:—అరే! జీవన్ భాయిూ నేనుగునెక్కించి పంపుదాము పదరా. మనకు వెంటనే బహుమతీ పంపుతాడురాభాయిూ! జీవన్ భాయి అందరుఖిల్లాదారులు వంటివాడు కాడురాభాయిూ!

రహీం:—నీవుయింకా పెరటిదారిలోనేవున్నావు. మళ్ళా వీడు మనచేతిలోచిక్కాలి అప్పుడువడ్డీతో వసూలుచెయ్యాలి

మాలిక:—నన్నేనుగుమీాద నెక్కిస్తారా! యెక్కించరా! లేకపోతే నేనిప్పుడేదారాప్రభువువద్దకు వెళ్ళిచెప్పుకుంటాను

ఖుసూ్రి:—భాయీూ! మాలిక్ జీవన్! మారహీం వట్టిపోగరుబో తు. పదభాయీూ నిన్నేనుగుమీద నేనుయెక్కించెదను. వానిజోలి నీకెందుకు లే.

(అందఱు నిష్క్రమింతురు.)

---

5 వ ర ం గ ము

ఢిల్లీకోట—రంగమహాల్ సభాభవనమున

(1) షాజహాన్ చక్రివర్తి మయూరసింహాసనము నధిష్ఠించి యుండును. (2) దారాషకో (3) సాదుల్లాఖాన్ (4) జైసింహుఁడు. (5) పండితరాయలు (6) సులేమాన్ షకో (దారా పెద్ద కొడుకు.)

అందఱుచితాసనములపైఁ గూర్చుందురు. యిరువురు సేవకులు ఖడ్గపాణులై షాజహాన్ కిరువైపుల నిలచుందురు.

షాజ:—సాదుల్లాఖాన్! పెద్దలగు జగత్సింహుఁడు చాలజబ్బుగ నున్నాఁడను వార్తలువచ్చి నాలుగుదినములైనది. వారి యారోగ్యస్థితి యెట్లున్నదో నేటివఱకు మరల తెలియ లేదు. అసఫ్ఖాన్ వర్యుఁడు మక్కానుండి తిరిగివచ్చు చున్నట్లు తెలిసినది. వారాఫ్ఘనిస్థానము మీదుగవచ్చు చున్నారఁట.

సామల్లా:—వయోవృద్ధుండగు జగత్సింహమహీభుజు రాజ్యశాసనమునందు మనకుముఖ్యుఁడు.

సేవకుడు (ఇంతలోసేవకుఁడు ప్రవేశించి చక్రవర్తికి సలాముచేసి) ప్రభూ! మక్కాయాత్రనుండి తిరిగివచ్చుచున్న యసఫ్ ఖాన్ ప్రభువు లాహోరునందు మరణించిరని యొక యాశ్వికుఁడచ్చట కోటయధిపతినుండి వర్తమానముఁ దెచ్చెను. (అని యొక లేఖను జక్రవర్తికిచ్చెను.)

షాజ:—ఏమీ! ఎంతదుర్వార్తవింటిమి! (అని లేఖనందుకొని విప్పిచూచుకొని) అక్కటా! పెద్దలగు యసఫ్ఖాన్ గతించిరి. గొప్పరాజనీతి విశారదుఁడును మొగలాయి రాజ్యబంధువుఁడునుబోయెను.

పండిత:—ప్రభూ! అసఫ్ఖాన్ వర్యుని మరణముచే దేశమునం దొక విజ్ఞానదీపిక యస్తమించెనని చెప్పకతప్పదు.

జైసింహుఁడు:—జహంగీరుచక్రవర్తి కాలమునుండియు మొగలాయిరాజ్యమునకు సర్వసైన్యాధిపత్యమువహించి, చక్కని సేనానిర్మాణ కౌశలమునుజూపిన ఖాన్ పుంగవులు దివంగతులౌటచే నీమొగలాయి రాజ్యమునకుఁ గలిగిన లోపముతీరుట దుస్తరము.

దారా:—తండ్రీ! తాతగారుగతించుటచే మనరాజ్యమునందు కడుశ్రద్ధతో మనము పెంచుచున్న హిందూమహమ్మదీయ సంఘసమన్వయమను వృక్షమున కొకగాలి పెట్టు.

కానిండు. పెద్దలెల్లకాలమునుందురా? వారులేనిలోటు మనకీ సాదుల్లాఖాన్ వర్యులవలనఁ దీరఁగలదని యాశింపవచ్చును.

(ద్వారపాలకుఁడు ప్రవేశించి చక్రవర్తికి సలాముచేసి)

ప్రభూ ! అలహాబాదు కోటయధిపతినుండి యొకసర్దారు వచ్చెను. సెలవైనచో లోనికిఁ దీసికొనివచ్చెదను.

షాజ:—తక్షణమెవానినిఁ దీసికొనిరమ్ము.

సర్దారు:—(ప్రవేశించి, చక్రవర్తికి సలాముచేసి) ప్రభూ! తమ రెండవ కుమారుఁడగు షుజాప్రభువు, పెద్దసైన్యముతో బంగాళమునుండి దండెత్తి యలహాబాదుకోట నాక్రమించుటకై చుట్టుముట్టెను.

షాజ:—(కోపోద్దీపితాననముతో) సాదుల్లాఖాన్ ! షూజాయిట్టి యుద్రేకమునొందుటకుఁ గారణమేమి ? ఆనిర్భాగ్యుని మనము తప్పకశిక్షింప వలసియున్నది.

సాదుల్లా:—ప్రభూ ! షుజా యట్లుచేయువలసిన యగత్యముకానిపింపదు. నాకును జాలనాశ్చర్యము వొడముచున్నది.

షాజ:—వాని కేదియో విపరీతమగు నాలోచనయుండవలెను.

పండిత:—ప్రభూ ! కామరూపాధీశ్వరుఁడైన ప్రాణనారాయణ ప్రభువు చక్రవర్తికి ముఖ్యమిత్రులగుటచే, వారీయుద యమున నొక యుత్తరమువ్రాసి నాకడ కంపిరి. దానియందుఁ జక్రవర్తికి చాలజబ్బుగ నున్నదనియు,

జీవించుట దుర్ఘ భమనియు, బంగాళమునందంతట నసత్య
ప్రచారము జరుగుచున్నదనివ్రాసి. యిచ్చటి పరిస్థితు
లువెంటనే తెలుపుటకై కోరెను.

షాజ:—ఏమి! అట్టి యసత్యప్రచారముచేకాఁబోలు షుజా
హస్తినాపురిపై దండెత్తఁబూని, ప్రయాగకోటముందు
గ నాక్రమించుటకై ముట్టడించెను!

సాదుల్లా:—అట్టి దుష్ప్రచారముగావించు దుర్మార్గులను ముం
దు మనము శిక్షింపవలెనుప్రభూ! అట్టి యసంగత
వార్తలవలన, మంత్రివర్గమున కపఖ్యాతికూడ కలుగక
తప్పదు.

జైసింహుఁడు —షుజా యవివేకమువలన రాజ్యమునందు రక్తపా
తమును, కలవరములును బయలుదేఱక మానవు.

షాజ:—జయసింహా! మీరును, సులేమానును, వెంటనేతగిన
సైన్యముతో షుజాపైనడచి, వానికిబుద్ధిచెప్పవలెను.

పండిత;—చక్రవర్తీ! తమరు దేశ్రకమునందవలదు. షుజాప్రభు
పున కిచ్చట యథార్థస్థితిని దెలియఁజేయుట కొకరాయ
బారినిబంపినచో నాతఁడు వెనుకకు మఱలవచ్చును.
మీబిడ్డను మీరెశిక్షింపఁబూనుచో నెవ్వరడ్డుపడగలరు?

సాదు:—ఇతరులు తిరుగఁబడినప్పుడు మనమువారిని శిక్షించి,
చక్రవర్తికుమారుఁడె యట్లొనర్పనూరకున్నచో మన
లను బ్రజలు చులకనగఁజూతురు.

దారా:—తండ్రీ! యనవసర రక్తపాతమువలన మనకెట్టి యుపయోగము లేదు. ఇంకను బాగుగ నాలోచించి దండయాత్రసలుపుట శ్రేయోదాయకము.

సాదు:—అట్లయిన నిఁక రక్తపాతము లేకుండ, రాజ్యమును సము ప్రాపెట్లు? ఈ ప్రపంచమున జరుగుచున్న యుద్ధములు వృథాగనే జరుగుచున్నవా? ప్రభూ!

దారా—మంత్రిశేఖరా! అట్లు జరుగుచున్నవని నిస్సందేహముగ జెప్పవచ్చును. కాశ్మీరముపైనను, యుదయపురముపైనను, మీరీమధ్యనడిపిన దండయాత్రల కర్థమేమి? హిందూరాజులు వారి సాంఘిక నీతిననుసరించి వారు పరిపాలన జేసికొందురుగాక. వారిరాజ్యము లందనవసరముగ మన మేలజోక్యము కలుగఁజేసికొనవలెనో నాకు బోధపడుట లేదు. చక్రవర్తి జబ్బుగనున్నారని, మనకోటనుండియె వార్తలువెడలనిచో బంగాళమునందట్టి ప్రచారమెట్లు కలుగును?

జైసిం:—అట్లయిన, నేడుషుజానుమందలింపఁ జక్రవర్తి సమకట్టుట కూడ యనవసరము.

షాజా:—జయసింహా! ఇట్టి కుతర్కములనెచ్చటనేర్చితివి? అక్రమముగ షుజామనపై నెత్తివచ్చుచున్న నాతనికి మనము నీతిఁగఱపవలదా? తక్షణమె నీవును సులేమానునువానిపైకిఁబోయి వానియుద్రేకము నడఁగింపనిచో, నాతఁడు త్వరలో హద్దుమీఱఁగలఁడు.

పాదు:—జయసింహా! చక్రవర్తి యాజ్ఞ చెల్లించుటయె మనకుఁ బ్రధానము.

షాజ:—బిడ్డా! సులేమానూ! నీవు పరాక్రమశాలివని నేనెఱుఁగుదును. కాని నీవింకను యువకుఁడవగుటచే, నీ వెంట మన సేనలోని ముఖ్యనాయకులను గొందఱఁగొనిపొమ్ము. పండితరాయా! యవసరమగుచో సులేమానుకు తగినసహాయమును జేయుమని, ప్రాణనారాయణున కొక ఫర్మానాకూడ వ్రాసిపంపుము.

పండిత:—చక్రవర్తి యాజ్ఞ ప్రకారము తప్పక నేఁడె యట్లువ్రాసి పంపుదును.

సులేమాన్:—తాతగారూ! తమయాజ్ఞాప్రకారము మాపినతండ్రిపైనెత్తిపోవుటకు సందేహింపను. తమయాజ్ఞశిరసావహించుచున్నాను.

జయ:—ప్రభూ! రేపేదండయాత్రకు బయలుదేఱుటకు సర్వసన్నాహ మొనరింపవలసియున్నది.

షాజ:—(కొంచెమాలోచించి) జయసింహా! నీవు మెలఁకువతోఁ గనిపెట్టి యొకవేళ షుజా తన తప్పిదము నొప్పుకొన్నచో, నాతనియెడనంత తీక్ష్ణతవహింపవలదు. అట్టియెడ వానికినేర్పున హితవుచెప్పుటుచితము. షుజాచాలయవివేకి. వానిమూర్ఖతవలన మనమీదండయాత్రకుఁ బూనుకొనవలసివచ్చెను.

దారా:—(తండ్రివైపుజూచుచు) సులేమానూ! నీవు కడుజాగరూకుఁడవై మెలఁగుము. నాస్వరక్షక సైన్యమునుండి కూడ నిరువది ముఖ్యసర్దారులను నీ వెంటఁ గొనిపొమ్ము. యుద్ధములందు జయాపజయములు దైవాధీనములు. నీ వెట్టి క్లిష్టపరిస్థితులందుఁబడినను వారునిన్ను వీడకుందురు.

సులే:—తండ్రీ! పరివార మెంతయున్నను మృత్యువును దప్పింపగలరా? కానిండు. మీయాజ్ఞాప్రకార మట్లనే గొనిపోయెదను.

(ఇంతలో ద్వారపాలకుఁడు మరలప్రవేశించి)

ప్రభూ! మీవారురాష్ట్రమునుండి యొకసర్దారు తమ దర్శనమునకై వచ్చియున్నాఁడు.

షాజ:—(ఆత్రముతో) తక్షణమెవానిని బ్రవేశపెట్టుము.

(సర్దారుప్రవేశించి చక్రవర్తికిసలాముచేసి)

ప్రభూ! మహారాణా జగత్సింహాప్రభువు చాలకాలమునుండియు రోగపీడితులై, మొన్ననె స్వర్గము నలంకరించిరి.

షాజ:—అక్కటా! రాజస్థానసింహముకూడబోయెనా! నే డెట్టి దుర్దినమోకాని, సామ్రాజ్యమునకుఁ బట్టుఁగొమ్మలగు నిరువురు మహాపురుషులు పరమపదించుటయు, షుజా తిరుగఁబడుటయు ననుదుర్వార్తలను వినవలసివచ్చెను. నేఁటికిఁక కొలువుసాలింతము.

(షాజాహాన్ సేవకులు ముందు వెనుకల ఖడ్గపాణులై నడువ చక్రవర్తిముందు నడుచును. అందఱునిష్క్రమింతురు.)

తెరదింపవలెను.



6వ రంగము

రోషనారా భవనమునం దర్ధరాత్రిమున

రోషనారా యొక సోఫాపైకూర్చుండును. అంతట జైసింహుఁడు
ప్రవేశించును.

రోషనారా చేసన్నచే ఆమెకెదురుగనున్న మఱియొక సోఫాపై
జైసింహుఁడు కూర్చుండును.

జైసిం:—బీగంసాహిబా! ఇంతయర్ధరాత్రిమున నాకై వర్తమానమునంపితిరి. విశేషములేమైన నున్నవా?

రోష:—మీరు రేపుదయమునకుఁ బూర్వమె ఢిల్లీనివీడుటకు సంకల్పించితిరఁటకాదా? నేటి సభావృత్తాంతములు, మీరుచెప్పగ వినవలెనని, మిమ్మురావించితిని.

జైసిం:—మీరింటనున్నను, మీపాదములవద్ద కన్నియు రప్పించుకొన సమర్థులని లోకమునకుఁ దెలియదనుకొంటిరా? ఈవఱకె మీకు సభావిశేషములన్నియుఁ దెలియకున్నవా? బీగంసాహిబా!

రోష:—హృదయమునందభిమాన మున్నవారు చెప్పినవిషయములు రసవత్తరములుగ నుండకమానవు.

జైసిం:—అట్లయిన మీకొక ముఖ్యవార్త తెలిపెదను. రాజస్థానమునందు జగత్సింహుఁడు గతించెను.

రోష:—ఆ! అట్లయిన, రాజపుత్రస్థానమునందిఁక జైసింహుని దేపైచేయి. పండితరాయుని ప్రతిభనేటితో ముగిసినది. కాఁబోలు. (అని మందహాసము చేయును)

జై సిం:—అట్లనుటకువీలులేదు. జగత్సింహుఁడు గతించుటచే మొగలాయి రాజ్యమునందు దారాపండితరాయలే రాజపుత్రుల కుపకార మొనరింప సమర్థులని వారియెడ మఱింతగౌరవము హెచ్చవచ్చును.

రోష:—మీయందుమాత్రము వారికట్టివిశ్వాస మేలజనింపకుండును. మీయెడ మాతండ్రికేకాక మా యౌరంగజేబునకుఁగూడ నత్యంతాభిమానముకాదా ?

జై సిం:—ఔరంగజేబు చక్రవర్తియైన యనంతరముకదా నాయందట్టి గౌరవభావము రాజపుత్రులకుఁ గలుగుట (అని మందహాసముసేయును)

రోష:—అది మీ హస్తములందున్నది.

జైసిం:—అన్నట్లు! మఱచితిని! మిమ్ముముందుగా బరామర్శింపకున్నందులకు మన్నింపఁగోరెదను. బీగంసాహిబా ! పాపము! మీతాతగారగు యుసఫ్ఖాన్ గతించుట చాల విచారకరము.

రోష:—ఈ పరామర్శల కేమిగాని, ముఖ్యవిషయములను మీరు దాచుటెందులకు ?

జయసిం:—అదేది ?

రోష:—మాషుజాపై దండయాత్రకుఁ జక్రవర్తి మిమ్ము సర్వసైన్యాధిపతిగఁ జేసిరఁటకాదా ?

జైసిం:—బీగంసాహిబా! ఈదండయాత్ర నాకుచాల మనస్తాపహేతువగుచున్నది. మీముఖమును వీక్షింపఁజాలకున్నాఁడను.

రోష:—అస్త్రీల మీరుసంతాపము నొందవలెను?

జైసిం:—మీరా......సోదరునిపై యుద్ధమునకు నేను...పోవుట యా యని.

రోష:—మీరు పోవుటయె నాకుసమ్మతము.

జైసిం:—కోపముతో నల్లనుచున్నారో, నిజమగు మనోనిశ్చితాభిప్రాయమో తెలియుటలేదు.

రోష:—మీపై యలుగనేల ?

జైసిం:—స్త్రీలయలుకలకుఁ గారణములను బురుషులూహింపఁ గలరా? అందును మీబోటి రాజనీతివిశారదల హృదయమును గ్రహించుట దుర్లభమనుట యతిశయోక్తి కాదు.

రోష:—ఔను. ప్రేమయనునది పురుషుసొలమ్ము ! స్త్రీలు కోపనలు! వారి యలుకలకారణములు !

జైసిం:—బీగంసాహెబా ! మీ ముఖమండలమున తాండవించుచున్న, యీవినూత్నవికాసము, మీహృదయ సంజనితోత్తేజమో, లేక నాపైఁగోపమో నేనూహింపఁజాలకట్లుంటిని.

రోష:—(చిఱునగవుతో) మీకుగవిత్వముచేత కాదేమొ.

జైసిం:—(చిఱునగవుతో) పండితరాయలువంటికవి మిమ్ము వర్ణింపఁగలఁడు కాని, నావలె సేనావాహినులందును రక్తపాతములందు నీదులాడెడి కఠినపు మొఱకులెట్లు

నేఁటి మీముఖలక్షణములను వర్ణింపఁగలరు ? పండిత రాయలు దారా పక్షపాతియైనను మీయాదరణకు పాత్రుఁడే !

రోష:—మమ్ముఁ బిన్ననాటనుండియు నాతఁడాశ్రయించియుండుటఁజేసి, మాతండ్రికిని మాతాతకేకాక మాకుటుంబమునకంతకు నొకవిధమగు గౌరవభావమాతనియందు లేకపోలేదు. మాతాతయగు జహంగీరుకాలముననే నాతఁడీ మొగలాయి దర్బారునకుఁ జగత్సింహునితో వచ్చుచు బోవుచుండెను. ఆతనియెడ తీవ్రతఁజూపుటకు నాకేకాదు. తుదకు మా యౌరంగజీబునకుఁ గూడ నశక్యము. మాయవ్వ రాజపుత్రస్త్రీయగుటచే, మీరనిన మాకుఁజను వెక్కుడు. అందును మీరు మాకుబందుగులుకదా!.

జైసిం:—(చిఱునగవుతో) ఔను. అతిపరిచయము కలచోట యవజ్ఞతయుండకతీరదు. ఇంతకు నింతయర్ధరాత్రమున నన్ను రావించిన గారణముఁదెలుపుఁడు.

రోష:—ఏమియున్నది? మీరుసర్వసైన్యాధిపతియైతిరని తెలిసి నప్పటినుండియు, మిమ్మెప్పుడభినందింతునాయని నా మానస మాందోళనపడుచున్నది.

జైసిం:—స్త్రీలు, వ్యంగ్యాలాపప్రియులు. వారు కడుపులోఁ బ్రేమనుంచుకొని పైకిఁగోపము నభినయింపఁగలరు. అంతః

కరణము కోపోద్దీపితమైనతతిఁ జల్లనిమాటలతో గొంతు
కలు కోయుదురు.

రోష:—యుద్ధములందాటితేలిన వీరులు గొంతుకలు కోయ
గలరు కాని మాబోటి యబలలు కుత్తుకలుత్తరింతు
రనుట రిత్త.

జైసిం:—బీగంసాహిబా! స్త్రీలుతలంచినచో నొక్కరక్తబిం
దువుకూడ జిందకుండ, హృదయవిదారణ మొనరింపఁ
గల పౌఢలు.

చ. సబలులమంచుఁబూరుషులు ♦ చాలవచింతురు వారినేచమీ!
కబరిభరోగ్రపాశమును ♦ గమ్మనినర్మవిలాసవాగురల్ ।
సొబగగు నేత్రసంజనిత ♦ సూక్ష్మకటాక్షశరాళిఁజాలవే? ।
అబలలు కుత్తుకల్గడుగ ♦ నంబుజలోచన! కత్తులేలొకో!॥

రోష:—(చిఱునగవుతో) జైసింహా! మీహృదయము నట్లివట
కెన్నఁడైన వేధించితినా?

జైసిం:—ఎప్పుడోయననేల! ఈనిశీథసమయమున నీయుద్యోత
మాన చంద్రకారక్తదీధితులను ధిక్కరించు, మీరాగ
రక్తముఖమండలమున తాండవించు వింతయగు యీ
విలాసమేరికి హృదయవేదన మాపాదింపదు? మీయా
జ్ఞయేదియో చెల్లించుటకీసేవకుఁడు సిద్ధముగనున్నాఁడు.

రోష:—(మెల్లగ) జైసింహా! నాకువిశేషమగు కోరికలేమున్నవి?
మీరు పోవనున్న యుద్ధమును పరిణయపరిసంగముగ
మార్చవలెను. అదినాకుఁజాలును.

జైసిం:—(ఆశ్చర్యముతో) అదెట్లు బీగంసాహిబా! ప్రియము
ను ప్రణయముగ మార్చుచూ!

రోష:—మీరు, రాజపుత్రులలో మేటివైయుండియు నింతమా
త్రముచేయఁజాలరా?

జైసిం:—మీరుచెప్పునది నాకుఁజాల విపరీతముగఁ జూపట్టు
చున్నది.

రోష:—మీశక్తిసామర్థ్యము లింతియేనా?

జైసిం:—సేవావృత్తినిమగ్నులకు బుద్ధివికాసము మఱుగుపడి
పోవునని వేరుగఁజెప్పవలెనా? అందును, యారంగ
జేబు ప్రభువు సోదరీలగు మీవంటిధీశక్తుల వర్తనములు
గ్రహించుట దుర్లభము.

రోష:—నావర్తనములు మీకుఁగొత్తలా! జైసింహా!

జైసిం:—ఏమిచెప్పుదును!

ఉ॥ ఒక్కొకమాఱు మీదుముఖ ♦ ముజ్జ్వలదగ్నిశిఖాస్ఫు
లింగముల్ ।
గ్రక్కుచు మిమ్ముఁజూడగనె ♦ గాఢతమంబగు భీతిఁ
గొల్పువే ।
ఆొక్కముహూర్తమంపది మ ♦ హోదధిభంగియగాధ
మైచనున్ ।
ఒక్కని చంద్రికావిమల ♦ సారములీను మఱొక్కవేళ
లన్ ॥

మీ రెప్పటికప్పుడె విపరీతముగఁ దోఁచుచుందురు. మిమ్మా రాధించుటకు ధీరుఁడైనఁగావలె భీరుఁడైనఁగావలె. మాబోటిమా ధ్యస్థులకు మీరొక గగనకుసుమమువలె పొడసూపుచుందురు.

రోష:—(మందహాసముతో) మీరెన్నఁడు నేనట్టివిషము విష యముగఁ దోఁచియుండదని నావిశ్వాసము.

జైసిం :—నేఁడు మీయాజ్ఞ నాకెంతయు దిగ్భ్రమమాపాదించు చున్నది. మీ ఔరంగజేబు ప్రభువు సోదరీలగుటచే మీయానతి చెల్లింపనిచో నాతఁడు చక్రవర్తియైన వెం టనె తలతీయింతురేమోయని దిగులొందుచున్నాను.

రోష:—జైసింహా! అంతటిభయోద్రేకము మీకు నావలన కలుగుచున్నచో, మాదారావలె మీశిరమున ఔరంగ జేబవమానముఁజేయకుండ, దానిని నాహృదయపూర్వ కముగ భద్రపఱచెదను.

జైసిం:—మీరెంతకైన తగుదురు. నన్నేమిచేయమందురో త్వరగఁజెప్పుఁడు. కాలాతీతమగుచున్నది. తెల్లవాఱక మునుపె దండయాత్రను సాగించవలెను.

రోష :—షుజాను కఠినముగ మందలింపవలదని మాతండ్రియె మీకుపదేశించెనఁటగ్గా?

జైసిం :—ఔను.

రోష :—షుజాకుమార్తె నౌరంగజేబు కుమారునకిచ్చునట్లు నాతఁడు ఢిల్లీసింహాసనప్రాప్తికై పెనఁగులాడుటలో

నౌరంగజేబు షుజాకు సహాయముచేయునట్లును మీరా తని నొప్పింపవలెను.

జైసిం :—ఔరంగజేబు ప్రభువందుల కంగీకరించెనా ?

రోష :—నేనుగీచినగీటు మాయౌరంగజేబుదాటడని మీరె ఱుంగరా ? మనమెట్టులైన దారాను మట్టుబెట్టినచో యౌరంగజేబు షుజాలమధ్య తగవులున్నఁ బరిష్కరింప వచ్చునని మీరుగట్టిగఁ జెప్పవలెను. దారాయె మనకు ప్రబలశత్రువు. దారా చేతిలో మాతండ్రి కీలుబొమ్మ యై పోవుచున్నాఁడు. మీరెఱుఁగుదురుకదా.

జైసిం :—మీతండ్రిని మీరుచక్కఁ జేయఁజాలరా ? దావూద్ హాకీం చక్రవర్తికి నమ్మకమైనవైద్యుఁడు. పండితరాయలను నాఁటిసభాభవనమున, వెండినాణెములతో తులతూఁచి నదిమొదలాతఁడు దారాయందు మిగులవిసుగుజెంది యున్నాఁడు.

రోష :—మీరుచెప్పినది నాకర్థమైనది. అట్లైన, దావుదును పిలి పించి తగినయేర్పాటులఁ గావించెదను. మీరెట్లయిన షుజా యౌరంగజేబుల బాంధవ్యము ననుసంధానము గావింపవలెను.

జైసిం :—మీయాజ్ఞ చెల్లించుటకు సర్వదాబద్ధుఁడను.

రోష :—మీరుయుద్ధమునకుఁ బోవుచున్నారు. మరల మనమె న్నఁడు కలుసుకొందుమో.

జైసిం:—ఔరంగజేబు ప్రభువు చక్రవర్తియైనఁగాని మనమనో రథము లీడేరవు.

రోష:—అందుకు పిరాదుగట్టిగ నడుముగట్టితిరా? రణరంగమున నున్నప్పుడు మీకుమామాటలు జ్ఞాపకమా?

జైసిం:—నేనెచ్చటనున్నను మీమూర్తిని ధ్యానించుచునె యుందును.

ఉ॥ కోపమునందు మీకనులు ♦ కోకనదంబుల నీసడించుసం!
తాపమునొందువేళ నవి ♦ తామరసాప్తునిదీప్తదీప్తిచే!
నేపుతొలంగు కల్వగతి ♦ నెంతయుఁజాలిని గొల్పు
రమ్యమా!
చూపులుగల్గు మోము లెటుఁ ♦ జూచిననొందవె సుంద
రాకృతుల్!

అట్టి మీనిరీక్షణకాంతుల నేనెట్లుమఱువగలను? బీగం సాహెబా!

రోష:—ఔను. మఱచితిని. మీరువిగ్రహారాధనముసేయు హిందువులు. (అనిమందహాసముచేయును).

జైసిం:—(చిఱునగవుతో) మీరందలిరసమునుమాత్రమె యానుదుగు.

రోష:—కావుననె మామసీదులపై రసస్వరూపుఁడగు నాచంద్రునిఁ బ్రతిష్ఠింతుము. (అని చంద్రునివంకఁ దిరిగిచూపుచు) అతఁడు మీకు మూలపురుషుఁడుకూడనేమొ!

జైసిం:—అందుచేతనె కాంబోలు, రోషనారాబీగం ముఖచంద్ర మండల నిస్సృతసుధాకిరణపాతము జైసింహహృదయ కుముదోజ్జీవికయగుట.

రోష:—(చిఱునగవుతో) నేనాసంగునట్టి యాకరప్రభావము వల ననె మీరునిజముగ మా యౌరంగజీబురాజ్యారోహణ భారమును, తలకెత్తుకొన సశక్తులైనచో నట్టి సుఖస్వ ర్గను మీకొసంగుటకు నేనుసందేహింపనేల ?

(అని రోషనారా పలుకుచు లేచుచుండ తెరపడును).



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# దా రా ష కో

—◙—

## తృతీయాంకము — 1 వ రంగము.

దారాభవనము—ఉదయమున నాలుగుగడియల ప్రొద్దెక్కు-సరికి, దారా పండిత రాయలిరువురును కార్యాలోచనా మందిరమున నుచితాసనములపై గూర్చుండియుందురు.

పండిత:—ప్రభూ! అసఫ్‌ఖాన్ జగత్సింహులు గతించినది మొదలు, సార్వభౌముల శరీరపాటవము కూడ నంతకంతకు తగ్గుచున్నటుల తోచుచున్నది. షుజాతిరుగుపాటుకుఁదోడు, చక్రవర్తి యంతఃపురమున విషాదకరములగు కుట్రలు ప్రబలుచున్నవి.

దారా:—మాతండ్రిగారికి నిన్నరాత్రినుండియు హఠాత్తుగ తీవ్రజ్వరముకలిగి వారస్వస్థతఁ బండుకొని యున్నారు. ఇంతవఱకు లేవనెలేదు.

పండిత:—అట్లనా! మన మొకసారి చక్రవర్తి మేలుకాంచిన వెంటనె దర్శించి కొన్నిముఖ్యాంశములు వారితో ముచ్చటింపవలసియున్నది. ప్రశాంతముగ పరిపాలనా విధానముసాగుచున్న మొగలాయిరాజ్యము నల్లకల్లోలముగా

వించుటకై ఝుంఝూమారుత చిహ్నములు సార్వభౌముని సౌధముననె ప్రారంభమగుచున్నవి. మీరు కేవలనిర్వికల్పస్థితి యందుండి మీకనులయెదుటనె కూడుకొనుచున్న విద్రోహమేఘ పుంజములను చక్రవర్తియు భావి మొగలాయిరాజ్య ధురంధరులగు మీరును బాజిద్రోహుల బ్రియత్నింపకుండుట శోచనీయము.

దారా:—మాతండ్రిగారి యాజ్ఞప్రకారమే కదా షుజాపైనడిపిన దండయాత్రలో జైసింగువెంట సులేమానుపాల్గొన్నది. తుదకు, సులేమాను రణనీతి పరాక్రమములవలననె షుజా యుద్ధమునందోడి పలాయితుడయ్యెనని యచ్చటనుండి తిరిగివచ్చిన రుస్తుంఖాన్ ఫజల్ ఖానులుచెప్పిరి. షుజాను బట్టుకొమ్మని మాతండ్రిగారు జైసింహునకు ఫర్మానా నంపినను, జైసింగు షుజానుజల్లగవదలి, యాతడుతప్పించుకొని పాఱిపోయెనని జైసింహుడు ప్రత్యుత్తరము నంపెను. ఈయుద్ధసమయముననె షుజాకుమార్తె నౌరంగజీబు కుమారునకిచ్చి వివాహముకూడ జరిగెనని, సులేమాను వర్తమానమంపెను!

పండిత :—ప్రభూ! జైసింహునకును, జగత్సింహునకునుగల వైరము చక్రవర్తిగుర్తెఱింగియు నాతనియందు సంపూర్ణ విశ్వాసముతో జక్రవర్తి మెలంగుట చాలనాశ్చర్యముగ నున్నది. జైసింహుడౌరంగజీబు పక్షపాతియని, యిప్ప

ట్టినైన జక్రవర్తి గ్రహింపనిచో మనము చాలప్రమాదము పాలగుదుము.

గారా:—అంతఃపురవిషయములనుగూడ నేనునుకని పెట్టుచునే యున్నాను. మాతల్లిగారు పోయిననాఁటనుండియు మాతండ్రిగారి పుత్రపుత్రికాప్రేమ మితిమీఱుటచే, వారు తమబిడ్డలయందలి లోపములను గనిపెట్టి మందలింపఁజాలకుండిరి. ఆయనురాగమె క్రమక్రమముగ నొకదౌర్బల్యముగ మారుటచే మారోషనారా యంతఃపురమున జేయుకుట్రలకు లెక్కలేదు. మాతండ్రిగారి నుల్లంఘించి, నేనామెను శాశింపనోల్లకుంటిని.

ండి:—దారాప్రభూ! మీరీయార్యావర్తమును మతోద్రేకుల బారినుండి తప్పింపవలెనన్న దృఢసంకల్పముతో మీజీవితమును ధారవోయుటకై పూనుకొనియు, నిట్లూరకుండినగార్యమేమి? మీతండ్రిగారు నన్నుగూడ బిన్ననాఁటినుండియు నపూర్వగౌరవాతిశయములతో బహూకరించిరి. అట్టిచక్రవర్తి ఋణమెట్లు దీర్పఁగలనోయని నేననుదినము పరితపింతును. ఆమహామహుని బ్రియపుత్రుఁడైన దారాప్రభువు, మయూరసింహాసనమునధిష్ఠింపఁ గన్నులారగాంచుటయె యీవిప్రుని మహదాశయము. కృతమెఱుంగనిచో, మానవజీవితము వ్యర్థము కదా!

దారా:—మీరావిషయము నాకు వేఱుగఁ జెప్పవలెనా ? మా తండ్రిగారి నెట్టులైన మనము సంభావింపవలెనను దృఢా నుబంధము మనయిరువుర హృదయములను వేధించు చున్నది. ఏమిచేయుదుము?

పండి:—మనమింక నైన, నెట్టులో చక్రవర్తినోడఁబఱచి, మీాది కార్యమును జక్కఁబెట్టవలెను. లేనిచో మొగలాయిరా జ్య మధోగతికిఁబోవుట తప్పదు.

దారా:—నాకది సర్వసమ్మతమైన యాశయము. నేనందులకుసం సిద్ధుఁడనై మీాతోఁబనిసేయుటకు సిద్ధముగనున్నాను.

సేవ:—(ఇంతలో సేవకుఁడుప్రవేశించి, దారాప్రభువునకు సలా ముచేసి) ప్రభూ! యెవ్వరోయొకఫకీరు పండితరాయల వారికొఱకై వచ్చియున్నాఁడు. (అనిచెప్పను అంత దారాపండితరాయుని వైపుచూచును.)

పండి:— వెంటనే యాఫకీరును లోనికిఁబంపుము.

ఫకీరు:—(ప్రవేశించి, దారాప్రభువునకు సలాముచేసి, యొక యుత్తరమును పండితరాయల కిచ్చును.

పండి:—(ఉత్తరమును విప్పిచదువుకొని) నీవాఫకీరు నెచ్చట గలుసుకొంటివి ?

ఫకీరు:—నేనాతని చెంబల్ నదియొడ్డుననున్న ధోల్పూరువద్ద నావలో గలుసుకొంటిని. నావదాఁటుసరికి మేమిరువుర మమిత్రులమైతిమి. ధోల్పూరునుండి గోల్కొండకుఁ బోవుచు, దారిలో నేనాతనికిగొంచెము గంజాయినిచ్చి

తిని. అదికీల్చి కొంతవడికాతఁడు నిద్దురించెంప, నేనాత నిసంచియందున్న సీయుత్తరమునుగ్రహించి, నాజాడ లాతనికిఁ దెలియకుండ, సర్కారుదానదిజాటి గుజరాతు మీాదుగ నిట్లువచ్చితిని.

పండి:—గుజరాతువార్త లేమైనఁ దెలిసికొంటివా?

ఫకీరు:—గుజరాతునందు మురాదుప్రభువు, గొప్పసైన్యసన్నాహముఁ జేయుచున్నారు. ద్వారకయందలి శ్రీకృష్ణాలయము పూర్తియైనదనియుఁ జాలసుందరముగ నిర్మింపబడినదనియుఁ జెప్పికొనుచు పెక్కురుయాత్రార్థము బయలుదేఱుచున్నారు.

పండి:—సరే, నీవుపొమ్ము. (అంతటఫకీరుపోవ, ఉత్తరమును దారాకిచ్చును.)

దారా:—(పండితరాయలిచ్చిన యుత్తరమున్గ్రహించి లోన జదువుకొని నిశ్వాసముతో) మనమనుకొనుచున్నవిషయములన్నియు నేఁడిందుఁ బ్రత్యక్షములైనవి. ఈవేళకు మాతండ్రిగారు లేచియుందురు. మనము వెంటనె వారి యొద్దకుఁబోవుదము. మనమిఁక నాలసించినచోఁ గార్యము తప్పును.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## 2 వ రం గ ము.

షాజహాన్ చక్రవర్తి సౌధము షాజహాన్ జబ్బుగనుండి సోఫాపై బరుండియుండ రోషనారాబీగం ఔషధము నిచ్చుచుండును.

సేవకుఁడు:—(ప్రవేశించి చక్రవర్తికి రోషనారాకును సలాము చేసి) ప్రభూ! దారా రాకుమారుఁడును, పండితరాయలును తమదర్శనమునకై వేచియున్నారు. సెలవైనచో వారినిదోడుకొనివత్తును.

రోషనారా:—(మొగముచిట్లించుకొని, వెంటనే చక్రవర్తికౌషధమును ద్రావనిచ్చి) చక్రవర్తి యిప్పుడు మాటలాడుస్థితిలో లేరనిజెప్పుము. వారికి విశ్రాంతి చాలయవసరమని వైద్యుఁడు చెప్పెనని జెప్పుము.

షాజ:—రోషనారా! అట్లనవలదు. సేవకా! తత్క్షణమె వారినిఁ దీసికొనిరమ్ము.

రోష:—(తండ్రి కౌషధమునిచ్చిన, రత్నస్థగితమైన స్వర్ణపాత్రము నటఁబొఱవైచి, చివాలున వెడలిపోవును అంత దారాపండితరాయలు ప్రవేశించి చక్రవర్తికి సలాము చేసి యాతనిచే సన్నచే నెదుటనున్న సోఫాలపైఁ గూర్చుందురు.)

దారా:—(తండ్రియొద్దకుఁబోయి, మీఁదఁజేయివైచి) నాయనగారూ! జ్వరాతిశేక మింకనుతగ్గలేదు! హఠాత్తుగ జ్వరమింత తీవ్రముగఁ దగులుటకుఁ గారణమరయవలసియున్నది.

పండి:—ప్రభూ ! రాత్రి నిద్దుర బాగుగ పట్టినదా?

పాదు:—నాకు నిన్నసాయంకాలమె ఫలహారానంతరము జ్వర ముప్రారంభమై రాత్రియంతయు నిద్దురపట్టలేదని చెప్ప వచ్చును. విపరీతమగు స్వప్నములెవ్వియో నామానస ము నుద్రేకించుచుఁ గూర్కనిచ్చుటలేదు పండిత రాయా !

పండి:—అట్లయినచో, ప్రభువులకు విశ్రాంతి చాలనవసరము.

పాదు:—వైద్యుఁడుగూడ నట్లనుచున్నాఁడు. రాజ్యకార్య నిర్వ హణ భారమంతయుఁ బ్రస్తుతము మాదారాపైనుంచి కొంతకాలము నేను విశ్రమించెదను. మీరును సాదుల్లా ఖాన్ మంత్రియు మా దారాకు సహాయము చేయు చుండవలెను.

దారా:—(మెల్లగా) మీయనుజ్ఞయైనచో, రాజ్యభారము నేను వహించుటకు నెట్టి యభ్యంతరములేదు. పండితరాయ లకు మనయందపార విశ్వాసమని వేఱుగ నేఁజెప్పనక్క ఱలేదు. సాదుల్లాఖాన్, మీయందు విశ్వాసముఁజూపు వాఁడె కాని, నాయందుమాత్ర మాతఁడు విముఖుఁడు.

పాదు:—నీవాతనికిఁ జేసిన యపకృతియేమి ?

దారా:—ఈమధ్య నాతఁడు రాజపుత్రస్థానముపైనడిపిన రెండ వదండయాత్రనుగూడ, నేనునుబండితరాయలును నుపసం హారింపఁజేసితిమనియు, నే నీవఱకు కాశ్మీరప్రభువుతో

సంధి చేసికొనుటకు మిమ్ముఁ బ్రోత్సహించితిననియుఁ జాలనసంతుష్టిని జెందియున్నాఁడు. నేను హిందువుల యెడ బక్షపాతమును జూపుచుంటినని యాతఁడుమిగుల కుందుచున్నాఁడు.

పండి:—ప్రభూ ! మనమా దండయాత్ర నుపసంహరింపనిచో నసఫ్‌ఖాన్ జగత్సింహులు గతింపఁగనె మనకును రాజపుత్రులకును వైరముప్రబలి దేశమునందుఁ జాలసంచలనము బయలుదేఱెడిది. దానికిఁదోడు షుజాప్రభువు తిరుగుపాటు మనకుఁజాల కంటకమనిపించెడిది.

షాజ:—జయసింహసాదుల్లాలు జగత్సింహాసఫ్‌ఖానుల స్థానములనుండి, వారిరువురులేని కొఱంత మొగలాయిరాజ్యమునకుఁ దీర్పఁగలరని మనమాసించితిమే !

పండి:—ప్రభువులింకను వారిమనోభావములను బూర్తిగ గ్రహింపకుండుట మొగలాయిరాజ్యమునకు మఱింతయాపద హేతువగుచున్నది.

షాజ:—ఏమీ! పండితరాయా! వారింతమాత్రము సాయము చేయఁజాలరా ?

పండి:—ఎట్టులైన దారాప్రభువుకు హస్తినాపురసింహాసన మధిష్ఠింపకుండఁజేయుటయే వారిపూనిక.

దారా:—(ఉత్తరమునొక దానినిదీసి చక్రవర్తి కందిచ్చును.) తండ్రీ ! మీరుదేశ్రికమునొందక శాంతచిత్తతతో నీయుత్తరమును జిత్తగింపుఁడు. తమకన్నియు బోధపడఁగలవు

షాజ:—(దారాయిచ్చిన యుత్తరమునందుకొని, లోనఁజదువుకొనుచు తలపంకించుచు నిట్టూర్పుతో, మెల్లగా) అందుకొఱకె కాఁబోలును రోషనారాయల్లున్నది. కుమారా! నీవు చాలనమాయికుఁడవు. నాకీవిషయముల నేల నెఱింగింపకుంటివి ?

దారా:—(మెల్లగ) తండ్రీ! తమకీవిషయముల నన్నిఁటినిఁజెప్పి మీపుత్రపుత్రికా ప్రేమల కంతరాయము కల్పించుట కన్న, నేనురాజ్యమునైనఁ బరిత్యజించుట కర్తవ్యమని యెంచితిని. మీయాజ్ఞ చెల్లించుటయె నాకుఁ బరమ ధర్మము.

షాజ:—బిడ్డా! నాయనంతరము నీవె యీ మొగలాయిరాజ్యమును నిర్వహింపవలెను. నీవింతటినుండియైన నీ యెడ విద్రోహము సలుపుచున్నవారిని గుర్తించి మెలఁకువతో వర్తింపుము.

పండి:—ప్రభూ! తమయాజ్ఞలేకుండ నట్టికార్యము దారాప్రభువువహింప సందేహించుచుండుటచే నానాఁట పరిస్థితులు విషమమగుచున్నవి.

షాజ:—కుమారా! రోషనారాను నాకింక సపర్యలుచేయుటకు రావలదనిచెప్పుము.

పండి:—ప్రభూ! మీరునెమ్మదిగఁ బరుండుఁడు. తమరారోగ్యము నొందినవెంటనె కార్యముల నన్నిటినిఁ జక్కఁబెట్టవచ్చును.

షాజ:—పండితరాయా! నాకువిశ్రాంతియా! మీరుచెప్పినస్త్రీ విషయములను గమనించినచో నాహృదయము తాఱు మాఱగుచున్నది!

దారా:—మీకువైద్యము చేయుచున్న దావుద్‌హకీమును దప్పించుట నాయభిప్రాయము. మీ ముఖలక్షణము గూడ నేడుచూడ, నొకవిపరీతమైన మార్పును సూచించుచున్నది.

సేవక:—(ఇంతలో సేవకుఁడు ప్రవేశించి) మహాప్రభూ! సాదుల్లాఖాన్ మంత్రి వచ్చియున్నారు. (అనిచెప్పును)

షాజ:—సేవకా! తత్క్షణమాతనినిఁ దోడ్కొనిరమ్ము.

సాదుల్లాఖాన్:—(ప్రవేశించి, చక్రవర్తికి సలాముచేసి యాతనిచే సన్నచే నొకయుచితాసనమునఁ గూర్చుండును.) ప్రభూ! తమగస్వస్థముగ నున్నారని తెలిసినది. తమ శరీరమునం దెట్లున్నది?

షాజ:—ఖాన్‌సాహేబ్! శరీరబాధ యెట్లున్నను, మనోవ్యథ చాలహెచ్చుగ నున్నది.

సాదు:—చక్రవర్తి కంతమనోరుజకుఁ గారణమేమి?

షాజ:—ఏమియున్నది? అసఫ్‌ఖాన్, జగత్సింహులు గతించిరి కదా. మేమును పెద్దవారమైతిమి. దానికిఁదోడు శరీరముకూడ ననారోగ్యత నొందుచున్నది. అసఫ్‌ఖాన్‌స్థానమున మీరును జగత్సింహుని స్థానమున జైసింహుఁ

ము నుండి మా దారాకు రాజ్యకార్య నిర్వహణమునం దన్నివిధముల తోడుపడెదరని నమ్మియుంటిని.

నాదు:—దానికభ్యంతరమేమి? కాని, ప్రభూ! దారాప్రభువు నకు పండితరాయ లండమైయుండ నాసహాయ మతఁ డపేక్షించునా?

షాజ:—(తలపంకించుచు) పండితరాయలు హిందువుఁడైనను మొగలాయిరాజ్య క్షేమమున కహర్నిశము పాటుపడు చున్నాఁడు. మీరును జైసింహుఁడును దారాకువ్యతిరే కులని నేనింతవఱకను కొనియుండలేదు.

నాదు:—ప్రభూ! మేమిరువురము వ్యతిరేకులమని తమకిప్పుడె వ్వరు చెప్పిరి?

షాజ:—ఈలేఖ నొక్కసారిచదివి, ఇందలివిషయమును మీ రెట్లుఖండింపఁగలరో నిర్వచింపుఁడు.

నాదు:—(తెల తెలబోవుచు మెల్లగా చక్రవర్తి చేతినుండి లేఖను గ్రహించి విప్పి, చేతులు కొంచెమువణకుచుండ నిట్లు చదువును.)

ఢిల్లీకోట రోషనారాయంతఃపురము.

హిజరీ 1067 రబి-ఉల్-అవ్వాల్ నెల చంద 7

సోదరుఁడౌరంగజేబుకు, అక్క రోషనారా వ్రాయునది.

అల్లాదయవల్ల మేమెల్లరము చల్లగనున్నాము. నీవుమా త్రము గోల్కొండశిబిరము నందిడుమలఁబడుచు కాలముగడు

వుచుంటివి. మనకు మంచితరుణమురాకపోదు. అసఫ్‌ఖాన్ జగ త్సింహులుగతించిరి. ఇఁక మహమ్మదీయులెల్లరు సాదుల్లాను, రాజపుత్రులు జైసింహునినసుసరింతురనుటకు సందియములేదు. పండితరాయని తంత్రములును, దారాయౌదార్యములు నిఁక సాగిరావు. దారా హిందూపక్షపాతమునకు విసుగుజెంది, సాదుల్లా మనపక్షమున బనిసేయుటకుఁ బూర్తిగ నడుముకట్టెను. నీవుచక్రవర్తియగుటకు సర్వవిధ ప్రయత్నములును సాగుచున్నవి. మనమనుకొనినట్లు షుజాకుమార్తెను నీకుమారునకిచ్చునట్లు జైసింహుఁడు షుజానొడఁబఱచి నిన్నుత్వరలో గలుసుకొనును. నీవును జాగరూకుఁడవై నీప్రయత్నములను చేయుచుండవలెను. పండితరాయుని వేగులవాండ్రు ఢిల్లీకిని మహారాష్ట్రమునకునువచ్చుచుఁ బోవుచున్నారు. దారాకు మహారాష్ట్రసహాయముకూడ నొడగూర్చుట కాతఁడు యత్నించుచున్నాఁడు. నీవు కడు మెలకువతో మెలంగవలెను.

ఇట్లు నీప్రియసోదరి
రోషనారా.

సాదు:—(తొట్రుపాటుతో చివాలునలేచి పండితరాయునివైపు చుఱచుఱంజూచి) ప్రభూ! ఈయుత్తరము కేవలకల్పితము. ఇదియంతయు నీపండితరాయునికల్పన, నేనిట్టి కుట్రలనుబన్నుట యసంభవము.

షాజ:——జైసింహునకు, మనము షుజానుబట్టుకొమ్మని ఫర్మానాబంపియున్నాము. షుజానాతఁడు చల్లగవదలి, పాఱి

పోయెదనని మనకుఁ బ్రత్యుత్తర మొసంగియున్నాఁడు. సాదుల్లా! నేనుజీవించియుండగనె రాజ్యమిట్టి విషమ పరిస్థితులందుఁ జిక్కుకొనునని నేననుకొనలేదు.

సాదు:—నేను తమదర్శనము మరల సావకాశముగఁ జేసెదను. ప్రభూ! మీరిప్పుడు జ్వరాతిరేకముచే బాధనొందుచు న్నారు. మీకిట్టితఱి మానసికోద్రేకము నొందించుట భావ్యముకాదు.

షాజ:—మంచిది. ఖాన్ వర్యా! మొగలాయిరాజ్య క్షేమము కొఱకు మీరు మీహృదయపూర్వకముగ బనిసేయుఁడు నాశరీరారోగ్యము కుదురువఱకు రాజ్యభారమంతయు దారాపైనుంచితిని. మీరును జైసింహుఁడును దారాకుఁ బూర్తిమైన సహకారమొనరింపఁ గోరుచున్నాను.

సాదు:—తమయాజ్ఞా ప్రకారము నేను మొగలాయిరాజ్యక్షే మముకొఱకు నిరంతరముపాటుపడెదను. సెలవుదయసే యుఁడు. (సాదుల్లానిర్గమించును.)

పండి:—ప్రభూ! తమ కారోగ్యముచేకూఱిన వెంటనె పరిపా లనావిధానమునందుఁ గొన్నిముఖ్యమైన మార్పులను గావించి, భావిరాజ్యభారము దృక్పథమునందుంచు కొనుచు సామ్రాజ్యపరిపాలనా విధానము నొకనూతన ప్రణాళికపై స్థిరపరుపవలసియున్నది. లేనిచో మతకక్ష లెంతమాత్రము నశింపవు. మతోద్రేకుల దుష్ప్రచార

మెతుదకు మొగలాయిరాజ్య పతన హేతువుకాఁగలదని నేను మనవి చేయుచున్నాను.

షాజ:—జగన్నాథా! నాకుమరల నారోగ్యమా! నాహృదయ మునం దెన్నఁడుకలుగని యొకయావేదన నేనిప్పుడౌషధ మునుసేవించి నప్పటినుండియు పొడచూపుచున్నది. నేనీవఱకె పరిపాలనాభారము కొంతదారాకు పంచియిచ్చియుండినచో రాజ్యమునకిట్టి విషమస్థితి పట్టకయుండెడిది.

పండి:—చక్రవర్తీ! మీరధైర్యపడవలదు. మొగలాయిరాజ్యము యొక్కయు దారాప్రభువుయొక్కయు యభివృద్ధియంతయు మీ దేహారోగ్యముపై నాధారపడియున్నది. మీ రిప్పుడు పూర్వముకన్న నెక్కుడుజాగరూకతతో మీ శరీరమును గాపాడుకొనవలసిన యవసరమాసన్నమైనది సెలవుదయసేయుఁడు. మరల తమదర్శనము చేసెదను. (దారావైపునకుతిరిగి) దారాప్రభూ! మీరిఁక మీతండ్రిగారిని కడుజాగరూకతతో గాపాడుచుండుటావశ్యకము. సెలవుదయసేయుఁడు (అని యిరువురకు సలాము చేసి వెడలిపోవును.)

షాజ:—(దారాను జేరఁదీసి) కుమారా! కడు మెలఁకువతో రాజ్యకార్యములను నిర్వహించుచు, రోషనారాచేయుచున్న దురాగతముల నరికట్టుట కంతఃపురమున తగిన చారులనునియమించుము.

దారా:—తండ్రీ! మీరుస్వస్థముగఁ బరుండుడు. జహనారానుమీకుసపర్యలఁజేయుటకై యొప్పించెదను. దావుద్‌ఖాకీ మునుదప్పించి పండితరాయ మిత్రులగు శివదీక్షితుని మీకౌషధమునిచ్చుటకై నియోజించెదను. ఒక్కరాత్రి జ్వరమువలన మీరింత తూలిపోవుటఁజూచి దావుద్‌నై ద్యమునందు నాకనుమానము వొడముచున్నది.

షాజ:—అట్లేచేయుము. నీవన్నికార్యములనప్రమత్తుఁడవై కని పెట్టుచుండుము. ఇదిగోనాముద్రిక. (అని షాజహాను తనముద్రికను దారాకిచ్చును.)

దారా:—(ముద్రికనుగ్రహించి) నాయనగారూ! మీరాందో ళనజెందకుఁడు. నేనన్నియు భద్రపఱచెదను. (అంతటజ హనారా ప్రవేశించును.) అక్కా! నీవు కడుజాగరూ కతతో తండ్రిగారిని కనిపెట్టుకొనియుండుము.

జహనారా:—(తండ్రియొద్దగూర్చుండి, మీదజేయువైచి) జ్వర మింకను జాలతీవ్రముగనున్నది! సోదరా తక్షణమె శివదీక్షితుని బిలిపింపుము.

దారా:—నే నిప్పుడెయన్నియు జక్కబఱచెదను నీవుజాగరూకు రాలవై సపర్యలు సలుపుచుండుము. మనకుఁదల్లియైనను దండ్రియైన నాయనయెకదా. (అని షాజహాన్‌ప్రక్కను మోకరించి యాతనిఁ గౌరవించుకొని లేచి చేతిరుమా లుతోఁ గన్నీరుతుడిచికొనుచు) నాయనగారూ! మరల నేనిప్పుడె వచ్చెదను. (అనిదారానిర్గమించును)

షాజ:—(జహనారానుజూచి) అమ్మా! మీతల్లిలేకపోవుటవలన నాకీదుస్థితి సంభవించినది. అక్కటా! మంటజూ! మంటజూ! అని కన్నులుమూసికొని సోఫాపైతలవాల్చి పరుండును.

(తెరదింపవలెను.)

3 వ రంగము.

ఢిల్లీకోట, రోషనారాభవనమున నొక రహస్యప్రదేశమున
(రోషనారా బీగం:—ఒకసోఫాపై గూర్చుండును.)
ఆమెకెదురుగ.
(2) సాదుల్లాఖాన్ (3) సైప్తఖాన్ (4) దావుద్‌హాకీం.
ఉచితాసనములపై గూర్చుందురు.

రోష:—సాదుల్లాఖాన్‌వరా! మాతండ్రికి నానాఁట నారోగ్యము క్షీణించుచున్నది. మనమిఁక ముందుకార్యములకు గడంగవలెను.

సాదు:—బీగంసాహిబా! ఈతరుణముననె మనయౌరంగజీబెత్తివచ్చునట్లు మన మొనరింపవలెను. షుజాపై దండయాత్రను ముగించుకొని తనసేనలతోఁ దిరిగిరమ్మని దారా తనకుమారునకు వర్తమానమంపెను. సులేమాను దారాకన్న యుద్ధతంత్రమునందు నిపుణుఁడు. మొగలాయిసేనలయందెన్నికఁ గన్నవారందఱు నాతని సేనయందున్నారు.

సైఫ్:—అమ్మా ! పండితరాయలప్పుడె రావుఛత్రసాల్ హాడా. రాజా రామసింగు రాథోరు మున్నగు రాజపుత్రులను దారా పక్షమునఁబోరుటకు సిద్ధము చేయుచున్నాఁడు. రాజపుత్రులలో ఛత్రసాలుఁడు మిగులపరాక్రమశాలి.

సాదు:—వెంటనే మనము జైసింహునకు వర్తమానమంపి సులేమా నెట్లయిన ఢిల్లీకిప్పట్టున రాకుండ షుజానుబట్టు కొనుటకై తలుముచుఁ బోవునట్లు చక్రవర్తివద్దనుండి ఫర్మానవచ్చిన దనుసాకుచెప్పి, సులేమాను మరల కుండఁజేయు నట్లోనరింపదగిన చారులను జైసింహుని వద్దకు మనము పంపవలెను.

దావుద్:—మన మెట్లయిన నీయుద్ధమునందు దారాను మోసమువలన బడగొట్టవలెను. చక్రవర్తి రాజ్యమునంతయు దారాచేతిలోఁ బెట్టుటచే నౌరంగజీబు ప్రభుప్రవాహమున కెదురీదవలసియున్నది.

సైఫ్:—ఖాసింఖాన్, దారాకు నమ్మిన సర్దారులలో నొకఁడు. అతఁడు నాకుబంధువుఁడు కూడనగుటచే నాతఁడు మెల్లగ దారాను మోసగించునట్లు నేనొడఁబఱచెదను.

దావుద్:—అట్లయిన, మాఖలీలుల్లా పదిహేనువేల సైనికుల కధిపతి. ఆతఁడుగూడ దారాను వంచించునట్లు నేనేర్పాటుచెదను.

రోష:—ఇఁక మనమాలసింప కౌరంగజీబునకు వర్తమానము పంపి, హస్తినాపురిపై నాతఁడు సత్వరముగ దండెత్తి

వచ్చునట్లును, మనమిచ్చట సర్వసన్నాహముఁ జేయుచు న్నామనియు వివరింపఁదగు దూతలను బుత్తెంచుటత్యావ సరము.

నాదు:—బేగంసాహిబా ! మనమితరుల నెవ్వరినైనఁ బంపినచో వారు సరిగ నావార్తల నౌరంగజేబు ప్రభువునకందింపఁ జాలరు. జైసింహునివద్దకు సైఫ్ఖాన్ను, దావుద్ హాకీం నౌరంగజేబువద్దకును బంపుటుచితము. మనమిప్పుడు చేయు ప్రయత్నములు చాలగోప్యములైనవి. ఇవిబయట పడినఁ జాలబ్రిమాదము.

సైఫ్:—నేను తప్పక జైసింహునిగలిసికొని మీసందేశమును నిర్వర్తించెదను.

దావుద్:—నేనిప్పుడె పయనమై యౌరంగజేబు ప్రభువును సంద ర్శించి యాతఁడు ఢిల్లీపైదండెత్తునట్లొనరించెదను.

రోష:—మన మెట్టులైన నీతరుణమునందె యౌరంగజేబు దండె త్తివచ్చునట్లుగ బురికొలుపవలెను. మాతండ్రి మరల నేమాత్రమైన నారోగ్యమునొందినచోఁ బరిపాలనా విధానమునందు మనకుఁబూర్తిగవ్యతిరేకమగు మార్పు లను జేయుటకై, దారా పండితరాయలిరువురును మా తండ్రి నొప్పించిరి.

నాదు:—అమ్మా ! సులేమాను లేనితరి దండయాత్ర నౌరంగ జేబు సాగించినచో, మనకుమఱియొక సదుపాయము

కూడ కలుగును. దారాయె స్వయముగ దండయాత్రి నెదుర్కొనవలసి వచ్చును. అతఁడు హస్తినాపురిని వీడఁగనె మనము ప్రధానస్థానముల నన్నింటి నాక్రమింప వచ్చును.

రోష:—అట్లయిన మీయిరువురును జైసింహునివద్దకును మా సోదరునివద్దకును బోవుటకు వెంటనె సమకట్టవలెను.

సైఫ్:—నేనిప్పుడె బయలుదేఱెదను.

దావుద్:—నేనీరాత్రియె తప్పక పయనము సాగించెదను.

రోష:—(సేవకునిబిలిచి) సేవకా, నజీర్ బేగ్‌తో గొంచెము షర్బత్తునుత్వరగఁ దెమ్మనిచెప్పుము.

(అంతటనంటవాఁడు మూఁడుస్వర్ణపాత్రిలనిండ షర్బతు తెచ్చి సాదుల్లా, సైఫ్ఖాన్, దావుద్‌హాకీముల ముందుంచును. మువ్వురును షర్బత్ త్రావుదురు.)

సాదు:—(కొంచెమువికారము నభినయించును) షర్బతుచక్కని సువాసన కలిగియున్నది. కాని బీగంసాహిబా నాకెందుచేతనో గొంచెము తలతిరుగుచున్నది.

రోష:—నజీర్! నీవీషర్బత్తునంతయు జాగరూకతలో తయారుచేసితివా?

నజీర్ బేగ్:—అమ్మా! అంతయు నొకేపాత్రియందు గలిపితిని. మంత్రివరులు పెద్దలగుటచే వారి పాత్రియందుమాత్రి మొకింత సుగంధద్రవ్యము గలిపితిని.

రోష:—నీవా సుగంధద్రవ్యము నెచ్చటనుండి గొనివచ్చితివి ?

నజీర్:—నేనీ ప్రొద్దున మసీదునకుఁబోవునప్పు డచ్చటిమూలికల నమ్ముఫకీరు నాయందు ప్రేమచే నాకొసంగెను. అదిచాల నుత్సాహమునిచ్చునని యాతఁడు నాకుఁజెప్పి యిచ్చెను

రోష:—ఓరీ! మూర్ఖుఁడా! ఆకల్లలఁజేసితివి ! అందుచేత నెకాఁబో లు ఖాన్ వరులకు వికారముకలిగినది.

సాదు:—అమ్మా ! మరేమియు లేదు. తగ్గిపోయినది. సువాసన కొంచెము హెచ్చుగనుండుటచే వికారము కలిగించి యుండనోపు. సెలవుదయసేయుఁడు (అని సైస్తఖాన్ సా దుల్లాలు వెడలిపోవుదురు.)

దావుద్:—(ఔషధమునొకదానిని రోషనారా చేతియందుంచి) బీగంసాహేబా ! ఎట్లయిననీమందు చక్రవర్తి తీసికొను పాలయందుఁ గలిపించవలెను. దీనివలననాతనికిఁ జల్లగ బుద్ధిభ్రంశముకలిగి క్రమముగ నాతఁడొక పిచ్చివాని వలె మీచేతిలో కీలుబొమ్మయై యుండఁగలఁడు. మన ముపాయము చక్రవర్తికి కలిగించినచో దారా పండితరాయలిప్పుడె యన్ని ప్రధానస్థానముల నాక్ర మించెదరు. చక్రవర్తి యింకనుకొంతకాలము జీవించి యుండుట మనకుముఖ్యము.

రోష:—(ఔషధమును బుచ్చుకొని) హకీమ్‌సాహేబ్ మీరుచె ప్పినదినిజము. మాతండ్రి బ్రతికియున్నంతకాలము

దారా రాజ్యము నాక్రమింపదొరకొనడు. కాని మా జహనారా చక్రవర్తికిచ్చుపాలు పితుకునప్పుడు గూడ తాన దగ్గఱనుండి పింపించును.

దావుద్:—కానిండు పాలనుపేయు లాల్ ఖాన్, చేతికరాచుకొని పాలుతీసినచాలును. అదిమైనమీరుసాధించిన జాలును

రోష:—అట్లయిన నేను తప్పక మీరు చెప్పినయుపాయము చేయింపఁగలను. మా యౌరంగజేబు రాజ్యమునకువచ్చిన వెంటనె మీకుఁ దగినబహుమానము జేయింతును.

దావుద్:—అమ్మా! అల్లాదయవలన నౌరంగజేబు చక్రవర్తి యైన వెంటనె (పండ్లుకొఱకుచు) పండితరాయలనురికం బమునెక్కించిన నాకుఁజాలును.

రోష:—(చిఱునగవుతో) హాకింసాహేబ్ ! తప్పకట్లు చేయించెదను.

(ఇరువురునిష్క్రమింతురు.)

---

## 4 వ రంగము.

గోల్కొండ రాజ్యమునందౌరంగజేబు శిబిరమునకొక డేరాలో.

(1) ఔరంగజేబు (2) జైసింహుఁడు.

ఉచితాసనములపైఁ గూర్చుందురు.

ఔరం;—జైసింహా! ఢిల్లీవార్తలన్నియు సమగ్రముగవింటిరా?

జైసిం:—ప్రభూ! షైస్టఖాన్ నాకన్నియుఁ జెప్పెను.

ఔరం:—అసఫ్ ఖాన్, జగత్సింహులు గతించుటచే, నాయం దవ్యాజ ప్రేమపూరితులగు మీకును సాదుల్లాఖాన్ వర్యులకును నాయకత్వముసిద్ధించినది. నాకిఁక హస్తినా పుర సింహాసనము కరతలామలకము. మాతండ్రికిఁ గూడ చాలజబ్బుగనున్నదని మాయక్క వర్తమాన మంపిరి.

జైసిం:—మనకన్నివిధముల మంచితరుణ మాసన్నమైనది. మీ రిఁకతడవుసేయక దండయాత్రను వెంటనేసాగింపుఁడు. మనమిప్పుడవలీలగ రాజ్యమును స్వాధీనము చేసికొన గలము.

ఔరం:—యశ్వంతసింహ, ఛత్రసాల్ హాడా మున్నగురాజపు త్రులు దారాపక్షమునఁ బోరుటకు సిద్ధముగనున్నారని తెలియుచున్నది. మీరెట్లైన యశ్వంతుని మనవంకకుఁ ద్రిప్పినచో, నేనుచక్రవర్తినైన వెంటనె, యాతని రాష్ట్ర మునకుచేరియున్న, గుజరాతునకాతనిఁ బ్రతినిధిగఁజేసెద నని మీరుప్రోత్సహించి నాకతడడ్డురాకుండఁ జేయ వలెను.

జైసిం:—ప్రభూ! నేనుమీకుసర్వవిధముల సహాయము చేయు దును. మీరుచక్రవర్తియగుటకన్న, నాకుమిన్నయగు యానందమేమున్నది? అందులకేకదనేనతిప్రయత్నముపై మీకును షుజాప్రభువునకును సంబంధముకలిపితిని.

శౌరం:—అందుకు మీకు నేను జాలకృతజ్ఞుఁడను. జైసింహా! సులేమాను నాతనిసైన్యము తెచ్చుటనున్నవి?

జైసిం:—సులేమానుసేనలలోని మహమ్మదీయ సర్దారులందఱి తోడను, మీరు తప్పక చక్రవర్తి కాఁగలరనియు, వారికిమంచిబహుమతులును గౌరవములును ప్రాప్తించుననియుఁజెప్పి, సులేమానును జల్లగవదలుటకును, వారందఱు మీపక్షము వహించుటకును రహస్యముగ నేర్పాటుగావించితిని. సులేమాను, హస్తినాపురముచేరకుండ షుజాసేనలను తూర్పుబంగాళాంతర్భాగములోనికిఁ దఱుమునట్లు చక్రవర్తియాజ్ఞయైనదనిజెప్పి యాతఁడాసంరంభముననుండ, నాతని సర్దారులాతనిపై తిరుగఁబడునట్లొనర్చితిని.

శౌరం:—(జైసింహుని భుజముపైతట్టుచు) జైసింహా! మీరునావిషయమై చెందుచున్న ప్రయాసమును నేనెన్నఁటికిని మఱవఁజాలను. కాని యశ్వంతుఁడునూడ నాకడ్డురాకుండఁజేసినచో మీ శ్రమకుఁదగిన ఫలముచేకూరును.

జైసిం:—(శిరమును గొంచెముపైకెత్తి యాలోచించుచు, తలపంకించి) యశ్వంతునికిని దారాపండితరాయలకు నున్న మైత్రిచాలదృఢమైనది. అయినను నేనుమీకొఱకై తీవ్రప్రయత్నముఁ జేసిచూచెదను. తుదకు యశ్వంతుఁడు తటస్థముగనుండునట్లైనఁ గావింపగలుగుదు నేమోయని తోఁచుచున్నది.

ఔరం:—రాజసింహుఁడుకూడ సమయమువచ్చినప్పుడు దారా కుసహాయము చేయకమానఁడు. మీ రేలాగున్నైన య శ్వంతునికొఱకు రాజస్థానము పోవనుంటిరి. రాజసిం హునిఁగూడ, మనపక్షమునకుఁ ద్రిప్పినచో మాతండ్రి యాతనివద్దఁదీసికొనిన యాతనిరాజ్యములోని పరగణా ల నాతనికి నేను జక్రవర్తి నైన వెంటనె మరలనిచ్చివే యుదునని మీరునమ్మించఁ బలుకవలెను.

జైసిం:—ప్రభూ! సాదుల్లాఖాన్ ప్రోత్సాహముచేతకదా చక్ర వర్తి యాతనిపై దండెత్తినది. దానికి దారాపండితరాయ లడ్డుపడి యాదండయాత్ర నుపసంహారింపఁజేసిరి. దాని నాతఁడింతకు మఱచునా ?

ఔరం:—మీరుతలంచినచో నెట్లయిన, భేదదానములనుపయో గించి యాతనిఁద్రిప్పగలరు. ఆతని రెండుపరగణాలకొఱ కాతఁడేలయాసింపఁడు?

జైసిం:—కానిండు. నేఁజేయఁగలిగినదంతయుఁ జేయబ్రయత్నిం తును.

ఔరం:—(జైసింహునిచేయిపట్టుకొని) జైసింహా! నన్ను హస్తి నాపురసింహాసనముపై గూర్చుండఁబెట్టు భారముమీది. మీగర్భశత్రువగు జగత్సింహుఁడు మాతండ్రి నెట్లుమొగ లాయిసామ్రాజ్య పట్టభద్రునిఁగ నొనరించెనో, యట్లనె మీరును మీసర్వశక్తియుక్తులను వినియోగించి నాకు సహాయము చేయవలెను. (అని లేచి తననడుమున వ్రే

లాడుచున్న కత్తిగలపట్టాకుండి, యొకఖడ్గమునుదీసి) ఇదిగో నాకీగోల్కొండనవాబు పారితోషికముగనొసం గిన నవరత్నఖచితమైనకత్తిని సాహ్లాదయపూర్వక ముగ మీకొసంగుచున్నాను. నేను చక్రవర్తినైనచో మీరు మొగలాయిరాజ్యమునందు సర్వసైన్యాధిపత్య మువహింపకతప్పదు.

జై సిం:—(మందహాసముతో) ప్రభూ! నే నెన్నివిధములనైన మిమ్ము మయూర సింహాసనము నధిష్ఠింపఁజేయుటకుఁ బూర్తిగయత్నము జేయుదునని నీకత్తిపైఁ బ్రమాణము సేయుచున్నాను.

(ఇంతలో సేవకుఁడు ప్రవేశించి) ప్రభూ! ఢిల్లీనుండితమకై యెవ్వరోవచ్చి వేచియున్నారు. సెలవైనచో లోనికిఁ దోడ్కొనివత్తును.

ఔరం:—వారెవ్వరో యరసిరమ్ము.

(సేవకుఁడు మరలఁబ్రవేశించి) ప్రభూ! అయనపేరు దావుద్ హాకీం.

ఔరం:—సత్వరముగ నాతనినిలోనికిఁ బంపుము.

దావుద్ హాకీం:—(ఔరంగజీబు, జైసింహులకు సలాముచేసి) ప్రభూ! తమయక్క రోషనారా బీగంసాహిబా యీలేఖను తమకందఁజేయుటకై నన్నుబుత్తెంచిరి.

ఔరం:—(లేఖనందుకొని) హకీంసాహెబ్! దయచేయుఁడు. మిమ్ముఁజూచి చాలదినములైనది. మాయక్క సాదుల్లాఖాన్ మున్నగునామిత్రులందఱు క్షేమముగనున్నారా?

దావుద్:—ప్రభూ! అందఱు క్షేమముగ నున్నారు. జైసింగ్ సాహెబ్! మీరారోగ్యముగ నున్నారా ?

జైసిం:—హకీమ్‌సాహెబ్! నేనారోగ్యముగ నున్నాను. చక్రవర్తి యెట్లున్నారు.

దావుద్:—నానాఁటికి వారియారోగ్యము క్షీణించుచుండుటచే వారునమాజునకు మసీదుకుఁగూడఁ బోవుటలేదు.

ఔరం:—(ఇంతలో లేఖనువిప్పి చదువుకొని) జైసింహా! ఈలేఖను మీరుకూడఁ దిలకింపుఁడు. (అని యాలేఖను జైసింహునకిచ్చును.)

జైసిం:—(లేఖనందుకొని లోనఁజదువుకొని చిఱునగవుతో) అట్లయిన నిఁకజక్రవర్తి క్రమముగ జీవచ్ఛవమువలె నున్నాఁడు కాఁబోలును. సైఫ్ఖాన్ దావుద్‌హకీంసాహేబ్‌లు మనకుఁబూర్తియైన సహాకారమొసరించుచో, మనకు విజయముతప్పదు. నేనిఁక రాజస్థానమునఁదగుప్రయత్నములు సలిపి, మిమ్మాగ్రావద్ద కలుసుకొందును. సెలవొసంగుఁడు.

ఔరం:—నాభావ్యభివృద్ధియంతయు మీహస్తములందున్నది..

జైసిం:—రాజపుత్రుఁడు కత్తిపైఁ బ్రమాణమును జేసిన, నిఁకనెట్లు వెనుకకు మఱలఁగలఁడు?

ఔరం:—(చిఱునగవుతో) జైసింహా! సలామ్.

జైసిం:—(సలాముఁజేసి నిష్క్రమించును)

శౌరం:—దావుద్ సాహేబ్! మీరు పెద్దలయ్యును శ్రీమకోష్ఠి, నాయందభిమానముచే నింతదూరము వచ్చితిరి.

దావుద్ హకీం:—ప్రభూ! మీరట్లనవలదు. మఱియొకరిచే సేతే ఖను బుత్తెంచినచో వారు పండితరాయుని వేగులవాం డ్రచేతిలోఁ బడుదురని రోషనారాబీగం నన్నుఁబంపెరి,

శౌరం:—హకీంసాహేబ్! దారాపండితరాయలిరువు రిప్పుడు మొగలాయిరాజ్యమును ద్రిప్పుచున్నారు.

దావుద్:—ప్రభూ! దారావట్టుకాఫరు ఆతఁడు పండితరాయుని మాకంటె నెక్కుడుగౌరవముతోఁ జూచుచున్నాఁడు. అదృష్టవశమున దారాచక్రవర్తియైనచో నిఁక హిందు వులేరాజ్యమునందుఁ బ్రాముఖ్యతవహింతురు.

శౌరం:—నేనుజక్రవర్తి నైన పిమ్మట వారిగతియెట్లుండునో మీరెచూచెదరుగాక.

దావుద్:—అదియె మాకుఁగావలెను. మన షెరియటుననుస రించి మీరుప్రభుత్వము నేర్పాటుచేయుచో మొగ లాయి రాజ్యమునందిఁక హిందువులకు తావుండదు. వారందఱుతప్పక మనమతములోఁగలయవలెను. మీరు చక్రవర్తియగుట కాయల్లాను ప్రార్థించుచున్నాము.

శౌరం:—(మందహాసముతో) హకీంసాహేబ్, ప్రార్థనలవలన రాజ్యములు చేకుఱునా?

దావుద్:—అంతియెకాదు. మాఖలీలుల్లా చక్రవర్తికి నమ్మిన సర్దారులలో నొకఁడు. ఆతఁడు యుద్ధసమయమునందు

దారాను వంచించి మిమ్ముఁజేరునట్లు నేను ఖలీలుల్లా నొప్పించెదను.

ఔరం :—మీరు నాకట్టిమహోపకారమును జేసినచో మీ మేలునేనెన్నఁటికిని మఱవను. నేను చింతామణి దేవాలయము బ్రద్దలుకొట్టించి యందలి కృష్ణవిగ్రహము చేతినుండియూడఁబెఱికిన నీవజ్రపుటుంగరముతో నేఁడు మీహస్తమునలంకరించుచున్నాను. (అని తనచేతి నున్న వజ్రపుటుంగరమును దావుద్ వ్రేలియందుంచును).

దావుద్:—(గడ్డము నివురుకొనుచు) శహబాష్ ! ఈనాడుకదా మాకుపండువు! నేఁడుకదా యల్లామాతయగు మహమ్మదు కుమారుఁడైన యౌరంగజేబు కాఫరులవిగ్రహములను బ్రద్దలుకొట్టి వానిచేతియుంగరమును తనభక్తునకర్పించెనను సంతోష మాయల్లాకుగలుగుట ! కాని! ప్రభూ! పండితరాయలు బలేయుక్తిపరుఁడు. మీరుధ్వంసముచేయించిన యాద్వారక దేవాలయమును మరలఁ జక్రవర్తిచేతనే పూర్వముకన్న నెక్కుడు వైభవోపేతముగ నిర్మింపఁజేసెనఁట !

ఔరం :—అంతేకాదు. గుజరాతునుండి తత్క్షణమే యాదక్షిణమునకు నన్నతఁడు మార్పించెను.

దావుద్:—అబ్బా! ఆహిందూపండితుఁడు బహుతంత్రజ్ఞుఁడు. బలేటక్కరి. ఎచ్చటనో యాంధ్రదేశమునుండివచ్చి

మనమొగలాయి రాజ్యమునంతను దిగ్భ్రమింపజేయుచున్నాఁడు. అతఁడును కవీంద్రాచార్యులును, కాశియందు, మథుర యందు, ద్వారకయందు హిందూసభలుచేయించి, వారి ధర్మశాస్త్రములను కాలానుసారముగ మార్పించుటకు గొప్పయత్నములు సలుపుచున్నాఁడు. దారా చక్రవర్తియైనచో, నెప్పుడో కృష్ణదేవరాయలతో నంతమైన హిందూసామ్రాజ్యము మరల తలయెత్తకమానదు ప్రభూ!

ఔరం:—కానిండు. మీరు నాకుఁబూర్తిగ సహాయము చేసినచో నేనుచక్రవర్తి కాఁగలను. ఆనాఁడు పండితరాయలు దారాల్వ్రాసిన గ్రంథములన్నియు నిర్మూలముగావించి వారుచేసిన యీప్రచారమునుబూర్తిగ నణఁగఁ ద్రొక్కింప మీరెచూచెదరుకాక.

దావుద్:—సైఫ్ఖాన్ ఖాసింఖానును, నేనుఖలీలుల్లాను తప్పక త్రిప్పివైచెదము. మీరెంతమాత్రము సందేహింపవలదు. కాఫరగు దారాను వంచించినచో మనముసలమానుల కెంతమాత్రమును దోసములేదు. మీరిఁక సత్వరముగ దండయాత్రను సాగింపుఁడు.

ఔరం:—నేనన్నియు సిద్ధముచేసితిని.

దావుద్:—మీరు వెంటనే దండయాత్రసాగింపనిచో దారా చాలబలపడును.

(ఇంతలో సేవకుఁడుప్రవేశించి ఔరంగజేబునకు సలాము చేసి) ప్రభూ! మురాదు ప్రభువువద్దనుండియు షుజాప్రభువువద్ద నుండియు నిరువురాశ్వికులువచ్చి తమదర్శనముసేయుటకై వేచి యున్నారు.

ఔరం :—వారినిటకుఁ దీసికొనిరమ్ము.

(ఇరువురాశ్వికులు ప్రవేశించి ఔరంగజేబుకు సలాము చేసి) మొదటివాఁడు:— ప్రభూ! తమ రేర్పఱచినప్రకారము, మురాదు ప్రభువు తనసేనలతో గుజరాతునుండిబయలుదేఱెరి.

ఔరం .—సరే, నీవుపొమ్ము. (ఆశ్వికుడు సలాముచేసి నిష్క్రమించును.)

రెండవవాఁడు:—ప్రభూ! షుజాప్రభువు మిమ్మాగ్రావద్దఁ గలసి కొనుటకై తగుసన్నాహములు చేయుచుండ, కామరూపాధీశ్వరుఁడైన ప్రాణనారాయణుఁడు బంగాళముపై దండెత్తివచ్చుచున్నట్లు వార్తలువచ్చుటచే నాతనిపై నడువవలసివచ్చెను. అందుచే షుజాప్రభువు మిమ్ము గలసికొనఁజాలమని సందేశమునంపిరి. (అనియొకయుత్తరము నౌరంగజేబునకిచ్చును).

ఔరం :—(ఉత్తరమునందుకొని లోనఁజదువుకొనుచు, తలపంకింపుచు, నిట్టూర్పుతో) కానిమ్ము. నీవుపోవచ్చును. (అంతట సర్దారువెడలిపోవును). హకీంసాహేబ్! చూచితిరా! దారా పండితరాయల కుటిలు. ప్రాణనారాయ

ణుని దండెత్తునట్లొనర్చినచో నిఃకషముగా మనకు సాయ పడఁజాలఁడని యెత్తువేసిరి.

దావుద్:—నేనుతప్పక మాఖలీలుల్లాను భద్రపఱచెదను. సైఫ్ ఖాన్, ఖాసింఖాను నెక్కడైనఁదిప్పకమానఁడు. మీరు దండయాత్ర నెంతమాత్రము మానవలదు. సెలవు దయచేయుఁడు.

ఔరం:—హాకీంసాహేబ్! మాయక్కగారితోడను, సాదుల్లా తోడను నేనును మామువాను యుద్ధసన్నద్ధులమై బయలువెడలుచున్నట్లు మీరువిన్నవింపవలెను.

(అంతనిరువురులేచి శిబిరము వెలుపలకు వచ్చుచుండ, నొకయాశ్వికుఁడువచ్చి సలాముచేసి) ప్రభూ! యీ యుత్తరమును రోషనారాబీగం మీకిమ్మని సన్నబంపిరి. (అని యొకయుత్తరమునిచ్చును).

ఔరం:—(ఆయుత్తరమునందుకొని విప్పిలోఁజదువుకొని నిట్టూర్పుతో) హాకీంసాహేబ్! ఎంతవిషాదము! చాలప్రమాదము జరిగినది.

దావుద్:—ఏమి? ప్రభూ! అట్లనుచున్నారేల? చక్రవర్తి గతించెనా?

ఔరం:—ఆముసలిపిశాచమప్పుడేచచ్చునా? పాపము సాదుల్లా ఖాన్ మీరు బయలుదేఱిననాఁటి రాత్రియె విషూచి వ్యాధిచేఁబోయిరఁట.

దావుద్:—అరే! అల్లా! అరే! అల్లా! ఎంతమోసముజరిగినది అదివిషూచికాదు ప్రభూ! ఇదియంతయు పండితరాయుని కుట్రవలనజరిగినది. (ఇరువురు మరలలోనికివచ్చి ఆసనములపైఁ గూర్చుందురు.)

షౌరం:—ఏమైననేమి. హకీంసాహెబ్! మనకొక ప్రధానమగు పట్టుఁగొమ్మపోయినది. (అని నిట్టూర్పుతోఁ గూలఁబడి. కొంతతడవాలోచించి) కానిండు. వారిస్థానమునమనకు సుముఖుఁడగు మీర్జుమ్లాను నియమించుటవలన మనకుఁ గొంతయనుకూల పరిస్థితులేర్పడినవనిఁ జెప్పవచ్చును.

దావుద్:—అట్లనా! ప్రభూ! మీర్జుమ్లా మనకాంతరంగికుఁడేనా ?

షౌరం:—అతనిసహాయమువలననే మనకీగోల్కొండకోట స్వాధీనమయ్యెను. మీర్జుమ్లా మనసున్నిమతస్థుఁడు. ఈగోల్కొండనవాబు షియాయగుటచే నేనుముట్టడిసలుపుచుండ నాకు మీర్జుమ్లా రహస్యముగసందేశమంపి నవాబునువంచించి, కోటద్వారములు తెఱపించియుంచెను. లేనియెడల మనకీగోల్కొండ స్వాధీనమగుట చాలదుర్ఘటమయ్యెడిది.

దావుద్:— అట్లనాప్రభూ! మీరునాకొక యుత్తరమిప్పించినచో వారితో సన్నియు సవిస్తరముగ ముచ్చటించి, తమయాంతర్యమును వారికిఁబూర్తిగ నివేదించెదను.

ఆయుత్తరమునందు నా విషయముకూడఁ గొంచెము వ్రాయింపుఁడు.

ఔరం:—సేవకా! కాగితమును గలమునిటు తెమ్ము (అనిఔరంగ జీబుచెప్పినతోడనే సేవకుఁడు కాగితమును కలమునుదె చ్చి యౌరంగజీబుకిచ్చును ఔరంగజీబు రెండుత్తరము లను వ్రాసి) దావుద్ హాకీంసాహేబ్! ఒకటిమీాజ్జుమ్లాకు ను, రెండవది మాయక్కకును వ్రాసితిని. మీారు వెం టనే రెండుత్తరముల నివ్వఁగోరుచున్నాను. మీావిషయ మై యందుఁవిపులముగఁ బేర్కొంటిని. మీారు తప్పక ఖలీలుల్లాఖివిషయమై జ్ఞాపకముంచుకొనవలెను.

దావుద్:—(ఆయుత్తరములనందుకొని లేచి, ఔరంగజీబునకుస లాముచేసి) సెలవిండు. మనము మరల యల్లాదయవ లన ఢిల్లీయందె కలుసుకొందము. మీారెన్నియాటంక ములు వచ్చినను దండయాత్రను మాత్రము సడలింప వలదు.

ఔరం:—నేను తప్పక తగుసైన్యములతో వెంటనే బయలుదేఱు చున్నాను. మీారందఱు మీామీా ప్రయత్నములందుం డుదురుగాక. ఆశ్వికా! నీవుకూడ హాకీంసాహేబ్ వెంట జాగరూకతతోఁబొమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

తెరదింపవలెను.

## 5 వ రంగము.

దారాయంతఃపురము:—అర్ధరాత్రిమున.

(1) నదీరాబనూ (సోఫాపైఁగూర్చుండును) (2) ఉస్నిసా (2) నైనా చెలికత్తెలిరువురు క్రిందపఱచిన రత్నకంబళులపైఁ గూర్చుందురు.

నదీరా:—(నిట్టూర్పుతో) ఉస్నిసా! ఇంతవఱకు మీప్రభువు కొలువునుండి రాకుండుటచే నామానసముత్రియాడు చున్నది.

ఉస్నిసా:—అమ్మా! మీరట్లాందోళనపడుటతగదు. ప్రభువు త్వరలోనే రాగలరు. రాజ్యకార్యభారమునకుఁదోఁచు దండయాత్రసంరంభమువలన ప్రభువునకు మఱింత యొత్తిడి కలుగుచున్నది కాఁబోలు.

నదీరా:—నెచ్చెలీ! నాకదియేమియోగాని చిరకాలము జీవింపనని దోఁచుచున్నది. అక్రమమగు నీదండయాత్రవలన మాకెట్టియాపదలురానున్నవో, అక్కటా! బిడ్డ సులేమానింతవఱకు యుద్ధరంగమునుండి తిరిగిరాకుండుటచే నాహృదయము మఱింతయాతురపడుచున్నది. ఇట్టివిషమావస్థయందు దాతఁడున్నచోఁ దండ్రికిఁజేదోడుగ నుండెడివాఁడు.

ఉస్నిసా:—అమ్మా! మీరుసర్వము నెఱింగిన రాజమహిషులై యుండియు నిట్లమాయికులవలె నాకులపాటుఁజెందుచో

మిమ్మెవ్వరూఁ జయింపఁగలరు? రాజ్యపరిపాలనమునందు యుద్ధములు రక్తపాతములు జరుగకుండునా ?

నదీరా:—యుద్ధములకు నేనుభయపడుదుననుటకాదు. ఎన్నఁటి కైన మానవునకు మృతితప్పునా? ప్రభుత్వమునం దెంత భోగముల ననుభవింపవచ్చునో యంతసూక్ష్మముగ పతనమునొందుటకూడ నిశ్చయము. రాజ్యమునకు నుకి కంబమునకు సన్నిహితసంబంధముకాఁబోలు.

నైనా:—అమ్మా! మీ రేలవిషాదము నొందెదరు. దారా ప్రభువు చక్రవర్తియైననాఁడు మమ్ము మీరు మఱవకూడదు సుమా.

నదీరా:—(చిఱునగవుతో) నైనా! నాకంతభాగ్యముపట్టునా?

ఉన్నీసా:—అమ్మా! మీవంటియిల్లాలునకును, దారాప్రభువు వంటి సహృదయమూర్తికి నీహస్తినాపురసింహాసనమె లేనిచో నిఁక మొగలాయి సామ్రాజ్యములేదనియె భా వింపవచ్చును.

నదీరా:—ఏమొ, పోనిండు. మాకీమానుషభోగములపైఁ గాంక్ష యెలేదు. అయల్లాయెట్లు నియోగించెనో యట్లు జరు గును. నైనా! చితారుదీసికొని యొక్క-చక్క-నిపాట పాడుము. నీభక్తికీర్తనలవలనఁ గొంత చిత్తవిశ్రాంతి యైనఁ జేకుఱు.

నైనా:—(చితారుతీసి)

'నామ్, నా, జానోం గాంవ్ కా బిన్ జానే కిత్ జాంవ్ !
చల్తా, చల్తా, జుగ్ భయా పావ్ కోస్ పర్ గాంవ్ !

జా కారన్, జుగ్ ధుధుయా, సోతో ఘట్ హా మాహిం॥
పర్దాదియా భరమ్కాతా తె సుఖెనాహి')

(కబీర్)

నదీరా:—ఆహా ! ఉన్నిసా ! భక్తుఁడైనకబీరు, మానవునియజ్ఞానము నెంతఁజక్కఁగ వర్ణించెనో చూడుము. ప్రతిక్షణమును మనఛాయవలె మనలననుసరించి, మనలోనవెలుపలగూడ వ్యాపించియున్న యీయల్లాను మనము గుర్తింపకుండుట చాలశోచనీయము.

నైనా:—అమ్మా ! దానికిఁగారణము మానవుని యావరించియున్న యహంకారమనెడి యంధకారమె. మానవులందఱు నొక్కచీమలపుట్టలోని చీమలన్నియైన లేరు. ఈసృష్టియందలి పిపీలికములన్నియు దైవప్రేరితములై విజృంభించినచో నొక్కపూటలో మానవజాతియంతయు నశించును.

ఉన్నిసా:—(నవ్వుచు) అదెట్లునైనా! నీవుచెప్పునది చాలవిపరీతముగనున్నది! మానవులను చీమలుచంపుటయా ! నీవెప్పుడు నిట్టియద్భుత శుష్కవేదాంతములనె పలుకుచుందువు.

నైనా:—వెఱ్ఱిదానా ! ఈసృష్టిలోని ప్రతిచీమయు నొక్కొక్కకణముచొప్పున నేరాత్రియో మానవుని యాహారపదార్థములను వానికలుగులలోని కీడ్చుకొనిపోవుచో

మనగతియేమగునో యాలోచింపుము. మానవుఁడు రాజసతామసాహంకార విముగ్ధుఁడై యాయల్లాను ధిక్కరించి దుర్మార్గమునఁ బ్రవర్తించుచో. ఉస్నిసా! మనపై నీభూతసృష్టి దాడిఁజలుప కూడకుండుననుకొంటివా? నేనే ప్రకృతికంతకును ప్రభువునని మనుజుఁడు గర్వించి యీశ్వరుని విస్మరించిననాఁడు మఱికట్టి విపరీతావస్థ యేర్పడితీఱును.

ఉస్నిసా:—అమ్మా! ప్రభువువచ్చుచున్నట్లున్నది. క్రిందకాలిచప్పుడగుచున్నది. (అని మెల్లగాననును అంతట దారా, సిఫీరు, పండితరాయలు ప్రవేశింతురు. నదీరా నైనా, ఉస్నిసాలు లేతురు. నైనా, ఉస్నిసాలు వెనుకకుఁబోవ నదీరాముందుకువచ్చి, దారాహస్తమును బట్టుకొని)

నదీరా:—నాథా! ఇంతవఱకుఁ గొలువుకూటమునందె యుంటిరా! దండయాత్రమాట యేమయినది? సులేమాను జాడలు తెలిసినవా? పండితవర్యా క్షేమముగనుంటిరా!

పండి:—అమ్మా! ఇంతవఱకందఱు క్షేమముగనున్నాము. మీద యల్లాయను గ్రహమెట్లుండునో?

దారా:—(నదీరాచేయిపట్టుకొని) ప్రేయసీ! నీవుకూడ మాతో నీదండయాత్రకు సంసిద్ధురాలవై రావలెను. పండితరాయలు కొంతపరివారముతో మిమ్ముసంరక్షించుచుండు

ను. నేనుమరల నీహస్తినాపురమునకు వత్తునో లేదో యని నామానసము శంకించుచున్నది నదీరా !

నదీరా:—నాథా! మీరట్లనుట యుచితమా? మీరు వీరాగ్రేసరులు కదా!

దారా:—నీవువీరమహిషివి. యుద్ధమునందు జయాపజయములు దైవాధీనములు. మనకింతటితో నీయంతఃపుర వైభవము లుతీఱినట్లు నాకెందువలననో గాఢముగ స్ఫురించుచున్నది. నీవునన్నెడబాసి యెన్నఁడును కన్నుమూసియె ఉండగవు. ఈకరిపురంబున నేనులేకున్నచో నీవుమారో మనారా దురాగతములకోర్చి యుండఁజాలని బేలవు. ఈ పండితపుంగవుఁడు మన క్షేమముకోరినవాఁడు. ఈవిప్రునికన్న మనకీమొగలాయి రాజ్యమునందు మిన్నయగు నాంతరంగికులు లేరు.

నదీరా:—మీ రేల యింతతొట్రుపాటు పడుచుంటిరి ?

దారా:—నదీరా! ఖాసింఖాన్ నాకుఁ జిరమిత్రుఁడైన నాతఁడు మహమ్మదీయ పక్షపాతియగుటచే నౌరంగజీబు, తేనె మాటలలోపడి యాతనితోఁ గలసెననుటకు నేనాశ్చర్య పడుటలేదు. కాని యశ్వంతునివంటి యాప్తమిత్రుఁడు నన్ను మోసగించినందులకు వగచుచున్నాను.

నదీరా:—ఏమీ! యశ్వంతుఁడు మిమ్ముఁ బ్రతారించెనా!

దారా:—ఔను. మనపైనెత్తివచ్చుచున్న యౌరంగజీబు మురాదులసేనల నెదుర్కొన, యశ్వంతఖాసింఖానులను తగు

సైన్యములతోఁ బంపితిమి. వారిరువురు నన్నుఁ గికురించిరి యశ్వంతుఁడోడి పాఱెననియు, ఖాసింఖాన్ ఔరంగజేబుతోఁ గలసెననియు నేఁడు వార్తలువచ్చినవి. మనశత్రువులు ముందుకువచ్చుచున్నారు. ఇఁక నీ దండయాత్రను నేనడపఁదలంచితిని. మాతండ్రిగారు నేఁటిసభయందు వారిసహజ ధైర్యసాహసములనువీడి యొకపిచ్చివానివలె బ్రవర్తించుటయుఁ బ్రధానమంత్రి మీర్జుమ్లాకూడ మనలనువంచించి యౌరంగజేబుపక్షమున మాటలాడుటయుఁ జూడ నామానసము చాలనుద్రేకపూరితమగుచున్నది.

నదీరా:—పోనిండు. నాథా! మనమింతవంచనా వ్యూహము నందుఁ బెనఁగులాడుటకన్న న్యాయమగు నంతఃకరణముతో రాజ్యమును బరిత్యజించి యేయడవులయందైనఁ గాలముఁ గడుపుట కాయల్లా యనుగ్రహింపఁడా?

దారా:—నీవుచాల నమాయకురాలవు నదీరా! మన మెచ్చటఁ దల దాఁచుకొన్నను మనల నౌరంగజేబు వెదకిపట్టుకొని జంపించును. మనకు రెండేమార్గములుకలవు. నేనీయుద్ధమునందు గెలిచితినా, యీవఱకేమొగలాయి చక్రవర్తియుఁ జేకొనఁజాలని దిగంతవిశ్రాంతకీర్తితో నీభరతఖండమును బాలింతును. లేకున్న, నీదేశమునందు నివసించుచున్న హిందూమహమ్మదీయ సంఘైక్యతసాధిం

చుట కీశిరమునర్పించితినను ప్రఖ్యాతిని వహింతును. ఇదియెనాపూనిక.

నదీరా:—(అట్లయిన నేనుగూడఁ మీతోనీయుద్ధమునందుఁ బా ల్గొన నుత్సాహము నొందుచున్నాను. మనమిరువుర మొక్కసారి మరణించినచో, మీయశమునందు నేను గూడ సమభాగిని కాఁగలను.

దారా:—(చిఱునగవుతో) స్త్రీలాపత్కాలమందు యుద్ధములం దుదూఁకవచ్చును. నదీరా! ప్రస్తుతము నాకున్నసైన్య ముతో నేనుగెలువగలననునాస నాకుఁగొలుపుచున్నది అట్టితఱి నీవు శ్రమగొను టేల?

నదీరా:—నాథా! యశ్వంతఖాసింఖానులు మిమ్ముమోసగింప నిఁక ఖలీలుల్లాజఫారులు చక్కఁజేయుదురా?

దారా:—ఛత్రసాల్, రామసింగు, రుస్తుంఖాన్ మున్నగు యో ధులందఱు తమప్రాణములను నాకొఱకర్పింప సమక ట్టిరి. సులేమానుకూడ తనస్వరక్షకసైన్యము తోడనైన నన్నిలోనఁగలసికొన్నచో నేనుదప్పక జయమునంద గలను. మహారాష్ట్రులుకూడ నాకు సహాయముచేయు టకై పండితరాయలు తగునన్నాహములఁ గావించుచు న్నాఁడు.

నదీరా:—ప్రాణవల్లభా! యెట్లైనను, నాకు మీతోనుండుటక న్న వేఱొండుసంతోష విషయమేమున్నది? విశేషించి యీపండితోత్తముఁడు నాకుఁబితృతుల్యుఁడు. మీరును

సులేమాను సిఫీరులును లేని యీకోట నాకుమాత్ర మేటికి ?

పండి:—(తనలో) ఆహా ! దారాప్రభున కిట్టివిపరీతమగు నాలో చన మేలకలుగవలెనో! తనపాలిటి భాగ్యదేవతయనం దగు నదీరాసాధ్వి నీయంతఃపురమునుండి తరలింపుచుం డుటఁజూడ నతని కేవియో నాపదలురానున్నవి కాఁ బోలు ! (ప్రకాశముగా) అమ్మా! నదీరాబీగం ! మీభ ర్తగారితోఁగూడ మీరున్నచో, నాప్రభువు విజయ లక్ష్మీసమేతుఁడై మీతోడను, సులేమానుసిఫీరులతో డను, మరలనీకరిపురినిఁ బ్రవేశింపఁగలరు.

నదీరా:—పండితోత్తమా! నేను నాభర్త యాజ్ఞను నెఱవేర్చుట కు సర్వసిద్ధముగనున్నాను. బిడ్డాసిఫీరూ! నీవుచిన్నవయ స్కుఁడవైన, నీయన్న లేకున్న నీవుజాగరూకతతో నీతం డ్రిగారిని సేవింపుము.

దారా:—నదీరా! త్వరలోనీవన్నియుఁ జక్కఁబెట్టుకొని సిద్ధముగ నుండుము. తెల్లవాఱకమునుపే మనము దండయాత్ర కుబయలు వెడలవలయును.'(అనిదారా, పండితరాయలు నిష్క్రమింతురు. సిఫీరు తల్లిపాదములవద్ద మోకరించి సలాముచేసి తండ్రివెంట వెడలును.)

నదీరా:—ఆహా ! లోకమునం దీరీతిని రాజ్యభోగములకై నొకరి నొకరు చంపుకొనుట చాలవిషాదము గొలుపుచున్నది.

ఉ. జాతికినొక్కఁ-డైన, మఱి-జన్మలు నొక్కఁ-టనైననేమి? యా
రీతిగ లోకమందుఁ బగ-రేఁగిన నార్పగజాలినట్టి యా
నీతిని మానవుండు గన-నేర్చినఁగాని, మతంబు శాంతియున్
బ్రీతియొసంగనొప్పునె? ప-విత్రతనొందునె జన్మలేమిటన్?॥

(తెరదింపవలెను.)

తృతీయాంకము సమాప్తము.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# దా రా ష కో

—❖—

## చతుర్థాంకము—1 వ రంగము.

### —: వి ష్కం భ ము :—

రామఘట్ వద్ద మహారాష్ట్రమునకుఁ బోవుదారిలో (1) మహాదేవుఁడు (2) మాధవుఁడు (మాధవుఁడు మహారాష్ట్రదేశమునుండివచ్చుచు తనకొఱకై పండితరాయునిచే పంపబడినమహాదేవుని దారియందు గలసికొనును)

మాధవుఁడు:—మహాదేవా! నీవిట్లువచ్చుచున్నావేల ? దారాప్రభుని దండయాత్రా సంరంభమెట్లున్నది?

మహాదేవుఁడు:—మాధవా! ఏమిచెప్పుదును. (అనిష్టవార్తతో) దారాప్రభువు నలువదివేల సైన్యముతో. ఖలీలుల్లా జఫార్, రుస్తుంఖాన్‌లతో హస్తినాపురినుండి బయలువెడలి రాజపుత్రవీరులగు ఛత్రసాల రామసింగురాథోరులు తన్నాగ్రావద్ద నిరువదివేలసేనతో కలుసుకొన్నవెంటనే చాలసమరోత్సాహముతో నౌరంగజేబు మురాదు సైన్యముల నెదుర్కొనుటకు సిద్ధముగనుండెను. ఔరంగజేబు మురాదులసేన లేబదివేలు.

మాధ:—దారాప్రభు వౌరంగజీబుతో తలపడెనా? లేక మహారాష్ట్రసైన్యములును సులేమానును తన్నుఁగలసికొనువఱకు మనగురువుగారు చెప్పినచొప్పున ధోల్పూరువద్దవిడిసియుండెనా ?

మహా దే:—ఖలీలుల్లా జఫారుఖానులెవ్వరి సహాయ మక్కఱలేకయె తామిరువు రౌరంగజీబు సేనలను నురుమాడుదుమని యాతనిఁద్వరపెట్టిరి. అమాయికుఁడగు దారావారిమాటలకు మోసపోయిసమూఘరువద్ద శత్రుసైన్యములతోఁ దలపడెను.

మాధ:—సులేమానుకొఱకు నీవుపోయితివే. యాతఁడైనవచ్చువఱకు ప్రభువువేచి యుండలేదా ?

మహా:—ఎక్కడసులేమాను! ఎక్కడిదారాప్రభువు! జయసింహుని మోసమునందుఁ దగుల్కొని సులేమాను షుజానుతఱిమికొనుచుఁ దూర్పుబంగాళ సరిహద్దువఱకుఁ బోయెను. అతనిజాడలు తెలిసికొనుట దుస్తరమగుటచే నేను రాజారామసింగు రాథోరునుకలిసికొని, మానాయనగారంపిన సందేశము నెఱింగించి దారాప్రభువునకు సహాయము చేయుటకై యాతఁడు తనసైన్యములతో బయలుదేఱ నాతనితోడనె నేనును దారాప్రభువునాగ్రావద్దఁ గలసికొని సులేమానువిషయమా ప్రభువునకెఱింగించితిని.

మాధ:—సమూహురునందింకను యుద్ధము జరుగుచున్నదా ?

మహాదే:—సోదరా! యింకేమియుద్ధము! దారాప్రభువును ఛత్రిసాలరామసింగులును, రుస్తుంఖాను నౌరంగజీబు సైన్యములతోఁ బోరుచు మహత్తరపరాక్రమముచూపి యౌరంగజీబు సైన్యములను చెల్లాచెదరుగఁ జేయుచున్న సమయమున ఖలీలుల్లాహాతకుఁడు, తనక్రిందనున్న పదిహేనువేల సైన్యముతో నౌరంగజీబు పక్షమునకుఁ దిరిగిపోయెను.

మాధ:—ఖలీలుల్లా దారాప్రభువుతోఁ గలసి పోరుచుండలేదా ?

మహాదే:—యుద్ధము ప్రారంభించువఱకు నౌరంగజీబును బట్టి యిచ్చెదనని యనేకప్రగల్భములుకొట్టి దారాయుద్ధమునకుఁ దిగువఱకుఁ బ్రోత్సహించి యిరుసైన్యములు తలపడి మహాసంరంభముననుండ, తనసేనతో ఖలీలుల్లా వెనుకనోదిగి దాఁగియుండెను.

మాధ:—ఔరా! ఎంతద్రోహము జరిగెను!

మహాదే:—ఆమోసముచే యుద్ధగతి తాఱుమాఱయ్యెను. పాఱిపోవుటకు సిద్ధముగనున్న యౌరంగజీబుసేనలు, క్రొత్తసైన్యము పదిహేనువేలు తమతోఁగలియగనె, యౌరంగజీబు తనసేనలను మఱలబురికొలుపుకొని తీవ్రముగఁబోరి యలసియున్న దారాఛత్రిసాల రామసింగుల సేనలపైఁబడెను.

మాధ:—అక్కటా! దారాసైన్యమునుండి యొక్కసారి పది హేనువేలదండువీడి యౌరంగజేబుతోఁగలసి యాతనికి సహాయముచేయ, నిఁకయుద్ధగతి తిరుగఁబడుటలో నాశ్చర్యమేమి? ఔరంగజేబు పరాక్రమమంతయు మోసమువలననెగాని, దారాశౌర్యమునకును ధైర్యసాహసములకౌరంగజేబెన్నఁడు నాతని బ్రత్యక్షముగ నెదుర్కొనఁజాలఁడని లోకమెఱుంగదా?

మహాదే:—అందుకొఱకె, మాతండ్రిగారు ఖలీలుల్లా జఫారులనెన్నఁడు నమ్మవద్దనియు బ్రస్తుతము యుద్ధమునందుఁ బ్రవేశింపక తగుసహాయము సులేమాను వద్దనుండియు మహారాష్ట్రులవద్దనుండియు వచ్చువఱకు వేచియుండమనియు ననేకమారులు బోధించిరి. కాని జఫారుఖలీలుల్లాల దంభములకు దారామోసపడెను.

మాధ:—తుదకు యుద్ధమెట్లయ్యెను?

మహాదే:—రుస్తుంఖాన్, ఛత్రిసాల్, రామసింగులు, తమతమ సైన్యములతోఁ దీవ్రముగఁబోరిరి. వారు ఖలీలుల్లామోసమును సరకుగొనక తమయధిక పరాక్రమమునుజూపిరి. కాని పాపము! ఛత్రసాలుఁడు హఠాత్తుగ యుద్ధమునందుఁబడెను. ఆతనికుమారుఁడుకూడ ధైర్యముతోఁబోరి వీరస్వర్గము చూఱగొనెను. రుస్తుమ్ఖాన్, రామసింగులుకూడ ఛత్రిసాల్ నాతనికుమారుల ననుసరించిరి.

యట్టకేలకు దారాసిఫీరులు తమ ప్రాణములను దక్కించుకొని ధోలుపూరువద్ద నదీరామొదలగు స్త్రీజనములను సంరక్షించుచున్న మాతండ్రిగారిని గలసికొనిరి.

మాధ:—మహాదేవా! విధిదప్పింపనేరితరము ! గురువుగారు భావికర్తవ్యము నేమని నిశ్చయించిరి ?

మహా:—దారాప్రభువు సిఫీరునదీరాలతో పారసీకమునకుంబోయి యాప్రభువు నాశ్రయించి మరలం గొత్తసేనలసముకూర్చుకొని ఢిల్లీపై దండెత్తం బూనిరి. నదీరాకాంతకుం జాలజబ్బుగనుండుటచే మాతండ్రిగారు వారితో హిందూదేశ సరిహద్దువఱకుం బోవసమకట్టిరి.

మాధ:—మీతల్లిగారెచ్చట నున్నారు ?

మహా:—దండయాత్రకు బయలుదేఱుటకుం బూర్వమె యామెను మాయాంధ్రదేశమునకుం బంపివైచిరి.

మాధ:—మనల నేమిచేయుమనిరి?

మహాదే:—నీవీవార్త కవీంద్రుల కెఱింగించి వారికద్వారకయుండెయుండునట్లుం దెల్పుము. ఇంక మహారాష్ట్రదేశమునకు బంపుటవలనం బ్రయోజనము లేదని వారితోం జెప్పి నీవు తిరిగి ఢిల్లీయందలి కవీంద్రులసౌధమున నాకొఱకై వేచియుండుము.

మాధ:—అకటా! యెట్టివిశాలహృదయుండగు దారాప్రభువున కెట్టిదుర్గతిపట్టెను !

మహా:—మాధవా! దారాపరాజయమాతని దుర్గతికన్న, హిందూ దేశదౌర్భాగ్యమనుట నిస్సంశయము.

(ఇరువురి నిష్క్రమింతురు.)

---

## 2వ రంగము

(సమూఘరుయుద్ధమునందు దారాయోడిపోయి, పారసీకమునకుఁబోవు ప్రయత్నములు దారిలో సింధురాష్ట్ర సరిహద్దునందున్న మాలికజీవన్‌ఖిల్లావద్ద అరణ్యప్రదేశమునందు)

1 దారాషకో:—(కూర్చుండి జబ్బుగనున్న నదీరాబనూశిరమును తనతొడలపైనిడుకొని యుండును)

2 నదీరాబనూ:—(దారాభార్య, ప్రాణావసానకాలమాసన్నమగుటచే మక్కాపైపునకు తనశిరమును దారాతొడలపైనుంచి బరుండును)

3 సిఫీర్‌షకో:—(దారా రెండవకుమారుడు తల్లిప్రక్కను కూర్చుండి మెల్లగ తనయుత్తరీయముతో నదీరాకు విసరుచుండును)

4 పండితరాయలు:—(దారాప్రక్కను నదీరాకెదురుగ నిలచి నదీరామోముపైపు చూచుచుండును.)

5 హైబత్‌ఖాన్:—(దారా సేవకుఁడు దారావెనుక నిలచియుండును.)

దారా:—ప్రేయసీ! యల్లాను ధ్యానింపుము. నీపాతివ్రత్యమహిమయు, నీనిష్కళంక జీవితము, నిన్నాతని సాన్నిధ్యముఁజేర్చును.

పండి:—అమ్మా! నదీరాబీగం! మిమ్ము ముప్పదేండ్లనుండి నా కన్న పుత్రికవలెఁ జూచుకొనుచుంటిని. మీకిట్టి దుర్దశ కలుగునని యెన్నఁడు నేననుకొనలేదు!

నదీరా:—(హీనస్వరముతో) పండితవర్యా! మేమెన్నఁటికిని మీఋణముఁ దీర్పఁజాలము. మీరుమాకుఁ జేసినసేవ నిరుపమానము. మీస్వామిభక్తి కాయల్లాయనుగ్రహించుఁగాత. నాథా! నాకింకఁ బ్రాణములు నిలువవు. సులేమానేమయి పోయెనోకదా! బిడ్డా! సిఫీరు! నీవుభద్రముగ నీతండ్రిని యీపండితోత్తమునిఁ గనిపెట్టుకొని యుండుము. మీయిరువురు సోదరులకొఱకైన మీతండ్రి పారసీకమునకుఁబోయి హస్తినాపుర సింహాసనప్రాప్తికై కడసారిప్రయత్నము చేతురుగాక.

దారా:—నదీరా! నీవుమాకొఱకై విచారింపకుము. నేనుజాల మందభాగ్యుఁడను. రాజ్యముపోయినను దృణప్రాయముగఁ జూచుచున్నాను. నీవియోగము నాకుదుస్సహము.—నాశరీరమును దహించుచున్నది. నీకొఱకైకదా నేను యుద్ధభూమినుండి వెనుకకు మరలితిని.

శా॥ అన్నిపోయినఁబోవనీ! జగతిలో—నన్నార్థినైకుందనీ! ।
నిన్నేరీతిని బాసియుందు, నదిరా!—నేనింక రాజ్యంబుకై!

యెనోన్నబన్నములొందనేల ? యకటా!-హిందూరసూ
రాజ్యముల్ !
మున్నేపోయెను నిన్నువీడగ, సుఖా-మోదంబులింకే
లాకో !!

నదీరా:- (మెల్లగ) నాథా! మృతియెన్నఁటికైన మానవునకుఁ దప్పునా ? మీ వేదాంతమంతయు నేమయినది ? నేను మీపాదములను బట్టితిని, మీమ్రోల నాప్రాణములను విడుచుచున్నాను. ...అల్లా...అల్లా...అల్లా...(అని నదీరాకనులుమూసి ప్రాణములు విడుచును.)

దారా:—హా ! ప్రేయసీ! నదీరా ! (యనిమూర్ఛబోవును.)

సిఫీరు:—(తల్లిపాదములపైఁబడి) తల్లీ! మమ్మువీడి నీ వల్లావద్ద కుఁబోతివా! అన్నా! సులేమానూ! నీవెక్కడ చిక్కులు పడుచుంటివోకదా ! మనమిరువురము గలసికొనినప్పు డమ్మయేమైనదని యడిగిన నేమనిచెప్పుదును ! అన్నా! మనమెన్నఁడైన మఱలఁగలసి కొందుమా!

దారా:—(మూర్ఛనుండి తేఱుకొని) అక్కటా ! నాహృదయ మొక్కపాషాణమా ! లేక నీజగమంతయు నయోమయమా !

పండి:—(కన్నీరు గోటితోఁజిమ్ముచు) దారాప్రభూ! ధైర్యమువహియింపుఁడు. మీవంటిధీరు లాపదవచ్చినప్పుడె హృదయమును బదిలపఱచుకొనవలెను.

దారా:—పండితవర్యా! నాకీజగమంతయు నంధకారబంధురముగనున్నది! ఎన్నఁడును నన్నెడబాయని నాయర్ధాంగి. నేఁడునన్నువీడిపోవ నేనిట్లునిశ్చలముగ నెట్లున్నాఁడనో తెలియుటలేదు! (అని కన్నీరుత్తరీయముతోఁ దుడిచికొనును.)

పండి:—(కన్నీరుత్తరీయముతో నద్దుకొనుచు) ఆహా! పావనచరితా! వీరమాతా! సదీరా! ఎంతసౌకుమార్యము! ఎంత గాంభీర్యము! ఎంతపతిభక్తి! కటకటా!

మ॥ ప్రథితాఖండల వైభవోజ్జ్వలితసా—మ్రాజ్యంబులో నమ్మనో!
రథభోగంబులసౌధభాగముల,నా—రామాంతరాళంబులం!
గథలంజెప్పుచు సంతసించునదిరా—కాంతామణి న్నేఁడిసీ!!
విధి యీకర్కశభూమి మృత్యుగతగా—వింపంగ నెట్లెంచెనో!!

ఆహా! దారాప్రభూ!

సీ॥ ఘనసారచందన—కస్తూరికాసుమ
రజమంచు నీపాద—రజమెతాల్చె!
కలననేత్రలుబట్టు—విమలాతపత్రంబు
లటుద్రోచి నీనీడ—యందె నిలచె!
తతహంసతూలికా—తల్పంబులివెయంచు
నెమ్మిమై నీకాల—నిదురఁజెందె!

వీణాదివాద్యము-ల్వీడిసీ వెనువెంట
నీ సృగాలరవంబు-లిచ్ఛగించె।

గీ॥ రసవదన్నంబువీడి నీ-వాస్వగినట్టి।
యూషరాన్నంబె తనకుఁబీ-యూషమనుచు।
తుదకుఁ బ్రాణముల్వీడె నీ-తొడలపైన।
ధన్యుఁడవుదార! నీకిట్టి-దారగల్గె॥

దారా:—పండితరాయా! మనవిషాదమునకుఁ బారమున్నదా! మనమీమాలిక జీవనునకు వర్తమానమంపితిమి. అతఁడువచ్చినవెంటనె సిఫీరును తల్లికళేబరమును దీసికొని లాహోరునందు సమాధినొందించుటకు మాలికజీవను సేవకులతోఁ బంపెదను. నేనిఁక నీవిశ్వాసపాత్రుఁడైన హాయబత్ఖానుతో పారసీకమునకుఁబోయి మానదీరా కడసారి నాకుపదేశించిన ప్రయత్నమును సాగించెదను. (నదీరాపైఁజేయివైచి) ఆహా! నదీరా! ఆసన్నమృత్యువు నుగూడ సరకుఁగొనక నన్ను త్సాహపఱచిన వీరవనితవు. అక్కటా! ప్రియసీ! హస్తినాపురరాజ్యము నెట్లయిన మరలస్వాధీనము చేసికొనుమనిజెప్పి ప్రాణములనువీడితివి! నీవులేనిహస్తినాపురము నాకొకశూన్యారణ్యము. నాకుమయూరసింహాసనము! కలలోనివార్త!

పండి:—ప్రభూ! మీరట్లనవలదు. మీకుమారులకొఱకైన సింహాసనమునకై ప్రయత్నింపవలదా? సులేమానువీరుఁడు

రణపండితుఁడు. అతఁడైన మనహృదయాపద్మముచే కూర్పఁగలధీరుఁడు. అట్టియవకాశ మాతనికి మన మొసంగవలెను.

దారా:—పండితరాయా! నన్నుఁ బెన్నసాఁటినుండియు మా తండ్రి కష్టములెన్నియు నాదృక్పథమునఁబడకుండ నతిగారాబముతోఁ బెంచి, యనన్యసామాన్యభోగములందు ముంచి లేవనెత్తుటచే కాఁబోలు, మానవుఁడనుభవింపనతీతములగు నాపదలన్నియు ముప్పిరిగొని యొక్కసారిగ నాపైఁబడుచున్నవి! నేనుమరల నులేనూనునుజూతునా! అకటా! యాతఁడెంత పరాక్రమశాలియొ యంతయమూయకుఁడు. కానిమ్ము. ఎంతవఱకీ యుపద్రవతరంగపరంపరలు నాహృదయపర్వతముపై పొంగిపొరలునో చూచెదనుగాక! అదిగో! సేవకుఁడు ఫీరోజువచ్చుచున్నాఁడు. ఆతనివెనుక మాలికజీవను కాఁబోలు.

(సేవకుఁడుఫిరోజు మాలికజీవనుతో ప్రవేశించును.)

మాలికజీవన్:—దారాప్రభూ! సలాము పండితరాయా! సలాము మీరాపదలలోఁ బడియుంటిరని మీసేవకుఁడీ ఫిరోజు చెప్పెను. అక్కటా! మీవంటిమహాపురుషులకెట్టి యిక్కట్టులు చుట్టుకొనెను! (క్రిందకుఁజూచి) ఇదియేమి! నదీరా రమణి మృతిజెందెనా! అల్లా! అల్లా! ఎంతవిషాదము! ఆమెకుఁ జాలజబ్బుగనున్నదని మాత్రమె ఫిరోజు చెప్పెను.

దారా:—మాలికజీవనా ! నీవుమాకొఱకై విచారింపకుము. మా కోర్కె యుకాపరమె నీవలనఁగావలయును.

మాలిక:—దారాప్రభూ! యీఖిల్లాయంతయు మీపాదము లందుంచితిని. ఇట్టివిపరీతావస్థయందున్న మీరునన్నుప కారము సేయవలెనని కోరవలెనా ?

దారా:—మిత్రమా! నదీరాకాంత కళేబరమును లాహోరు నందు సమాధిసేయింప సమకట్టితిని. మాసిఫీరువెంట దృఢమైన పదిసేవకులనొక జనాజాతో మీరుపంపినఁ జాలును.

మాలిక:—ప్రభూ! నేనిప్పుడె యాప్రయత్నమును జేసెదను. (అని మాలికజీవను నిర్గమించును).

దారా:—(కన్నీరు గోటితో జిమ్ముచు) బిడ్డా! సిఫీరూ! నీవుపుత్రుఁడవు. నీయన్నగతియేమయ్యెనో తెలియుటలేదు. నీతల్లి శరీరమును లాహోరుగొనిపోయి యచ్చటఁ బరమపవిత్రమైన మియాఁమీర్ సమాధిప్రక్కను సమాధిచేయిం చుము.

సిఫీరు:—నాయనా! మాతల్లిలేకున్న మీరుడకూ మాకుకఱవ య్యెదరా! (అనికన్నీరు తుడిచికొనుచు తండ్రిని కౌఁగ లించుకొని) నేనుగూడ మీవెంటవచ్చెదను.

దారా:—కుమారా! నీతల్లిలేదుకదా. నేనుండియుమాతృమేమి లాభము? దైవానుగ్రహమున్నచో మనము మరల

నెన్నఁటికైన కలసికొందుము. లేనియెడల నేనుగూడ మీతల్లివలెనె గతించితిననుకొనుము. నీవువీరుఁడవు. జాగరూకతతో నీవులాహోరునకుఁబోయినచో నీయన్న నుగూడ నచ్చటికి వచ్చుటకై సందేశమంపితిని. నీవిఁక నిగూఢముగ నీయన్నజాడలు తెలిసికొని మీరిరువుర హస్తినాపురియందు నాయమాత్యులఁ బండితరాయుని యాదేశానుసారముగ వర్తింపుఁడు. నేనుసైన్యసమేత ముగఁ ద్వరలోపారసీకమునుండివచ్చిన యనంతరము నన్ను మీరుకలసికొనవచ్చును.

(ఇంతలో మాలికజీవను, పదిసేవకులతోను, జనాజా తోడను బ్రవేశించును.)

మాలిక:—దారాప్రభూ! ఇదిగో జనాజా. ఈసేవకులుమిగుల విశ్వాసపాత్రులు. సిఫీరు ప్రభువేమి చెప్పినట్లుఁ జేయుదురు.

(అంత దారా సిఫీరులు నదీరాశతీరమును జనాజాలో నుంచుదురు. దారా తనయుత్తరీయముతో దానిఁగప్పును).

దారా:—అక్కటా! నదీరా! ఎంతలో నింతయయ్యెను!

సీ॥ కరిపురంబుననాఁడు ♦ కాలూదినదిగాఁగ,
నానాఁటఁగూర్చిన ♦ నవ్యసుఖము!
గాఢంపుఁబ్రేమతో ♦ కౌఁగలింతలఁగ్రుచ్చి
పాటించి నెఱపినఁ ♦ బ్రణయసుఖము!

చిన్నికుమారులఁ ♦ జెన్నుమీఱఁగఁజూపి,
చిఱునగుమోముతోఁ ♦ జెలఁగుసుఖము !
మొగలసామ్రాజ్యంపు ♦ మోహనవైభవం,
బనుభవించిననాఁటి ♦ యలఘుసుఖము !
గీ॥ అన్నిసుఖములవీడి నీ ♦ వకట! నేఁడు!!
వికటమగునట్టి యీదారు ♦ పేటియందు!
హంసతూలికతల్పంబు ♦ నందువోలె !
పరమసుఖమందఁబోయెదే! ♦ పతినివిడిచి ! ॥
శా॥ నాథా ! నాహృదయంబెమీఱని సదా ♦ నన్నెంత
యో ప్రీతితోఁ!
జోధ్జ్లేసెడి,నీదువాక్కులకునే ♦ పొంగారితింగాని యా!
గాథల్జూడగ నేఁడు కల్లలుకదా ! ♦ కాదేని నేనిట్లునే !
బాధంజెందకయుండ, నీవెటు? సఖీ! ♦ ప్రాణంబులం
బాసితో! ॥
మాలిక:— సేవకులారా! జనాజానె త్తికొనుఁడు. దారాప్రభూ!
మీరిఁక విచారింపవలదు. మీబోటిధీరు లాపదవచ్చి
నప్పుడోర్పు వహింపవలెను.
సిఫీరు:— తండ్రీ! మీపాదముల కనేకసలాములు. మీరుత్వర
లోఁ బారసీకమునుండి దండయాత్రోన్ముఖులై వచ్చె
దరుగాక. నాకుసెలవొసంగుఁడు.
దారా:— ఆహా! బిడ్డా ! పదునెనిమిదివత్సరముల బాలకుఁడవైన
నినెట్టిక్కట్టులపాలు సేయవలసివచ్చెను? హా! విధీ!

అతిసుకుమారముగఁ బెంచిన యీకూనను విడిచిపుచ్చు టకు కాలుసేతులాడుటలేదు. (అని సిఫీరును కౌఁగలించుకొని కన్నీరుతుడిచికొనుచు) సిఫీరూ! భద్రముగఁ బోయిరమ్ము. ఫిరోజూ! నీవునాబిడ్డనెన్నఁడును విడువకుము. (సేవకులు జనాజా నెత్తికొని ముందునడచుచుండ సిఫీరు తండ్రిపాదములకు సలాముచేసి బయలు దేఱును).

పండిత:—(సిఫీరునోదార్చుచు కొంతదూరముపోయి, సిఫీరు ఫిరోజులనాపి మెల్లగా) సిఫీరూ! నీవును ఫిరోజును లాహోరులో నదీరాకాంత సమాధియైన యనంతరము మీ వేషములను మార్చుకొనుఁడు. నిగూఢముగ సుశ్రీమాను జాడలు తెలిసికొని మధురాపురియందలి కృష్ణాలయము ప్రక్కనున్న మఠమునందు నన్నుఁగలసికొనుఁడు. "అల్లా! హూ! అగ్బర్!" అని కేక వేసినచో నేనానవాలుపట్టుదును.

సిఫీరు:—పండితరాయా! మీరుచెప్పినచొప్పునఁ దప్పక చేయుదుము. మేము లాహోరునకుఁ బోయినతరువాత నిఁక ఫకీరువేషములతో సంచరింతుము. (అనిచెప్పి సిఫీరు పండితరాయలను కౌఁగలించుకొని ఫిరోజుతో వెడలి పోవును).

మాలిక:—దారాప్రభూ! మీరుచాలనలసియున్నారు. పలుకష్టముల నందితిరి. ఈసేవకుఁడిచ్చు యల్పాతిథ్యము నంగీ

కరింప వేడుచున్నాను. ఈనాఁటికివిశ్రమించి రేపుతెల్ల వాఱకమునుపె పోవచ్చును.

**దారా:**—మిత్రమా! యిట్టివిచారసాగరమున నీదులాడెడిమాకు విశ్రాంతియా! ఆహా! మహమ్మదీయసర్దారులారా! ఎంతద్రోహముఁజేసితిరి! ఔరా! ఖలీలుల్లా! శత్రుసంహారముగావించి విజయముచేపట్టుతరుణమున నౌరంగజీబు పక్షమునకుఁదిరిగి నాపయియుద్ధమునకు డీకొంటివి! కటా! మిత్రమా! ఛత్రసాల్ నృపతీ! ఓహో! రామసింగూ! ఔరా! రుస్తుంఖాన్! మీదేశభక్తి స్వామిభక్తులకు మీశరీరముల నర్పించి వీరస్వర్గమును జూఱగొంటిరి! మీతోరాజాలకిట్లిడుమలఁ బడుచుంటిని!

**మాలిక:**—ప్రభూ! విచారింపకుఁడు. మీరుమరల రాజ్యమును సంపాదించుటకా యల్లాయనుగ్రహించును.

**దారా:**—(వికటముగనవ్వుచు) మిత్రమా! నాకురాజ్యమా! నాజీవితేశ్వరితోడనె పోయినది. మహత్తరభోగములనను భవించిననాకు రాజ్యభ్రష్టతకుఁదోడు కులసతీవియోగమా! పుత్రులనెడబాసి ఘోరదుర్దశాసింధువునందుఁగూలుటా! దుర్భరము! దుర్భరము!

**పండిత:**—ప్రభూ! ఇప్పుడేకదా పసిబిడ్డయగు సిఫీరునోదార్చిపంపితిరి! మరలమీరిట్లు విలపింప నోదార్చువారెవ్వరు? రాజ్యరమధీరులను వరించునుగాని భీరువులనెన్నఁడును

జేపట్టదు. మీపత్నీరత్నముప దేశించిన కడనాటి ప్రియ త్నమును మీరుమఱచి యిట్లువాపోవుటుచితమా? మీయపారవిజ్ఞానసంపదచే మీమక్షిలిని బోనాడి స్థై ర్యమునవలంబింపుఁడు. శరీరములు క్షణభంగురములు. మానమాచంద్రతారకము మానమును రక్షించుకొను వాఁడె మానవుఁడు.

శా॥ తల్లీబిడ్డలలోనలీనమగు వా ♦ త్సల్యంబు, దాంపత్యమ
న్వల్లీబంధములం బెనంగెడి యపూ ♦ ర్వస్నేహము
లూడ వి
ద్యుల్లీలాగతిగావె? యీజగతిలో ♦ దుర్వారసం
సార మ!
మ్కల్లోలాంబుధిమగ్న జీవులకు సౌ ♦ ఖ్యంబేది?
వీక్షింపగ॥

దారా:—పండితరాయా! క్షమింపుము. నేనెంతయడంచుకొ న్నను ముప్పదిసంవత్సరయులు నానీడవలె నన్ననుసరిం చిన నాప్రియపత్నీవియోగసంజనిత దుస్సహ వేదనాదో ధూయమానమానసుఁడనై యట్లంటిని.

మాలిక:—దారాప్రభూ! మీపత్నీతిలకము చాలబుణ్యాత్మ రాలు. మీరనేకుల మానప్రాణదానము లొనర్చిన దయానిధులు. కష్టములు కాపురముసేయునా? దయ చేసి నాగృహమునఁగొంచెము విశ్రమించిపొండు! (అని

దారాచేయిపట్టుకొని మెల్లనముందునడువ పండితరాయలును హైబతును వెనుకనడతురు).

(తెరదింపవలెను.)

---

౩వ రంగము.

హిందూదేశమునకును బెలూచిస్థానమునకును నడుమ నున్న బొలానుకనుమవద్ద సూర్యోదయమునకుఁ బూర్వము.

(1) దారాషకో (2) పండితరాయలు (౩) హైబత్ ఖాన్ (సేవకుఁడు).

దారా:—(పండితరాయునిచేయిపట్టుకొని) గురువరా! మాతండ్రిగారు నాఁడుమిమ్ము నాకుగురువుగ నభిషేకించినది మొదలు నేఁటివఱకును నాయందపారప్రేమచూపినన్ను కడుజాగరూకతతో ననుసరించిన మీఋణముఁదీర్చుట దుర్లభము మీసర్వస్వమునువీడి నాకొఱకై పలుకష్టములనొందితిరి. మీరెన్నిచెప్పినను మాతండ్రియు నేనును, జయసింహాఖాసింఖానులను, ఖలీలుల్లాజఫారుఖానులను నమ్మి తుదకిట్టి విపత్సముద్రమునంబడితిమి.

పండిత:—ప్రభూ! మీరట్లనవలదు. విధివశమునకై మనము వగవఁబనిలేదు. ఎవ్వరిని నమ్మకుండ రాజ్యముచేయుటెట్లు? ప్రభువులను వంచించుట యనుజీవులకు నరకప్రాప్తి హేతువు. చక్రవర్తియు మీరును ననేకవిధ

ముల గౌరవించిరి. ఈశక్తిరముమీాయది. ఇమ్మహాశక్తి యించి ముప్పదిసంవత్సరములు హిందూమహమ్మదీయ వైరములు సమయింపఁజేసి, మీారాజ్యమునందఖండ వైభవముతో నెగడితిని. మన రెండుసంఘములకుఁగూడ జన్మభూమియగు నీభరతఖండము, హిందూమహమ్మదీయ విజ్ఞానసమ్మేళనముచే నూతనప్రబోధముకలిగి లోకమునకు దారిఁజూపఁజేయుటకుమీారవతరించితిరను నాసతోనుంటిని. మీావంటియుదారకీర్తివంతు లీభరత ఖండమును బాలించుభాగ్యము పట్టవలదా ?

దారా:—పండితరాయా! మీావంటివిశాలహృదయులగు మంత్రివరులు మాామహమ్మదీయ మంత్రివర్గమునందుఁగూడ నున్నచో మనకృషిధన్యతనొందియుండును. అగ్బరు కబులుఫజులును, జహాంగీరునకసఫ్ఖానును దొరకుటచే వారిరాజ్యవైభవము నానాఁటి వభివృద్ధిగాంచెను.

పండి:—అబుల్ ఫజుల్ఁ అసఫ్ఖానులు విశాలహృదయు లను టకు సందియములేదు. కాని వారు మీావలెవిజ్ఞాననిధు లా? ప్రభూ! కేవలవిద్యగాని, యొక్కవిశాలహృదయముగాని ప్రభువునకున్న నదియొక్కొక్కటియె తేజరిల్లఁజాలదు. మణిచేస్వర్ణమునుఁస్వర్ణముచేమణియు బరస్పరసహవాసమున మహత్తరశృంగారమునీనును. మీా చేయూతవలననె మీాతండ్రిగారు మొగలాయిరాజ్య

మును పాలించుటచే, మీయుదారకరస్పర్శవేధిచే పాదుషాహా చక్రవర్తిరాజ్యము మొగలాయిపరిపాలనమునందొక స్వర్ణయుగముగఁ బరిణమించెను. మీరు మరలమయూరసింహాసనము నాక్రమించిననాఁడుకదా దేశసౌభాగ్యము సర్వతోముఖమగుట.

దారా:—పండితరాయా! మీరింక వెనుకకు మరలుఁడు. మనలనౌరంగజేబు వెన్నంటితఱుముచున్నాఁడు. మీరైనఁదప్పించుకొన్నచో నాకుమారులకు దారిఁజూపఁగలరు. నేను బ్రతికియున్నకొలఁది ముప్పులుదప్పవని నాహృదయము చెప్పుచున్నది.

పండి:—ప్రభూ! మీరు లేనియీలోకము నాకుమాత్రమేల? మీరు ప్రతిక్షణమునిట్లు నిర్వేదమునొందినచో నేకార్యమును సాధింపఁజాలరు.

దారా:—లేదు. లేదు. పండితరాయా! నేనుదప్పక పారసీకమునకుఁబోయి సర్వప్రయత్నములు చేయుదును. నేనువచ్చువఱకును మీరును నాబిడ్డలును హస్తినాపురియందును, మహారాష్ట్రమునందును గోల్కొండయందును తగుప్రయత్నములుచేసి సిద్ధముగనుండుడు. సెలవిండు.

పండి:—(దారాప్రభువును కౌఁగిలించుకొని కన్నీరుగోటితోఁజిమ్ముచు) ప్రభూ! ఇంతకాలమునకు మిమ్మిట్టికష్టములలో వీడవలసివచ్చెను!

మ॥ మునిఖండంబునజన్మమందితనకున్-మోక్షంబె దేశంబటం
చును ఢిల్లీశ్వరుఁజేరెఁ మంత్రిపదము-స్తోకంబుగాఁజెప్పియా
వనకాలంబున సర్వభోగముల సం-భావింపనిల్లాల్పి యా
వనభూమిన్నినుడించిపోవనకటా!-ప్రాణంబులెట్లోపెఁ దన్

ప్రభూ! నేనుగూడ మీవెంటవచ్చెదను.

దారా:—పండితరాయా! మీరుకూడ నీదేశమునువిడిచినచో నాబిడ్డలకు హితవుగఁజెప్పువారెవ్వరు? సులేమానేమయ్యెనో తెలియుటలేదు. సిఫీరు పసిబిడ్డ. మీరున్నచో నా కుమారులను మరలనెన్నటికైన హస్తినాపురసింహాసనమునఁ గూర్చుండఁజేయగలరు.

ఉ॥ పండితసార్వభౌమ నిను-భారతదేశము కోలుపోయెనన్।
వెండియు నీకునీడగు సు-విప్రుఁడు చూడఁగరాఁడు,జన్మభూ।
మండలమైన నీవసుధ-మాకునుమీకుఁ బరిత్యజింపరా।
కుండఁగ సంఘటిల్లె విధి-యోగముచేనిటు భూసురాగ్రణీ!॥

మీరింక వెనుకకుమరలి మమ్మాశీర్వదించిపంపుఁడు.

పండి:—కానిమ్ము ప్రభూ! పారసీకమున మీయత్నములు సఫలతనందినతోడనె నేనుమీకు రాత్రిజెప్పినతీరున హైబతును ముందుగానంపుఁడు. కాలాతీతమగుచున్నది. ప్రభూ! పోయిరమ్ము.

ఉ॥ పాండవ కౌరవ ప్రహిత—భారతఘోరరణంబునందు నా।
ఖండలసూతిబుద్ధికి వి—కారముమాన్పి రణాపనిక మహా।
గాండివముక్త చండవిశి—ఖావళి శాత్రవగాత్రమర్మముల్।
చెండగఁ జేసిబోధించిన—సింహుఁడు మీకుఁబ్రసన్నుఁడయ్యె డున్॥

ప్రభూ ! యీవైడూర్యరత్నములను గైకొనుఁడు (అని తన యంగరకా జేబునుండి వైడూర్యరత్నములఁదీసి దారాచేతి యందుంచి) ఇవి షాజహాన్ చక్రవర్తి మయూరసింహా సనము నధిష్ఠించిననాఁడు నాకొసంగిన బహుమానము లు. ఈయమూల్యమణులు పారసీకప్రభునిహృదయము నాకర్షింపఁగలవు. నాకిఁక సెలవొసంగుఁడు. (అని దారాకు సలాముచేసి తిరిగితిరిగి చూచుచు వెడలిపోవును.)

దారా:—హైబతూ! మనమీ బొలానుకనుమను త్వరలోదాఁ టిపోవలెను. పాపము నీవుచాలడస్సియుంటివి కాఁబోలు (ఇరువురు కొంతదూరముపోవుసరికి వెనుకనుండి)అగుము! ఆగుము ! దారాప్రభూ ! లేనిచో నీ తుపాకులతో మిమ్ముఁ గాల్చివైతుము (అని కేకలు వినఁబడును. దారాహైబతులు వెనుకకుమరలి చూచుదురు.)

దారా:—హైబతూ! నన్నుఁబట్టుకొనుటకు జైసింహుఁడు కాఁ బోలు, సేవకులతో వచ్చుచున్నాఁడు! తక్షణమె నీవీ

యుంగరమును నీవైమెరత్నములనుదీసికొని యీగుహా ముఖమునఁ దప్పించుకొనిపొమ్ము. మధురాపట్టణ దేవాలయము ప్రక్కనున్న మఠమునందుఁ బండితరా యలుండును. నీవు "అల్లాహో! అక్బర్" అని కేకవేసి నచో నిస్సానవాలుపట్టును. అదిగో వారుపరువులిడుచు వచ్చుచున్నారు. నీవుపొమ్ము. నాకై వగవకుము. నేని ట్లుంటినని పండితరాయుని కెఱింగింపుము.

హైబత్:—(హైబతు రత్నముల నుంగరమునుదీసికొని యొక గుహాయందుఁ బ్రవేశించి దాగియుండును.)

మాలిక:—(మాలికజీవన్ రహీంఖుస్రూలతోఁ బ్రవేశించి)ఖుస్రూ ఖాన్! దారాప్రభువిడుగో. జైసింహుని యాజ్ఞప్రకార ము మీకప్పగించితిని. (అనిదారాను మాలికజీవన్ సమీపించును.)

దారా:—మాలికజీవనా! ఏలయింతత్రొక్కుపాటుతో మరలనా కైవచ్చితివి ? నీయింటనుండియెకదా నేను వచ్చితిని. నన్నుఁబట్టుకొనుట కింతప్రయాసమేల నీవుపడితివి ?

మాలి:—నిన్నుఁబట్టుకొని బంధించి ఢిల్లీకిఁదీసికొనిరమ్మని యౌ రంగజీబుచక్రవర్తి ఫర్మానా వ్రాసిపంపెను. నీవుదౌర్జ న్యముఁజేసినచో తుపాకితోఁ గాల్చివేయుదుము.

దారా:—(వికటముగ నవ్వుచు) నేను దౌర్జన్యము సేయుటయా! నిజమగు వీరుఁడెన్నఁడును దౌర్జన్యముఁ జేయఁడే! పిరికి పందలకె మరణమనిన భయము. హంతకులు మాత్రమె కత్తియనిన గడగడవణంకుదురు. మీతుపాకులు నన్నే మియుఁ జేయఁజాలవు. మాలికజీవనా! నాకృపాణము జూచి నీవు భయమందుచుంటివి కాఁబోలు. ఇదిగో నా ఖడ్గము. (అని తననడుమున వ్రేలుచున్న పటకాతో నున్నకత్తినివిప్పి మాలికజీవను కందిచ్చును)

ఉ॥ పోయెను భోగముల్ సిరియుఁ ♦ బోయెను రాజ్యమునాఁడె పోయెనా।
ప్రేయసి దేహమున్విడిచెఁ ♦ బ్రీతిఁదలిర్చెడి పుత్రమిత్రులుం।
బాయనెపాసిపోయిరిఁక ♦ మాలికజీవన! లేరుబాంధవుల్।
గోయుమునీవుకంఠమిదె ♦ గొబ్బునఖడ్గమునంది మిత్రమా!॥

శా॥ మిత్రద్రోహముఁ జేసితీవనుచు నీ ♦ మీఁదేమిగోపింతునో?।
మిత్రుల్జూడగ నెవ్వరీవసుధలో ♦ మేనుండునందాక నా।
పుత్రుల్భృత్యులు మిత్రులంచు మనుజు ♦ లోభగింతురే కానియే।
మాత్రంబైనను నాపదల్ వొడమ స ♦ న్మానింతురే బాంధవుల్?॥

మాలిక:—(దారాయిచ్చెడి కత్తిని మెల్లగనందుకొని) ఖుస్రూ ఖాన్! రహీంఖాన్! ఇఁక మీరు దారాను నిర్భయముగ బంధింపవచ్చును. నేనుదారాను బ్రతికియుండగనె పట్టి మీకప్పగించితిని. చక్రవర్తిచే తగుబహుమానము లభింపఁగలదు. (దారావైపుతిరిగి) పిచ్చివాఁడా! నీవు నీకత్తితో పొడుచుకొనక నన్నునీకంఠము గోయమను టేల? (అనివికటముగ నవ్వును).

దారా:—ఓయీ! మాలికజీవనా! నేనాత్మహత్యనేల జేసికొన వలెను? నేనెవ్వరికిని ద్రోహముఁజేయలేదే! పాపాత్ములుమాత్రమె వారుచేసినఁపాపభారమును వహింపఁజాలక నాత్మహత్యలఁజేసికొందురు. భటులారా! నాకీ శరీరముపై నభిమాన మీవఱకె నశించినది, మీయిచ్ఛ వచ్చినట్లు బంధింపుఁడు.

(అంతఖుస్రూ. రహీములు దారా నినుపసంకెలతో బంధించి తీసికొనిపోవుచుందురు. దారావెనుక మాలికజీవను నడచును).

దారా:—(మాలికజీవనువైపు తిరిగి)

శా॥ ఏమీ! మాలికజీవనా; ఇటులనీ ♦ కింకేలకానుణ్యములో!
నామీఁదీభువిలోన మానవులకు ♦ న్నాఁడేగెనే స్నేహముల్ ।

నామానంబికఁ బోవకుండ యభిమా ♦ నంబుంచియీ ఖడ్గధా।
రామాత్రంబున ద్రుంపుమీశిరము నీ ♦ హస్తంబునన్ సోదరా!॥

అహా! నాకులసతి నన్నిచ్చోటనేకదా వీడెను. నన్నా మెతోఁగూర్చి పున్నెముగట్టుకొనుము. హా! నదీరా; నిన్నె న్నఁడు జూచితినోకదా!

మ॥ కలలోనన్ పరుసాభిలాషముగఁ క్రీ ♦ గంటన్ విలో కింపలే।
దలనారీమణి యానదీరయనునీ ♦ యచ్చంపుసత్కీర్తినేఁ।
డిలలోనేమగు ? నిర్గుణున్ పరుని నీ ♦ విట్లొంద! హా! ప్రేయసీ!।
బలహీనుండగునంతనే విడుతురే! ♦ భార్యల్ కటా! నాధులన్?॥

అక్కటా! భటులారా! మీకైననామీద యభిమానము లేదా! చిరకాలమునుండియు మాసొమ్ముదింటిరే!

ఉ॥ మీర లనేకమానవుల ♦ మేలిశిరంబులఁ దీసినారు నా।
కేదును లేదు బాంధవులు ♦ యేలగలేవిఁక పూజ్యరాజ్య ముల్।

జూడఁగఁ గొంటి భోగములఁ ♦ జూచితిఁ బారము శాస్త్ర
మందునేఁ !
జేరెద ముక్తి కాంత నిఁకె ♦ శిక్ష ముదంచిన పుణ్యమందుఁడీ!!

ఖుస్రూ, రహీములు:—(బిగ్గఱగా) నమ్మము! నమ్మము! నీవు రాజ్యముచేయునప్పుడు మరణదండనలు లేకుండఁ జేయింతువుగాని లే! నీ వేదాంతములు మాయౌరంగజేబు వద్ద పనికిరావు. మాచక్రవర్తి కాఫరులతలలు తప్పక తీయించును. పద! పద! (అని దారాను గెంటుకొనుచు సంకెలఁతో తీసుకొనిపోవుదురు.)

హైబత్:—(గుహానుండి వెలుపలకువచ్చి) ఔరా! మాలికజీ వక్ హాతకుఁడెంత ద్రోహముచేసెను! నేనిఁక నెట్లులైన వీనిఖిల్లానుండిదాటి, పండితరాయలను గలసికొని యీ వృత్తాంతమాతని కెఱింగింపవలెను. అక్కటా! దారా ప్రభువెట్టిమోసమునఁ దగుల్కొనెను!

(అని నిష్క్రమించును.)

తెరదింపవలెను.

చతుర్థాంకము సమాప్తము.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# దా రా ష కో

పంచమాంకము 1 వ రంగము.

మథురాపట్టణము శ్రీకృష్ణాలయము గంటలు మ్రోగుచుండును. సూర్యోదయమగుచుండ భక్తులు వచ్చుచుఁ బోవుచుందురు.

పండితరాయలు (సన్యాసి వేషముతో శ్రీకృష్ణునిఁబూజించి లేచి)

దండకము:—శ్రీకృష్ణ! లోకేశ! లోకోద్భవస్థాన! బ్రహ్మాండభాండోదరా! కంస చాణూర, చేదీశ బాణాది దైత్యేశవిధ్వంసకా! సాంద్రసంసార జీమూతసంక్షోభితాత్మీయభక్తైకరక్షామణీ!దుష్టశిక్షాకరణీ! వేదవేదాంగవిద్యాదిసంపూజ్యమై,లోకదీపంబునానొప్పు,నీయార్యవర్తావనింజేరి,పాపాత్ములైనట్టి,పాషండసంఘుంబు,గోహత్యలంజేసి స్త్రీబాలవృద్ధాదులంజంపుచున్,సంఘవిద్వేషముల్పెంచుచున్, తామసాహంకృతిం, బెల్లుసంచారముల్సల్ప, దేశంబు దోషాచరాక్రాంతమై యుండఁగాఁజూచి నీవిట్లుపేరింపధర్మంబె? యేనాఁడు నీకర్మభూమిస్థలి నిష్కర్మలంబైన ధర్మంబడగన్, యధర్మంబు రేకెత్తునో, యా

ముహూర్తంబున న్నీవుసాక్షాత్కరింపంగ వాగ్దానముం జేయఁగా లేదె ? ఓ దేవ! యీపుణ్యాదేశంబున న్నీదు పాదంబు, మోదంబుతోనుంచి, సేమాటఁ బాటించు నీభక్తులందేర్పుమీ వేగ, లోకైక కల్యాణ వర్తీ! కృపార్ద్రైకమూర్తీ! నమస్తే! నమస్తే నమః. (అని ప్రార్థించి యీవలకువచ్చుచుండ దేవాలయము వెలుపల ఫకీరు వేషముతో నున్నమహాదేవుడు "అల్లహో అక్బర్ !" అని కేక వేయుచు బండితరాయలను గలసి కొనును)

పండి:—మహాదేవా! ఢిల్లీవార్తలేమి?

మహా:—నాయనగారు! "అలమ్ఘర్" అనుబిరుదువహించియౌరంగజీబు హస్తినాపుర సింహాసనము నధిష్ఠించెను.

పండి:—మురాదుగతియేమయ్యెను ? అతనిఁ జక్రవర్తిగాఁజేసి యౌరంగజీబు మక్కాకుఁబోవుదుననిఁజెప్పి మురాదునకు మయూరసింహాసనముపై మరులుగొల్పెనే?

మహా:—మురాదు చక్రవర్తి కాఁగలఁడని తొలుతనౌరంగజీబు ప్రకటించి, మీర్జుమ్లా, సైస్తఖాన్, జైసింహాది మిత్ర వర్గమునురావించి గొప్పవిందు జేయించెను. ఆమరుదిన మునసే మురాదొక పిచ్చివానివలె వీధులవెంబడిఁ దిరిగి నేనెచక్రవర్తినని కేకలువేయుచుండెను. తరువాత నతఁ డేమయ్యెనో యాభగవంతుని కెఱుక.

పండి:—ఔరంగజేబు కుమారుఁడగు సుల్తానుమహమ్మదునకు తన కుమార్తె నిచ్చిన షుజా నావిందుకుఁ బిలువ లేడా!

మహా:—షుజానుగూడ జైసింహుఁడు స్వయముగ నాహ్వానించు టకైపోయెను. నారెపుడు వచ్చునప్పుడు వేటకై యొక యరణ్యమున విడిసిరనియు నందుషుజా పులివాతఁబడె ననియుఁ బ్రకటించిరి.

పండి:—ఆహా! ఔరంగజేబు జైసింహుల ప్రచారము! పాపము షాజహాన్ చక్రవర్తి గతి యేమయ్యెనో యెఱిఁగితివా?

మహా:—రోగపీడితుఁడైన నాముదుసలిచక్రవర్తిని యాగ్రాకోట యం దౌరంగజేబు బంధించెను.

పండిత:—అక్కటా! మహాదేవా! ఎంతమాత్ర మెఱుంగితిని! అట్టి మహావిభవముతో నేలినచక్రవర్తి కట్టి దుర్గతిపట్టెను! దైవానుగ్రహమువలన దారాప్రభువు పారసీకచక్రవర్తి సహాయము సంపాదింపఁగలిగెనేని యానాఁడుకదా మరల షాజహాన్‌చక్రవర్తిని మనముగాంచుట. (యిరువురు మఠమువద్దకువత్తురు ఇంతలో హైబత్‌ఖాన్ ఫకీరువేషముతోవచ్చి "అల్లాహో! అక్బర్!" అని కేక వేయ పండితరాయ మహాదేవులు తిరిగిజూచి).

పండి:—ఏమి! హైబత్! దారా పారసీకమునకుఁబోయి యాప్రభుని సహాయమింత త్వరలోఁ బడసెనా? మనప్రభువు సైన్యముతో వచ్చుచున్నాఁడా?

హైబత్ :—(నిట్టూర్పుతో) గురువరా! ఏమిచెప్పుదును! మీావద్ద సెలవుకైకొని మేమిరువురము బోలాను కనుమగుండఁ బోవుచుండ, మాలికజీవనుహతకుఁడు దారాప్రభువును బట్టుకొని, యారంగజేబు పక్షమున మనలను వెన్నంటి తఱుముచున్న జైసింహున కప్పగించెను. దారాప్రభువు, తనచేతియుంగరము నీవైదురత్నములను మీాకిమ్మని నాకిచ్చెను. నేను మెల్లగ నామాలికజీవను వారినుండి దప్పించుకొని బెలూచిస్థానముమీాదుగఁ దిరిగితిరిగి యిచ్చటమిమ్ముఁగలసికొంటిని. అక్కటా! చిన్ననాఁటనుండియు నాప్రభువునుసేవించి తుదకుఁ జేతులార శత్రుల కప్పఁజెప్పితిని. (అనిరోదనముసేయును).

పండిత :—ఔరా! మాలికజీవనా! ఎంతద్రోహమున కొడిగట్టుకొంటివి! నాఁడు షాజహాన్ చక్రవర్తి నిన్నేనుఁగు కాలిక్రిందఁ ద్రొక్కించుమనియిచ్చినయాజ్ఞకుఁ గరుణాసముద్రుఁడగు దారాప్రభువు నిన్నురక్షించి యాయేనుఁగుమీాదనే నిన్నెక్కించి పంపించినందులకా యీ ప్రతిక్రియ! మానవహృదయమునం దెంత ఘాతుకత్వము దాఁగియుండునోకదా! జంతుజాలముల క్రౌర్యమునందు గన్పట్టు నుదారత మానవకూరతయందుఁ గానరాదు. బెబ్బులి బొబ్బలిడక నేమృగమునుజంపదు. విషసర్పములుకూడ తమకుసహజమగు ధ్యానముసేయని దే

కలువవే! నీవుదారాప్రభుని కాతిథ్యమిచ్చుట యాతని నిర్విపత్సముద్రమునందు ద్రోచివైచుటకా! పాపము శాంతించుగాక!

హైబత్:—పండితరాయా! దుర్మార్గుడగు రాజరూపసింహు మనజాడలు రహస్యముగ జైసింహున కెఱింగించెను. అందుచే మనము మాలికజీవను ఖిల్లాకుఁబోవకమునుపె జైసింహుఁ డటమనకై కాచియుండెను. మాలికజీవను జైసింగుల కుట్రలు మనమచ్చట విడిసిననాఁటిరాత్రియె జరిగెను.

పండిత:—ఆహా! రూపసింగూ! ఓహో! యేమినీరసపుత్రరక్తము! దారాప్రభువు నిన్నుశరణుజొచ్చినప్పుడు పరమ పతివ్రతయగు నదీరాబనూకాంత మిగులరోగపీడితురా లయ్యు నిన్నుతనపెద్దకుమారుఁడగు సులేమానుతో సమముగఁజూచుకొందునని తన స్తన్యమును స్వర్ణపాత్రి యందుంచి నీకుఁబంపినప్పుడు నీవొసంగిన శరణాగత రక్షణావాగ్దానమిట్లు నెఱవేర్చితివా? ఔరా! యశ్వంతా! భళీ! రాజసింగూ! మీరుక్షత్రియులా? లేక ఘాతుకమృగములా? శ్రీరాముఁడవతరించిన సూర్యవంశమా? లేక పురూరవుని జన్మస్థానమగు చంద్రవంశమా? మీరుజన్మించినది? దారాప్రభువు మీకొనరించిన మహోపకారములను మీరువిస్మరించివను లో

కము మఱచునా ? రాజపుత్రస్థానసింహమగు జగత్సిం
హుఁడు గతింపఁగనే మీరందఱు గ్రామసింగములవలె
ద్రోహులైన జైసింగు వెనుక నిట్లు తోఁకలనాడించుట
యూ ! మీరుచేసిన మిత్రద్రోహ దేశద్రోహములవలన
భావిభారతఖండము పరతంత్రగాఢాంధకార నిమగ్న
ము కానున్నదికాఁబోలు !

గీ॥ దైవతంత్రంబు గడువఁగాఁ ♦ దరముకాదు।
పౌరుషజ్ఞానకీర్తులే ♦ పాఱునట్టి।
భరతఖండాన విజ్ఞాన ♦ భానుఁ డస్త।
మించె, విద్రోహసంఘము ♦ ల్మిన్నుముట్టె॥

కానిమ్ము హైబతూ! మహమ్మదీయులలోఁగొంద ఱౌ
రంగజీబు చక్రవర్తియైనచో హిందువులను బీడింపవచ్చునని
యూహించుచున్నారు. అంతమాత్రమున మాయార్యవిజ్ఞాన
మెన్నఁటికని నశింపదని వారుగుర్తెఱుంగుకాలము రాకపోదు.

మహా:—నాయనగారు ! ఢిల్లీపట్టణములోని పౌరులందఱు దారా
ప్రభువచ్చిన వెంటనె యొక్కుమ్మడి నౌరంగజీబుపైఁ
దిరుగఁబడుట కెదురుచూచుచున్నారు. మహారాష్ట్ర
లును, గోల్కొండనవాబును, కామరూపాధీశ్వరుఁ
డును బూర్తిగసహాయమొనరింప బద్ధకంకణులై సిద్ధ
ముగనున్నారు. వారందఱీవార్తవిన్నచోఁ జాలవిషా
దము నొందుదురు. మనమిఁకఁ జేయునదేమి ?

పండిత :—

శా. ఆనాడాసభ షాజహాన్ ప్రభువుదా • నాగానమాలించి, యే
భూనాథుం బోషించెనట్టి నయ న • న్బోజించి దారాప్రభుం'
డేనాఁడున్ వినుమీ తకుండఁగను మా • నివంచునొప్పించెనే'
నీనాఁడాతనిఁబాసి పోగుటకు నిం • కీదేహముణ్ణాల్పనే!!

కుమారా! మన మెట్టులైన షాజహాన్ దారాప్రభువులను కారాగృహమునుండి దప్పింపయత్నింపవలయు. సులేమాను సిఖీరులువచ్చిన వెంటనె మనమాగ్రాకుఁ బోవుదము. దారానుగూడ నౌరంగజీబాగ్రా కోటయందె బంధించియుండును. మాధవుఁడు ఢిల్లీ చేరెనా ?

మహా:— ఆతఁడు జుమ్మామసీదుకుఁ బోవుదారిలో ఫకీరువేషముతో మూలికల నెప్పటివలెనమ్ముకొనుచు, కవీంద్రుల సౌధము వెనుకనున్న తోటయందు పర్ణకుటీరమునఁ గాపురముసేయుచున్నాఁడు. కవీంద్రులసౌధము నౌరంగజీబు దావుద్‌హాకీమున కిచ్చివేసెను. మన సౌధముఁగూడ నెవ్వరికో మహమ్మదీయుల కిత్తురఁట.

పండిత:— వెఱ్ఱివాఁడా! అట్టి ప్రభువులె యిట్టుగిట్టున, మనము సౌధములందుట్టిగట్టుకొని యూరేగుదుమా? నీవు నీప్రొబతును మాధవునిఁగలసికొని మన మేడపైనున్న యాయుధాగారమునఁ బెనవేసినత్రాళ్లతో నల్లఁబడిన రెండు

నిచ్చెనలున్నవి. వానిని మీకక్షపాలలయందిమిడ్చి మ మ్మాగాఁ్రయందలి టాజమహాల్ ప్రక్కనున్న చిట్టడవి యందలి పర్ణకుటీరమునం గలసికొనుఁడు.

మహా:—అట్లయిన మాకు సెలవుదయచేయుఁడు. (మహాదేవ హైబతులు నిష్క్రమింతురు).

(అంత ఫకీరువేషముతోనున్న సిఫీరుఫిరోజులు మఠమువద్దకు వచ్చి, "అల్లాహో! అగ్బర్" అని కేకలువేయుదురు పండితరా యలు ముందుకువచ్చి సిఫీరును కౌఁగలించుకొని)

పండిత:—బిడ్డా! నిన్నుఁజూచిన మరల దారాప్రభువును జూచి నట్లున్నది. నీయన్న సులేమాను గనుపింపలేదా ?

సిఫీరు:—పండితరాయా! మాయన్న కాశ్మీరముమీదుగా లా హోరువచ్చుచుండ శ్రీనగరరాజగు పృథ్వీసిం గాతనిఁ బట్టుకొని జైసింహునకప్పగించెనఁట.

పండిత:—(నిట్టూర్పుతో) అక్కటా! యెంతదురంతము! దారా ప్రభువుగతియె సులేమానునకుఁబట్టెనా! హా! ఇఁక దారాప్రభువును విడిపించువారెవ్వరు ?

శా॥ దోస్తంభద్వయకుండలీకృతలస ♦ త్కోదండచండాశుగ !
ధ్వస్తోద్దండవిపక్షమండలుఁడవై ♦ దారామహీనాథుచే!
తస్తాపాపనయనంబుఁజేతువనినే ♦ ధైర్యంబుతోనుండ నీ!
యస్తోకాప్రతిమానశౌర్యమిటువ ♦ మ్మైయ్యెఁ సులేమా
న్ప్రభూ!॥

ఔరా! పృథ్వీశింగు! సామ్రాజ్యమునాక్రమింపఁ జక్రవర్తినిఁ బ్రోత్సహించి దండెత్తించుఁడు దారా షికోఁపడి నీరాజ్యమును నీకిప్పించినందులకు దారాకుమారుఁడు నీకుఁ శరణాగతుఁడైన నట్టివానిం బట్టి యౌరంగజేబునకప్పగించితివా! నీవిశ్వాసఘాతుకత్వమునకుఁ దగిన ఫలమనుభవించెదవు కాక! ఔరంగజేబు నిన్నువిడుచుననుకొనుచుంటివి కాబోలు!

సిఖీరు:—ఏమీ! పండితరాయా! మాతండ్రికూడ శత్రువులకుఁజిక్కెనా! పారసీకమునకుఁబోలేదా!

పండిత:—బిడ్డా! మీతండ్రి పారసీకమునకుఁబోవుచుండ దుర్మార్గుఁడైన మాలికజీవనాతనిఁబట్టి యౌరంగజేబున కప్పగించెను. ఏమైననేమి మనమిప్పుడెట్టులైన నీతండ్రిని నీయన్నను దప్పింపవలెను.

సిఖీరు:—అక్కటా! నేనెంతయదృష్టహీనుఁడను!

పండిత:—సిఖీరూ! విధిదప్పింపనెవరితరము? మనముచేయవలసినదంతయుఁజేయుదము. నావెంట మీయిరువురురండు.

(అందఱు నిష్క్రమింతురు)

(తెరదింపవలెను.)

---

## 2 వ రంగము

(అగ్రానుండు సూర్యాస్తమయ సమయమున టాజ మహాల్ వద్ద నొకమఱ్ఱివృక్షక్రింద ఫకీరు వేషముతోనున్న పండితరాయలు నిలచియుండ నాగ్రాకోటయందలి జైలధికారి ఖుస్రూ, టాజమహాల్ వైపునకుఁ బోవుచుండును)

ఫకీరు:—ఖాన్ సాహెబ్ "అస్సలామూలేఖుం"

ఖుస్రూ:—(తిరిగిచూచి) అజీ! "సలామూలేఖుం" మీరెవరు?

ఫకీరు:—(వృక్షముక్రిందనుండి మెల్లగనీవలకువచ్చి ఖుస్రూయెదుట నిలువఁబడును.)

ఖుస్రూ:—ఫకీర్ సాహెబ్! మీరెచ్చటనుండి వచ్చుచున్నారు

ఫకీ:—బాబా: నేను గోల్కొండనుండి వచ్చుచున్నాను.

ఖుస్రూ:—ఎచ్చటకుఁ బోవుచున్నారు.

ఫకీ:—ఖాన్ సాహేబ్! నేనుజిరకాలమునుండియు నీటాజమహాల్ ను జూచిపోవలెనని గుతూహలపడుచుంటిని. నేఁటికా యల్లా యనుగ్రహమువల్ల యిచ్చటకు రాఁగలిగితిని. మీరెవ్వరో గొప్పయధికారులవలె నున్నారు. సమయమునకు వచ్చితిరి. నన్నీదివ్యభవనములోనికిఁ దీసికొనిపోయి చూపింపఁగలరా?

ఖుస్రూ:—అజ్బే! ఫకీర్ సాహేబ్! ఈటాజమహాల్ చూచుటకు గొప్పగొప్పధనికులకే సాధ్యముకాదు. మీబోటి ఫకీరులకెట్లువీలగును? చక్రవర్తియాజ్ఞ యుండినఁగాని దానిఁజూచుటకు వలనుపడదు.

ఫకీ:—ఖాన్‌సాహేబ్! నేనూఱక మీబోటియధికారులను శ్రమపెట్టుదునా? వట్టిచేతులతో నిప్పాటకెట్లువత్తును? ఇట్టి దివ్యోపవనము నందధికారులుగనున్న మీయట్టియుద్యోగులను గట్టికొనకున్నఁ జక్రవర్తి యెట్లులాజ్ఞనిచ్చును?

ఖుస్రూ:—(తనలో) అరే! ఈఫకీరు విచిత్రముగ మాటాడుచున్నాఁడు! కొందఱుఫకీరులు బంగారమును దయారుచేయఁగలరని వాడుకకలదు. (ప్రకాశముగా) అజీ! ఈబాజమహాలుకు వేఱెయధికారికలఁడు. అతనికేమైననిచ్చినఁగాని లోనికిఁదీసికొని పోనియ్యఁడు.

ఫకీ:—అట్లయిన మీరెవ్వరు?

ఖుస్రూ:—నేను యాగ్రాకోటయందలి జైలధికారిని. నాపేరు ఖుస్రూఖాన్. సాయంకాలమగుచుండుటచే నొకసారి షికారుగ విచ్చుటకువచ్చితిని. నమాజుకూడ నీబాజమహాలునందుఁ జేసికొనవచ్చునని వచ్చుచుంటిని. నేఁడు మాచక్రవర్తి పుట్టినదినమగుటచే మాకు సెలవుదినము.

ఫకీ:—శహబాష్! బాబా! మీరుజైలధికారులా! పాపాత్ములను సదా కాపాడుచుండుటచే మీరు చాలపుణ్యాత్ములు.. (అని ఖుస్రూభుజముపై చేయివైచితట్టును.)

ఖుస్రూ:—ఫకీర్‌సాహెబ్! ఏమిపుణ్యము? మాకు జీతముతక్కువ. పనియెక్కువ. మేమెల్లప్పుడు జైలులోనె పనిచేయుచుండుటచే మాజీవితముకూడ నొకఖైదువలె నుండును

ఫకీ:—అట్లనకు బాబా! మీదిగొప్పయధికారము. మీపై నల్లాకు దయకలదు. అల్లాపాపాత్ములను కాపాడునట్లు మీరును దుర్మార్గులను కనిపెట్టుచుందురు.

ఖుస్రూ:—ఫకీర్ సాహెబ్! మీరల్లాదూతలగుటచే నట్లనుచు న్నారు.

ఫకీ:—(మెల్లగా తనజేబునుండి యొకవజ్రమునుదీసి) బాబా! చే యిపట్టుము. నీవుచాల దైవభక్తి కలవాఁడవు.

ఖుస్రూ:—(ఆత్రముతో ఫకీరు జేబువైపుజూచుచు, మెల్లగాఁజే యిఁజాచును)

ఫకీ:—(ఖుస్రూ చేతియందొక వజ్రమునుంచి) బిడ్డా! అల్లా నీకీ వజ్రమునీయమని నన్నుప్రబోధించెను. దీనిని నాకు, గోల్కొండనవాబు బహుమతిగానిచ్చెను.

ఖుస్రూ:—(సాయంకాల సూర్యకిరణప్రసార మావటవృక్షముల సందునుండి యావజ్రముపైఁ బడుటచే నదిమిరుమిట్లు గొలుపుచుండెను. ఖుస్రూ పేరాసయు, నాశ్చర్యమును మోమునదోఁప మురియుచు) ఫకీర్ సాహెబ్! మీకనేక సలాములు. మీరు పైగంబరులవంటివారు. ఇది చాలవి లువగల వజ్రమువలెనున్నది. దయచేసి యీరాత్రి మా యింటికి విందుకురావలెను. నాకును నాకుటుంబమునకు ను గొప్పయుపకారముఁ జేసితిరి.

ఫకీ:—(చిఱునగవుతో) నీవట్లనవలదు. బాబా! నీహృదయము చాలమంచిది. నీవుపెద్దకుటుంబము కలవాడవు. నాకు

భార్యకాని పుత్రులుగాని లేరు. అల్లాదయవలన శాశ్వతగు దానానుజయించి యౌరంగజేబు చక్రవర్తియగుటచే నిఁక మనమహమ్మదీయుల కెట్టిలోటును లేదు. మీబోటియధికారులు బాగున్నమాకుఁ జాలును.

ఖుస్రూ:—ఫకీర్ సాహెబ్! తప్పక మీ కీరాత్రి మాయింటఁ విశ్రమించిపోవలెను. మిమ్ము గౌరవించిన నల్లా సంతసించును.

ఫకీ:—బిడ్డా! నీయింటికిఁ దప్పక వచ్చెదను. ఒక్కసారి తాజమహాల్ నాగ్రాకోటయుఁ జూచిపోవలెనని జాల యాసక్తితో వచ్చితిని. నీవంటిభక్తుఁడీకోట కధికారియగుట మా యదృష్టము.

ఖుస్రూ:—ఫకీర్ సాహెబ్! నేనుకోటకంతకు నధికారినికాను. చక్రవర్తి తనతండ్రి నాగ్రాకోట యందుంచుటచే, దానికి తనకుమారునె యధికారిగనుంచెను. నేను షాజహానుండు భవనమును మాత్రమె కాచుకొనియుందును. ఈరోజుననె చక్రవర్తి జన్మదినమగుటచే మహమ్మదుషా తండ్రినిఁజూచుటకు ఢిల్లీకిఁబోయెను.

ఫకీ:—బాబా! ఔరంగజేబుఁ తండ్రినీకోటయందుంచి విశ్రాంతి యిచ్చుచున్నట్లు చెప్పికొందురు. తాజమహాలువంటి దివ్యభవనమును నిర్మింపఁజేసిన నాయుత్కృష్టపురుషుఁ డెట్లుండునో!

ఖుస్రూ:—(తనలో) ఈఫకీరు జేబుబరువుగనున్నది. అందింకను కొన్నివజ్రములుండనోపు. వీని కీరాత్రి భోజనమునందుఁ గొంచెము విషముకలిపి వీనినిఁగడతేర్చినచో వీని వద్దనున్న రత్నములను సంగ్రహింపనచ్చును. వీనినివదలిపెట్టుటకన్న షాజహాన్‌ను దర్శించుటయను మిషతో కోటలోనికిఁగొనిపోయి చీకటిపడువఱకు నందుంచుట కర్తవ్యము. భోజనమున కీతఁడురానిచో కోటలోనొక మూల నీతనిఁజల్లగఁ జంపవచ్చును. (ప్రకాశముగా) ఫకీర్‌సాహేబ్! షాజహాన్‌ప్రభువును మీరుచూడవలెనన్న నిదియెమంచితరుణము. వారిప్పుడు విశ్రాంతిఁదీసికొనుచుందురు. ప్రతిరోజునను ఢిల్లీనుండియౌరంగజీబుచక్రవర్తి తండ్రియారోగ్యము కొఱకు చక్కని ద్రావకమును సూర్యాస్తమయ మగుసరికిఁ బంపుచుండును.

ఫకీ:—అహా! ఔరంగజీబుచక్రవర్తికి తండ్రియం దెంతభక్తి! ప్రతిమహమ్మదీయున కట్లున్నచో నల్లా యెంతయొ సంతసించును.

ఖుస్రూ:—షాజహాన్‌ప్రభువును మీరుచూడవలెనని యున్నచో, వారిప్పుడు నివసించుచున్న యినుపకటకటాలుగల భవనముప్రక్కనున్న చిన్నిచలువరాతి మసీదునందు నమాజుచేసికొనుచుందురు. నమాజుపూర్తియైన వెంటనే వారినిఁజూడవచ్చును.

ఫకీ:—(ఖుసూ్రిఘజమునెత్తుచు) బాబా! నీవుచాలదయగల వాఁడవు. రాజమహల్ కేపరుగాఁదవచ్చును. అప్రతిభవన నిర్మాతను ముందుగదర్శించుట ముఖ్యము.

ఖుసూ్రి:—అట్లయిన నావెంటరండు. నిన్ననే చెప్పుటదిగవిడిచి నేనింటికిఁబోయి మిరాకీరాత్రి నాయింట విందేర్పాటుగా విందిచి యిష్టనైమకల వచ్చెదను. మీరు చేతితో నా దరిద్రమును బోఁగొట్టితిరి.

ఫకీ:—బాబా! నీవట్లనవలదు, మాబోటిభక్తుల కాయల్లా సాయముచేయుచుండును. చక్రివర్తిగూడ మనమహా మ్మదీయులందు చాలదయగలవాఁడు.

ఖుసూ్రి:—ఔను. ఫకీర్ సాహేబ్! నేనును మాసోదరుఁడు రహీంఖాన్ను, చెరియిరువది రూకలజీతముపై శిల్పిజెలు నం దుపనీయుద్యోగముననుండ, మేమిరువురమును దారానుబట్టి తీసికొనివచ్చినందులకు షాజహాన్ను కా చుకొనియుండుటకు నా కేబదిరూపాయిలును, ఖాసూ్రి రుభవనమున బంధింపఁబడిన దారానుకాచియుండుటకు రహీం కేబదిరూకల నిచ్చుచున్నారు. కాని యేబదిరూక లీరోజులలో సంసారములకె సరిపోవుటలేదు.

ఫకీ:—(నిర్ఘాంతపోయి నిలువఁబడును. కొంతతడవునకుఁతనలో) అక్కటా! దారాప్రభువు నింకుబంధించియుంచుసని గంపెడాసతోవచ్చితిమి! ఎంతవిపాదము! తానొకటి

తలంచిన దైవమొకటి చేయుచున్నాఁడు. కానిమ్ము.
షాజహాన్ చక్రవర్తినైన నొకసారిచూచి పోవచ్చును.
(ప్రకాశముగా) బిడ్డా! నీవౌరంగజేబు చక్రవర్తికిఁజేసిన
సేవ కాయల్లాసంతసించును.

ఖు స్రూ:—(వెనుకకుఁదిరిగి) మీరట్లు నిలువఁబడిపోయితిరేల !
ఫకీర్ సాహేబ్! త్వరితముగరండు. మిమ్ముఁ గోటలో
విడిచి నేనుమరల త్వరగరావలెను. షాజహాన్ కౌషధ
మొకగడియలో ఢిల్లీనుండివచ్చును.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెరపడును.

---

3వ రంగము.

(ఆగ్రాకోటలోని బందిఖానాప్రక్కనున్న మసీదులో షాజహాన్ నమాజుచేసికొని మెల్లగా, నడుమువంగి కర్రనూతగగొని నడిచివచ్చుచుండగ ఖుస్రూ ఫకీరులు ప్రవేశింతురు.)

ఖుస్రూ:—ఫకీర్ సాహేబ్! అతడె షాజహాన్ ప్రభువు మీరాతని
దర్శించి యిచ్చటనె నమాజుకూడ జేసికొనుచుండుడు.
నేనుమరల నిప్పుడెవచ్చెదను, (అనిఖుస్రూ నిర్గమించును).

ఫకీ:—(ఖుస్రూపోయినవెంటనె షాజహానునుసమీపించి కన్నీ
రుదుడిచికొనుచు) ప్రభూ! "అస్సలామాలేఖుం"

షాజ:—(మొగము మ్లానముగ నైకెత్తి హీనస్వరముతో) ఆ... లే... ఖుం... సాం. మీ రెవ్వరో దైవభక్తులవలె నున్నారు. మిమ్ముఁజూడఁగనె నాకొక పవిత్రమైన మహాత్మ బంధువుఁడు వచ్చినట్లున్నది.

ఫకీ:—(అటునిటుఁజూచి) ప్రభూ! నేను మీయాశ్రితుఁడనగు పండితరాయలను. మీరిచ్చట బంధింపఁబడిన విషయమును దెలిసికొని మిమ్ముఁజూచుటకై వచ్చితిని. మీరు నన్ను పండితరాజ పదవియందు నియోజించినప్పుడు నాకొసఁగిన ముద్రికయిదిగో. (అని తనజేబునుండి ముద్రికనుదీసి షాజహానుకిచ్చును.)

షాజ:—(ముద్రికనుగ్రహించి, కన్నీటితో గద్గదస్వరముతో) హా! పండితరాయా! ఎంతకాలమునకు నిన్నుమరలజూచితిని! నీవిక్కడి కెట్లురాఁగలిగితివి. ఈఁగనైన రానీయకుండ మహమ్మదుషాను, ఖుస్రూ నిచ్చటఁగాపుంచెనే!

పండిత:—ప్రభూ! ధనమునకు దాస్యముసేయని వారెవ్వరు? మీరునాకొసఁగిన రత్నసంచయము నావద్దనుండ ఖుస్రూవంటి లంచగొండియుద్యోగులను వశపఱచుకొను టెంతటిపని? నేఁడౌరంగజీబు జన్మదినము. దానానుబట్టి తనకప్పగించినందులకై మాలికజీవనునకీరోజు నౌరంగజీబు విందుచేయుచుండుటచే మహమ్మదుషా [illegible] బోయెను.

షాజ:—ఏమీ! పండితరాయా! మాలికజీవనుదారాను బట్టు కొని యౌరంగజేబున కప్పఁజెప్పెనా! అహా! కుమా రా! నీకెట్టిదుర్గతిపట్టెను! సులేమాను సిఫీరులగతి యే మయ్యెనోకదా!

పండిత:—సులేమా నొంటరిగ బంగాళమునుండి దారాప్రభు వును గలసికొనుటకై లాహోరువచ్చుచుండ కాశ్మీర రాజగు పృథ్వీసింగాతనిఁ బట్టుకొని యౌరంగజేబున కప్పగించెనఁట. సిఫీరుప్రభువు నావద్దనున్నాఁడు. ఇ మ్మిను దారాప్రభువునుగూడ నిందుబంధించియుంచు నని యెంచి మీయిరువుర నిందుండిదప్పించుటకై వచ్చి తిమి. ప్రభూ! మాలికజీవనుచే పట్టుకొనఁబడిన దారా ప్రభునియుంగరమిదిగో. (అని దారా యుంగరమును షాజహాను కిచ్చును.)

షాజ:—జగన్నాథా! ఏమినీస్వామిభక్తి! మొగలాయిసామ్రా జ్యమున నీవంటిపవిత్రచారిత్రునింకొకనిఁ గనిపెనియె ఱుంగను. దారా యీకోటయందు బంధింపబడినట్లు కనుపింపఁడు పండితరాయా!

పండిత:—ప్రభూ! దారాప్రభువును షాజహానాబాదులోని ఖా స్ఫూరుభవనమున నౌరంగజేబు బంధించెనని ఖుస్రూ వెల్లడించెను. సులేమానుజాడలింకను దెలియలేదు.

షాజ:—అట్లయిన,పండితరాయా! నాకైమీరువగవకుఁడు. నన్నుఁ దప్పించుటవలన నేమిలాభము? మీరెట్లయిన దారా సులేమానులను దప్పించుటకై యత్నింపుఁడు.

వంశీత:—నేనిఁక సెలవు తీసికొనెదను. మొగల సామ్రాజ్యమునకు సర్వనాశము జేయుట తలఁపెట్టించినది. ముప్పది సంవత్సరము లఖండవైభవముతో నిర్మింపఁబడిన విరాజమానమగు మయూరసింహాసనము నధిష్ఠింపఁగాంచిన ఘనకీర్తి ములతో నిట్టివిపరీతావస్థయందున్న మొగలాయీల నామరదృష్టమొకాక హిందూదేశ దౌర్భాగ్యమనుట నిస్సంశయము.

శా: శ్రీశ్రీరాజ్యరమాధురంధరుఁడవై ♦ శ్రీవిక్రమయూరాసనా!
త్పుల్లాంభోరుహరత్నకర్ణికపయుక్ ♦ తూఁగాడునీ మేను నేఁ
డిల్లీశాంగద లోహదండకృతకూ ♦ టాగారవాటంబులో
నల్లా ఘోరవిపత్తుపాల్పడితివ ♦ య్యా!షాజహాన్ భూవరా!॥

సీ. భువనమోహనతాజ ♦ భవననిర్మితిసేయఁ
బ్రియురాలిపైనున్న ♦ ప్రేమఁజాట!
వేయుకన్నులఱేఁడు ♦ వీక్షింపవేడ్కఁగైన,
బర్హిసింహాసన ♦ ప్రభలు వెలుఁగ!
మయవిశ్వకర్మలు ♦ మలఁచితీర్చినరీతి,
నలదివానెఖాస్ మ ♦ హాలుచెలఁగ!
భోజమహారాజ ♦ తేజంబునీయందు,
బహుకళాపోషణ ♦ పటిమమెరయ!
గీ: పైసకొకసేరు బియ్యము ♦ బ్బంగఁబ్రజల!
గాంచినీరాజ్యమంతయు న ♦ క్రమించినాఁడ!

వట్టినీకిట్టిదుర్గతి ♦ పట్టుఁబెల్ల!
భరతవర్షంబు పరులచేఁ ♦ బడుటకకట!"

షాజ:—(కన్నీరునగోటితోఁజిమ్ముచు) పండితరాయా! నేనింకను నెట్టివిపత్పరంపరలనుగాంచుటకై జీవించియుంటినోకదా!

(ఇంతలో ఖుసూ్రిప్రవేశించి యొకదా్రివకపుబుడ్డినియొక చక్కనిదంతపుఁబెట్టెను బట్టుకొనివచ్చి షాజహాన్ముందుంచి,

ఖుసూ్రి:—ప్రభూ! మీరుప్రతిదినమును దీసికొను యౌషధ మిదిగో. ఈదంతపుఁబెట్టెను మీకిమ్మని యౌరంగజేబు చక్రవర్తి పంపిరి. (అనిచెప్పి ఫకీరునుమెల్లగా నీవలకు చేయిపట్టుకొని తీసికొనివచ్చి రహస్యముగ) ఫకీర్‌సాహేబ్! ఆపెట్టెలో నేవియో విలువగలబహుమతు లౌరంగజేబు తనజన్మదినమునఁ దండ్రికిఁబంపెను. షాజహాన్ మీకేమైనఁబారితోషికమునీయగలఁడు మీరిచ్చటనెయుండుఁడు. నేనుమరల నిప్పుడెవచ్చెదను.

ఫకీ:—(ఖుసూ్రిభుజముపైఁ జేయివైచి మెల్లగా) బిడ్డా! నాకేమైన నాప్రభువిచ్చినచో నదినీకెయిచ్చివేయుదును. నావంటి ఫకీరులకు బహుమతులెందుకుబాబా! నీవుపోయి మరల త్వరగరమ్ము. నేనిచ్చటనేయుందును.

ఖుసూ్రి:—(ముఖమువికసింప చిఱునగవుతో) ఫకీర్‌సాహేబ్! ఆపెట్టె చాలబరువుగనున్నది! నాభావియభివృద్ధి యంతయు మీది. నేనింకను నింటికిఁబోలేదు! నేను వచ్చువఱకును మీరిచ్చటనెయుండుఁడు. (అనివెడలిపోవును).

షాజ:—పండితరాయా ! ఖుస్రూ వెడలిపోయెనా (అని మెల్లగ నడుగుచు).

పండిత:—(తనలో) అహో ! దిగంతివిశ్రాంతకీర్తితో నిరాఘాటము గ నీవిశాలమొగలాయిసామ్రాజ్యము నేలిన సార్వభౌముఁ డొకచిన్నజైలధికారికింతభయపడవలసి వచ్చెను! మానవజీవితములోనిమార్పునకవధియుండదు కాఁబోలు! (ప్రకాశముగా) ప్రభూ! వెడలిపోయెను.

షాజ:—(మెల్లగా) పండితరాయా! ఇంతకాలమున కౌరంగజేబునకునాపైనభిమానముకలిగినది. నాకేదియోకానిక నంపెను. ఈదంతపుపెట్టె మా నదీరా వివాహసమయమునందమూల్యాభరణములిందుంచి, రాజాజగత్సింహుఁడు నదీరాకు బహుమతిగానిచ్చెను. (అనిచెప్పుచు, పెట్టెనుగట్టియున్న బంగారుజెకీత్రాళ్ళను మెల్లగావిప్పి, పెట్టెనుదెఱచిచూచి, కెవ్వుననఱచికిందఁబడిపోవును).

పండిత:—(ఆశ్చర్యముతో నాపెట్టెనందుకొని. అందు ఖండింపఁబడిన రక్తసిక్తమగు దారాశిరమునుజూచి నిశ్చేష్టుఁడై, కొంతవడికిఁ దెప్పిఱిల్లి) అహో! ఏమిది! దారాప్రభు శిరమా! ఇదికలయా! నిజమా! అకటా! ఎంతమోసము! ఎంతఘోరము! ఛీ ! ఇట్టిమతాహంకారసంక్షోభితరాక్షసరాజ్యమునందింక నేనుజీవించియుండుట దుర్భరము! ఇదికర్మభూమియా! లేక మహాశ్మశానమా! దయా, సత్యశౌచములులేని మానవసంఘము నీభారతవర్షమెల్లా

భరింపుచున్నదో! ఈఘోరదృశ్యమునుజూచి షాజహాన్ ప్రాణములు విడిచెనుకాఁబోలు! కటకటా ! యఖండ త్యాగమూర్తులనందగు దారాషాజహాన్ చక్రవర్తులు పరలోకవర్తులైన నేనిఁక నీయార్యావర్తనమున నెట్లు వర్తింపఁగలను! అదిగో చల్లని యాయమునాతరంగిణి తన పవిత్రవీచికాహస్తములతో సన్నాహ్వానించుచు న్నది. ఈదారాప్రభునిశిరముతో నేనందుఁబ్రవేశించిన నాలోకో త్తరునిలోకాంతరమునందైన గాంచవచ్చును. (అనిదారాశిరముగలపెట్టెను జంకనిడుకొని షాజహాన్ నుండుసౌధముపైకరుగుచు వెనుకకుజూచి) ఆఁ! ఏమిది! నన్నెవ్వరో వెనుకకులాగుచున్నట్లున్నది! దారాప్రభు వా! కాదుకాదు! ఈపెట్టెయందాతని శిరమున్నదే! సిఫీరా! కాదు! సిఫీరిక్కడి కెట్లువచ్చును? (మరల రెం డడుగులు ముందుకువైచి వెనుకకుఁదిరిగి) ఏమిది! నన్నె వ్వరో వారించుచున్నారు! (తలపైకెత్తి కొంచెమాలో చించి పెట్టెలోనిశిరమువంకఁజూచి) దారాప్రభువుకావ లెను! ఔను! నేనాతనితోఁ బారసీకమునకువచ్చెదనన్న నన్నువలదని, తనబిడ్డలకొఱకై వెనుకకు మరలించెను! నేనీయమునయందుఁబడినచో తన తనయుఁడగు సిఫీరు గతి యేమగునా యని కాబోలు నన్నీ యరమోడ్పు నేత్రములతో నివారించుచున్నాఁడు. (అనికొంచెమాగి) కానిమ్ము! నేను నాప్రియ ప్రభునికైచేయవలసిన కడ

## 4 వ రంగము

(టాజమహాలువద్దనున్న చిట్టడవియం దొకపర్ణకుటీరమున)

(1) సిఫీరుషకో (2) ఫీరోజు (3) హైబత్‌ఖాన్ (4) మాధవుడు (5) మహాదేవుడు అందఱును ఫకీరువేషములతోనుండికూర్చుండియుండ పండితరాయలు దంతపుపెట్టెను జంకనిడుకొని ప్రవేశించును.

పండి:—(తెరలోనుండియె)

శా॥ లేరాపుత్రులు! లోకమందుపితరు—ల్లేరా! మహాద్రోహులై!
శ్రీరాజ్యంబులకై బరస్పరశిర—శ్ఛేదంబుగావింపరా!
ఔరా! యీ క్రియ! నేకగర్భజనితుం—డౌనన్న ద్వేషంబెదన్
బ్రేరేపన్ దల ద్రెంచి తండ్రికిసమ—ర్పింపంగ లేదెవ్వరున్॥

బిడ్డా! సిఫీరూ! చాలమోసముజరిగినది! మీతండ్రిశిరమునుఖండించి యీదంతపు పెట్టెయందుంచి మీపినతండ్రి మీతాతకుఁ గానికగనంపెను!

సిఫీరు:—(ఆతురతతో లేచి పండితరాయుని చేతియందలిపెట్టెలోని తండ్రిశిరమునుజూచి) హా! తండ్రీ! (అని కేకవైచి మూర్ఛపడి క్రిందఁబడిపోవును)

పండి:—(కన్నీరుగోటితోఁజిమ్ముచు పెట్టెలోని దారాశిరమును వక్షస్థలమున కదిమిపట్టుకొని) అక్కటా! దారాప్రభూ అట్టి చక్రవర్తి గర్భమునఁబుట్టి తుదకిట్టులైతివా!

మ. ప్రకటాదిత్య సమానపుణ్య ప్రచిమ-ప్రత్నప్రభాపచక!
చ్ఛకితాశాంత విరాజమానమగునా-చంచత్కిరీటంబుతోఁ!
వికచాంభోరుహపత్ర నేత్రముబతోఁ-వెన్గాంచు నిమస్తకం!
బకటా! యట్టికరోరకర్మ-శకుంగా-రాజ్యాంత మెట్లాప్పెనో!॥

సీ. ముంటజ్ మహాల్ దేవి-మాటిమాటికి దేవి
మూర్ఛిని మానంప-మొంపగలిగె!
హంసతూలికమించు-యానదీరాసతి
యంకంబు నేడి య-లంకరించె!
షాజహాన్ ప్రభువర్య-సకలసామ్రాజ్యంపు
భార మెట్లాప్పె-బఱుపనెంచె!
సాధుసజ్జనపాళి సన్నుతుల్ సేయంగ
వినయవిస్రమమైన-వెలసెనిద్ది!
అట్టి దారమనోహర-మకట! తమ్ము!
డాసురమ్ముగ ఖండించె-నన్నయునకు!
రాజ్యకాంక్షలు మనుజుల-రాక్షసులుగ!
మార్చి చేయించు నన్యోన్య-మారణంబు!॥

ఫకీరు:—(ముఖపై మహాదేవుఁడు తనకక్షుపాలయందలి నీరు చల్ల నాతఁడు మెల్లగ లేచి) హా! పండితరాయా! (అనిపండితరాయుని కౌఁగలించుకొని) నాకెవ్వరుదిక్కు! నేనీ జీవితాంతమువఱకు నీఫకీరు వేషముతో నుండవలసిన దేనా! అన్నా! సులేమాను! నీగతియేమయ్యెనోకదా!

మహాదేవుడు:—(సిఫీరుచేయిపట్టుకొని) సోదరా! విచారింపకుము. మీాపినతండ్రి నీతండ్రిని నీయన్నను ఖాన్పూరుభవనమునందె బంధించి యిరువురనొక్కసారి జంపించెను దాదాప్రభువు శిరోవిహీనమైన మొండెము నాప్రభువెక్కెడు యేనుగుపైనుంచి యూరేగించి, తుదకామొండెమును హుమాయూన్ గోరీయందు సమాధిఁజేయించెను. ఆదృశ్యమునుజూచిన హస్తినాపుర జనులదుఃఖము వర్ణనాతీతముగ నుండెను.

సిఫీరు:—అన్నా! సులేమాను! నన్నిట్లొంటిగవిడిచి నీవు మన తల్లిదండ్రుల వద్దకుఁబోతివా (యనిమూర్ఛబోవును.)

పండి:—శా॥ ఆహా! రాజులుపుట్టరేభువినిఁ జే-యన్ లేదె యుద్ధంబు? రా!
జ్యేహాక్రాంత దురంతచింతనో మదిన్-యేణాక్షికై మోహమో!
బాహాబాహినిఁబోరరే! యిటులనే-భ్రాతృవ్యులన్మత్సర!
గ్రాహావిష్టనికృష్టచిత్తత వృధా-కంఠంబులంగోసిరే॥

(తనలో) ఆహా! యీపసికూనయగుసిఫీరు దారుణవిషత్పరం పరాఘాతచేతస్కుఁడై హృదయము చాలచెదరియున్నాఁడు ఇతని నేమిచేయవలెనో తోఁచుటలేదు.

సిఫీరు:—(ఇంతలో సిఫీరు తెలివొంది) హా! సోదరా! నన్నెవ్వరికనాదరించువారు!

పంక:—(మెల్లగ) బిడ్డా! నీకేమి! నీవు భయమందనేల? నీవు వీరుఁడవు. నీతల్లి వీరవనిత. నీతండ్రి పరమభక్తాగ్రేసరుఁడు. నీవు ధైర్యము నవలంబించి, నీతండ్రి శిరమును గొనిపోయి యీదివ్యమైన రాజమహలునందు సమాధి చేయుము. నీవంతటితో నీతల్లిదండ్రులకుఁ బూర్తిగ ఋణముక్తుఁడ వగుదువు. లెమ్ము. దిగులొందకుము. నేనింకను మిగిలియున్నాఁడను. మనలనిరువుర నీవిశాలభారతవర్షము భరింపకపోదు. నీతండ్రిశిరమును గైకొనుము.

సీ. సకలశాస్త్రాభ్యాస-సంస్కారమొందిన
శిరము విజ్ఞానవి-శిష్టశిరము।
సర్వరసామోద-సౌరభ్యమెఱిఁగిన
శిరము బహువిబుధా-శ్రితము శిరము!
సకలకళాపూర్ణ-సారమా శిరమిది
నిఖిలమతైక్య-నియమసీమ
సాంద్రకృపామృత-చంద్రికాఘనసార
మాశ్రితకవిచకో-రాళికిరవు।

గీ॥ జనులఁబోషింప కల్పభూ-జంబుపగిది।
మొగలసామ్రాజ్య ఫలముల-మోవదగిన।
శిరము ఘోరతరముగ దాఁ-జీఱబడుట।
కేమిజెప్పుదు విధికొఱ-గామిఁగాక ?॥

(అంతదారాశిరమును దంతపుపెట్టెయందుంచి సిఫీరునకిచ్చు చు తనజేబునుండి నాలుగురత్నములనుదీసి యరచేయియందుం చికొని)

మ॥ వినుఁడీవజ్రములార! మీకతినతా—విఖ్యాతి యౌరంగజీ
బునకానాఁడెహృదంతరాళమునసం—పూర్ణంబుగానబ్బె!మీ
ఘనమాకాంతుల వెల్లిగొల్పుచు కదున్—గర్వంబుతో
నీశిరం
బున మీరిట్లిఁక జన్మసార్థకముగా—పుష్పంబులై బొల్పుడీ!॥

అని యా నాలుగురత్నములను దారాశిరముపై నుంచి పెట్టెను సిఫీరునకిచ్చును.

సిఫీరు:—(పెట్టెనుదీసికొని ఫిరోజుహైబతులు వెంటరా, టాజ మహాలులోనికిఁ బోవును)

మాధవుడు:—గురువరా! అగ్బరుచక్రవర్తివలెనే దారాషి భువుకూడ చక్రవర్తియై హిందూమహమ్మదీయవిజ్ఞాన సామరస్యతఁ జేకూర్చి దేశమునందుఁ బెచ్చుపెరుగుచు న్న సంఘద్వేష మతద్వేషముల నంతరింపఁజేయు నని మనమాసించితిమి.

పండి:—మాధవా! అగ్బరుకర్మవీరుఁడు. దారా కేవలత్యాగి. అగ్బరు కపికిశోరన్యాయముగ తనయాదర్శమును గాఢ ముగఁబట్టుకొని సాధింపఁగలధీరుడు. దారా తనసర్వస్వ మును బిల్లికూనవలె తల్లియగు దైవమునకెవదలిన

విరాగి. త్యాగులకు రాజ్యసంపదలందభిలాష లేదు. అట్టి వారికి రాజ్యభోగము లెట్టుపట్టును? కర్మయోగులుమాత్రమే యిహపరములను సమానముగ సాధింపఁగలరు. దారాప్రభునకు రాజ్యకాంక్ష యున్నయెడల నామె దర్శనమగు హిందూమహమ్మదీయ విజ్ఞానసమ్మేళనమును సాధించుటకేకాని యగ్రజువలె తన మొగలాయి రాజ్య ప్రతిష్ఠాపనము కొఱకుమాత్రమె హిందూమహమ్మదీయసఖ్య మాతఁడభిలషింపలేదు. దారాప్రభువు యోగభ్రష్టుఁడగు నొకభక్తియోగి. ఆతనిజీవితము కర్పూరదీపమువలె నిష్కళంకము. నిర్వ్యాజప్రేమరసానుభూతియె ప్రధానమగుస్వర్గసీమ నాతఁడు రాజ్యముసేయఁదగునుగాని, మహాద్రోహాభూయిష్ఠమగు నీమొగలాయి రాజ్యమునేలుట కాతఁడెట్లుసరిపడును? అట్టిమహాత్మర వ్యక్తికై మనమిఁక వగవఁబనిలేదు.

శా॥ లేదీకాలములోనధర్మ మెచటో-లీనంబుకాఁబోలునౌ!
రా! దాక్షిణ్యము! పోయెసత్య మకటా! – డాగెన్ క్షమా
శాంతులున్!
కాదీరాజ్యమునందు నిర్భరకుస-ఖ్యం బెంతసాధించినన్!
ఈ దారాప్రభుతో నెబోయె సుఖముల్ – హిందూ
ముసల్మానకున్॥

సిఫీరు:—(ఇంతలో సిఫీరు, ఫిరోజు, హైబతులు తిరిగివత్తురు). పండితరాయా! మాతండ్రిశిరమును మాయవ్వసమాధియందుంచివచ్చితిమి.

పండితః—(వికటముగనవ్వుచు) ఔరా! ఈశ్వర సంకల్పము! పాపము! మంటజ్ మహాల్ మాతకు నేఁటికి మరలఁతన కుమారునిశిరమాలింగనము చేసికొనుయానంద షహా రంగజేబుదయవలనకలిగినది! ఈవిశ్వగర్భమందలివింత లన్నిఁటికన్న మానవజీవితమె మిన్నయనియెన్నవచ్చు ను. మానవుఁడెంతయున్నతపదవియందున్న వాని జనిత మునందలిమార్పు లంత యగాధముగనుండును. సౌఖ్య మునందుకన్న విషాదమునందును, ప్రేమయందుకన్న వైరమునందును, జీవప్రకృతియందలిపరిణామము శీఘ్ర తరమనుట నిర్వివిదాంశము. (ఆకాశమువంకఁజూచి) ఆహా! ఏమి యీఅమావాస్యానిశ్యంధకారము మెల్ల మెల్లఁగనలమికొనుచున్నది!

మ॥ చరమాశాంతభవాంధకారమున వి-జ్ఞానాత్ములైనట్టిభా।
స్క-రశీతాంశులుగుప్తిఁకెఁ దారకము లా - కాశంబునం
దోఁచుటల్।
ధర దారా యుల షాజహాన్ప్రభువు ల-స్తంబొంద
రాజ్యంబునం।
బరదాస్యాంధతమిస్రబీజముల కా-వాపంబు కాఁబోల
నున్॥

(ఇంతటితో నీ మొగలాయిరాజ్యవైభవము స్తమించినదని చెప్పవచ్చును. (టాజ్మహాల్వైపునకుఁదిరిగి.)

శా॥ తేజోరాశి మహాపవిత్రాస్పదంబు జగ-ద్విఖ్యాతంబు చేసెంగదా!
రాజౌ నాయకసేవ్యమై తగ వెలుంగున్-రాజిలెన్ ఘూర్ణ స్థలా!
షాజాహాన్ప్రపంచమందు కీర్తిని మెరుగ - భ్రాజద్దివ్యపు మానసోద్యానమై!
తాజామాల్ భవనంబు! కీర్తిగను ముంతాజా-రాణి చంద్రుంబు గాన్॥

బిడ్డలారా! మనమింకసెలవునుపుచ్చుకొందము. సూఫనా! నీవుమహారాష్ట్రదేశమునకుఁబొమ్ము, మహాదేవా ! నీవును గోల్కొండయందు మీతండ్రికడకరుగుము. ఫిరోజు! హైదరు! మీరుచాలావిశ్వాసముతో దారాప్రభువునుగొల్చితిరి. అల్లాయుద్దీనుదురాగతములవలన మీపూర్వులు హిందూమతమునుండి మహమ్మదీయులుగ మార్పఁబడినను మీ రుభయమతస్థుల యందుసమానగౌరవముఁజూపుచు దారాప్రభువు నతిప్రేమతో గొల్చిరి. మీ రిఁక మీనివాసములకుఁబోయి యాలుబిడ్డలతో మీజన్మస్థానము కీర్తికరముగ నెగడునట్లు మెలఁగుదురుగాక! పాపమీనసీరు ! మిగులదిగులొందియున్నాఁడు. ఇతఁడు పసివాఁడగుటచే మనోదార్ఢ్యమునుగోల్పోయెను. నేనీబిడ్డవిషయమై కార్యశేషమును ముగింపవలసియున్నది. పోయివచ్చెదను.

(అందరు నిష్క్రమింతురు)

(తెరపడును.)



## ౫ వ రంగము.

ఢిల్లీకోటయందు సూర్యాస్తమయానంతరము, రోషనారా తన సౌధమునందొక గదియందుఁగూర్చుని యెద్దియోనాలోచించుచుండ సేవకుఁడు ప్రవేశించి.

సేవకుఁడు:—బీగంసాహిబా! ఎవరోయిర్వురు ఫకీరులు మిమ్ము దర్శించుటకై వచ్చి నగరివాకిటనున్నారు.

రోషనారా:—వారెవ్వరో తెలిసికొనలేదా ?

సేవ:—వారిలో నొకఁడు పెద్దవాఁడు. రెండవయాతఁడు పిన్న వయస్కుఁడు.

రోష:—ఎందులకై వారువచ్చిరో యరసిరమ్ము.

సేవ:—(నిర్గమించి కొంతవడికి మరలఁబ్రవేశించి యొకయుంగరమును రోషనారకిచ్చును.) అమ్మా! ఆయిరువురలోఁ బెద్దయగుఫకీరు మీకీయుంగరమునిమ్మనిఁ జెప్పియిచ్చెను.

రోష:—(ఉంగరమునందుకొని) సేవకా! ఆ యిరువురను లోనికిఁదీసికొనిరమ్ము.

సేవ:—(ఇరువురుఫకీరులతో మరలవచ్చి రోషనారాబీగమునకు సలాముఁజేసి వెడలిపోవును)

రోష:—(చిఱునగవుతో దలపంకించుచు) పండితవర్యా! చాల కాలమునకు మీదర్శనమయ్యెను. మీరింతకాలము నెక్కడనుంటిరి? మీరుచాల వేషములుధరింపఁగలరుకాఁబోలు (అనిమందహాసముఁజేయును).

పండిత:—అమ్మా! మాకెందుకును బొట్టుగడచును. మేమెంత నిగూఢము నున్న సంతమేలు. మాకు వేషముల కే లోటును లేదు. చక్రవర్తులకును జక్రవర్తినులకును మాత్రమొక్కటె వేషముండవలెను. లేకున్న వారికి జనులు గౌరవముండదు. నాకిరాజ్యమొ కిరీటమొ!

రోష:—(కిరీటమును దీసి తలపంకించుచు) పండితరాయా! నాయమ్మాకునేఁ జేసిన వాగ్దానమును మరువలేను. మిమ్మె న్నటికైన సగౌరవముగఁ జూచుటకు మా యారంగ జీబు నొప్పించెదను.

పండిత:—(వికటముగ నవ్వుచు)

శ్లో॥ "పురాసరసిమానసే వికచసారసాలిస్ఖలత్పరాగసురభీ
కృతేపయసి యస్యయాతంవయః!
స పల్వలజలేఽధునామిలదనేకభేకాకులే మరాళకులనాయ
కః కథయ "భో॥" కథంవర్తతాం ?"

ఉ॥ హాటకపద్మషండరుచి-రాంబువిభాసితమానసంబునం।
గోటిసపక్షులందుఁ దగు- కూర్మిదలిర్ప మెలంగినట్టి యా।
నీటగు రాజహంస మిఁక-నీరసపల్వలవారి కోత్రిత్రిముల్।
బీటలువారగా వదరు-భేకనికాయమునం జరించునే?॥

బీగంసాహెబా! నాకిఁక నీమొగలాయిరాజ్యమునందు గొలువుచాలు! నాకొక్కటియె కోరికగలదు. దానినిమీరు చెల్లింతుమని వాగ్దానముఁ జేసినచో నా జీవితశేషమును శాంతముగ గడపగలను.

రోష:—మీరట్లనవలదు. అల్లాసాక్షిగ మా సోదరుఁడు మిమ్మా దరించునట్లు నేనొడఁబరచెద.

పం:—శా॥ అమ్మా! మీరిఁక నెన్ని జెప్పినను మీ—యాకారంగ
జీవెన్నఁడున్!
మమ్మిన్నమ్మనె? యేటిమాట! కనమే?—మాజ్ఞా
ల మానోటనే!
క్రిమ్మంగాదె కిశోరమూషికములన్—రాగంబుతో
నిర్వారన్!
నెమ్మంజూచు నెనొక్క—రీతి ? నెదలో—నీసోదరుం
డట్లెగా !॥
నేనుదారాప్రభువుమిత్రుఁడనని యాతఁడెట్లుమఱచును?

రోష:—అట్లయిన మీకుఁగావలసిన యుపకారమెద్దియో వచింపుఁడు. దానిని నెరవేర్చి నాప్రతినఁదీర్చెదను. మీరుసందేహింపవలదు.

పండి:—ఈపసికూన దారావంశమునకు నిలచియున్న బాలకుఁడు. వీనినైనమీరభివృద్ధికిఁదెచ్చినఁజాలును. ఈతఁడు చాలమెత్తని మనసుకలవాఁడగుటచే నాతనికితటస్థించిన యాపదలను దట్టుకొనఁజాలక దిగ్భ్రమఁజెందియున్నాఁడు. షాజహాన్ చక్రవర్తి మనుమఁడౌరుల కూశిక్షము చేయుటతగదని మీకప్పగించిపోవుటకై మరల నీకోటయందడుగిడుట తటస్థించెను.

రోష:—అల్లానా! పండితరాయా! మీరెంతకైన సమర్థులు! (అని ఫకీరు వేషముననున్న సిపీరును జేరఁదీసి కన్నీరుగోటితోఁ జిమ్ముచు, గద్గదస్వరముతో) బిడ్డా! సిపీరు! నీవు భయపడకుము. నిన్నౌరంగజేబేమియుఁ జేయకుండఁ గాపాడెదను. పండితరాయా! మీరు సిపిరుకై వగవకుఁడు. మాయౌరంగజేబుకుమార్తె జబ్దతున్నీసాను సిపిరుకిచ్చి వివాహము చేయించెదను.

సిపీరు:—(రోషనారాను కౌఁగలించుకొని) అత్తా నా కెవ్వరును లేరు ఈపండితరాయలు నన్ననేకయాపదలనుండిగాపాడి మీవద్దకుఁ గొనివచ్చెను.

పండి:—అమ్మా! నాకు సెలవొసంగుఁడు.

రోష:—పండితరాయా! మీవంటి యద్భుతమేధానిధి నీ మొగలాయిరాజ్యము పోఁగొట్టుకొనుట చాలవిచారకరము.

పండి:—తల్లీ! ముప్పదిసంవత్సరములు మీరాజ్యమునందుఁ బ్రేమతత్త్వమను స్థిరపునాదులపై భారతవర్షమున హిందూమహమ్మదీయ విజ్ఞానసమ్మేళనముచే నూతనోత్తేజము నెలకొని, మొగలాయిరాజ్య మనితరసామాన్య వైభవముతో విరాజిల్లుటకై దారాప్రభువును నేనును జేసిన శాంతియుత ప్రయత్నములు దారా శిరోనికృంతనముతో నంతమయ్యెను. నేఁటి కాప్రభుతనయుని దుస్థితిచూచి రాయైన మీహృదయము కరఁగుటఁ జూడఁగలిగితిని! హృదయపరితాప సంజనితబాష్పాకుల నేత్రము

లతో దీనులనుజూచువాఁడె నిజమగువీరుఁడు. ఏనాఁడు మనమట్టి కన్నీటిబిందువొక్క టీశ్వరుని పాదారవిందము నందుంచగలుగుదుమొ యాముహూర్తముననె మన మాయల్లాను గుర్తింపఁగలము. అదియె మానవుడొనరించు విద్రోహములకు బ్రాయశ్చిత్తము. అమ్మా! మీకానాఁడు నేఁజెప్పిన ప్రేమతత్త్వపరిపాక మిదియె. భారతవర్ష మెన్నఁడును గొడ్డువోవదని గ్రహింతురు కాక. ఆర్షవిజ్ఞానమెనశించినచో నీవట్టిమట్టి కర్మభూమి యెట్లగును ? క్షాత్రప్రేమరసా విష్కృతతేజములతోఁ గురుక్షేత్రబృందావనములందు మాశ్రీకృష్ణభగవానుఁడు పూరించినపాంచజన్య వేణునాదములధ్వను లీయార్యావర్తమునందలి ప్రతియణువునందును విలీనమైయున్నవని మీ మహమ్మదీయులు గ్రహించు శుభముహూర్తమురాకపోదు. సెలవిండు. (అని సలాముచేసి పండితరాయలు ముందుకువచ్చును అంత రోషనారా సిఫీరుఁకును, పండితరాయలకునుమధ్య తెరపడును. పండితరాయలు పట్టణమువైపుజూచి). ఏమీ! ఈహస్తినాపురమిట్లు పాడువాఱియున్నదే! అక్కటా! షాజహాన్ చక్రవర్తీ! నీవిభవముతోడనే పురవైభవముగూడ నంతరించినదికాఁబోలు ఆహా! దారాప్రభూ! నీవలె నిఁక నీకరిపురవాసులఁ గాంచువారెవ్వరు?

సీ. స్వీకృతలోప నీడుగన–నేరము ముస్లీకచిచ్చపక్షితో
నాకము జేసియిచ్చెపిపి–తూరసమాత్రమైమె మేదికండలన్
లోకులమకరింపగ ని – నుం బలెన్నో మున్నొద్దాజాలనే? !
లోకమునందు నేయుగము–లోగసమిష్టికంపిన భాగముల్
ఫే ! మతముకొఱకింతరక్తపాతమా! ఇంత ద్వేషమా!

చ. మతమెన్నంగ మనోవికాసమునకై–స్వాత్మస్వనాశంబుకై!
వితతజ్ఞానవిభూతికై జగతిలో–విశ్రాంతికై ముక్తికై
గతియైయుండగ నిట్లుమానవులు యు–క్తాయుక్తశూన్యాత్ములై
మతవైరంబునఁజావ వారికెటుసం–ప్రాప్తించుస్వారాజ్యముల్? :

నేనిల్లుబయలు వెడలునప్పుడు మాతల్లిగారితో

శ్లో. ఢిల్లీశ్వరోవాజగదీశ్వరో వామనోరథాన్పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైఃపరిదీయమానంశాకాయవాస్యాల్లవణాయవాస్యాత్.

అనినామాతృభూమిని మాతనుపీడొ్కంటిని ఢిల్లీశ్వరు సేవయైనది.

మ. జననంబందినదాదిగాఁగ స్వకులా–చారంబులంజిచ్చి స
జ్జనసంఘంబులు మెచ్చరాజసభలన్–సంగీతసాహిత్యశా
స్త్రనికాయముఁదప్పిచ్చిధీరుఁడగు షా–జాహాన్ మహీనాథుఁడౌ
నన సాచివ్యముఁగంటి దేహమికనీ–కర్పింతు లక్ష్మీపతీ!

ఆహా! జగత్ప్రభూ! నీసేవయందున్నయానందము నన్నిఁక నొందనిమ్ము.

సీ॥ ఇలలోనఁ దినలేదె?-యింపెసఁగు మృద్వీక
మెక్కంగలేదె? యా-చక్కెరలను॥
చక్కని చిక్కనౌ - వెక్కసంబగుదుగ్ధ
మానితిగాదె? నీ - వాదరమున।
స్వర్గలోకానకు - నిర్గమించినవేళఁ
జూఱఁగొంటివికాదె? - సుధనుగూడ! ।
రంభాధరామృత - జృంభణల్ జవిగొంటి
పలుమారు నీ భవ - భ్రమణమందు ।
నిక్కమాడుము జీవంబ! - యెక్కడైన ।
దివ్యసుధకన్న మాటికిఁ - దేటయైన।
కృష్ణపదమాధురీధురిఁ - గీలుకొల్పు।
తీపు నేపును రుచిగంటె! - దాఁపనేల? ॥

శా॥ సేవాసక్తియెసంగనేని మనమా! - శ్రీనీనాథు సేవింపుమా।
భావప్రాప్తిచెలంగనేని నియతి - న్భావింపుచక్రాయుధున్।
నీవాలాపముసేయుచో మధురిపు - స్కీర్తింపు మేప్రొద్దు యా।
జీవన్ముక్తినిఁగోరుదేనిఁ గనుమా-చిత్తంబ ! సర్వాత్మకున్॥
భారతమాతా। నాకనుజ్ఞనిమ్ము.

సీ॥ చంద్రుఁడుఁ సూర్యుఁడున్ సహోత్ర – సాక్షులుగాఁగ వచింతుఁ దప్పక!
వాందర్పసముదగ్రకర్మమునఁ – జక్కనిముత్యము పుట్టినట్లుగా
త్రందర్పయు తామసంబు లటు – దక్కినయంతన కాలగర్భ మం!
హాం ఘలుపుట్టి యూభూనిని – హైందవజాతికి పన్నవెట్టి హిం
హేందవిపరాక్రమోద్గతి మ – హావలయంబున దుష్టశిక్ష ని
ర్వంవ్రతఁ జేసి శిష్టులను – దా త్రతగాంచుచు దేశమాతకై!
చంద్రుఁడు తారకంబు లటు – సత్తగిరుల్గలకాలమంతయుఁ
సేంవసురాసురుల్ వొగడ – సేవయొనర్చెదుఁగాంత భక్తిమై!

జైహింద్.

(తెరదింపవలెను.)

పంచమాంకము సమాప్తము!

దారావషకో – సమాప్తము.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 3 | 12 | నన్నల | మన |
| 9 | 1 | దొరగ | డొరగ |
| 44 | 19 | నట్టు | నట్టి |
| 46 | 2 | అనిర్వ్యాకల్ప | అనిర్వ్యాకల |
| 55 | 9 | ములను | ములును |
| 61 | 3 | సానుమను | సామమను |
| 61 | 3 | జెలునే | జెల్లునే |
| 61 | 3 | పంభవ | సంభవ |
| 72 | 14 | బహుతుల | బహుమతుల |
| 83 | 12 | పురుషసాల | పురుషులసా |
| 89 | 15 | విగ్రిషు | విగ్రహః |
| 132 | 2 | జాలినట్లీ | జాలినట్టి |
| 141 | 12 | కాంతమణి | కాంతామణి |
| 144 | 17 | మీరుడకూ | మీరుకూడ |
| 168 | 19 | స్త్రాపాపన యనంబు | స్త్రాపాపన యంబు |
| 179 | 3 | ననిర్ఘ | ననర్ఘ |
| 182 | 4 | యూర్యా వర్తనము | యూర్యావర్తన |